

సచిత్ర మాస పత్రిక
7 A. శివాజీ స్ట్రీట్
టి. నగర్. మద్రాసు-17.
ఫోన్ : 442001

విడి ప్రతి వెల
ఒక రూపాయి

ఏడాది చందా
పన్నెండు రూపాయలు

సంపుటి 10
ఆగస్టు 1972
సంచిక 8

సంస్థాపకులు :
కీ. శే. వి. వి. రాఘవయ్య
మేనేజింగ్ ఎడిటర్ :
శ్రీమతి వి. లీలావతి రాఘవయ్య
అసోసియేట్ ఎడిటర్:
వ్యాస్‌చంద్

Edited & Published by
V. Leelavaty Raghavaiah, 7-A, Sivaji Street, Madras-17 and Printed by B. V. Narasimha Rao, at Sri Krishna Chitra Printers 7, NageswaraRao Road, Madras-17
Associate Editor: Vyaschand

తొలి మాట 3
ఉత్తరాలు 4
ఈ ఆగస్టు '15 రోజు 6
—సుధామ
మా ఆవిడా-మారిస్ మైనరూ 10
—గొల్లపూడి మారుతీరావు
కబుర్లు
—చలసాని ప్రసాదరావు
మూడో మనిషి (సీరియల్)
—కె. రామలక్ష్మి
అమ్మ .... 34
—అజ్జరపు హనుమంతరావు
తూనికలూ-కొలతలూ 44
—డాక్టర్ మహీధర నళినీమోహన్
స్వగతమ్ 50
—చిట్టారెడ్డి సూర్యకుమారి
ఎవరు గొప్ప (పొట్టి కథలు) 56
—కొల్లకుదురు రాజశేఖర రెడ్డి
అందాల బొమ్మ 58
—గోవిందరాజు సీతాదేవి
సోనెట్ 74
—యం. రామకోటి
రామచిలక 75
—వల్లూరి విజయకుమార్
హనీమూన్ (పెద్ద కథ) 88
— యర్రంశెట్టి శాయి
మరో ప్రేమ కథ (సీరియల్) 95
—గణేష్‌పాత్రో
జపాను యాత్ర 108
—యస్. సుగుణాదేవి
సరాగమాల 116
—వి. ఎ కె. రంగారావు
సినిమా 118

ముఖచిత్రం : శ్రీరామ్ ఫిలింస్
"నిజం నిరూపిస్తా"

# తొలిమాట

భారతావని పరదేశ విముక్తి పొంది సరిగ్గా పాతిక సంవత్సరాలైంది.

ఈ మధ్యకాలంలో దేశంలో ఎన్నో మార్పులు జరిగాయి.

మహామహులెందరో రాజకీయరణరంగంలో కన్నుమూశారు.

మిత్ర రాజ్యాలు కయ్యానికి కాలు దువ్వేయి.

అయినా సమర్థించుకొని శాంతి సూక్తులతో నిలబడగలిగాం.

అగ్రరాజ్యాలు తమ రాజ్యాంగ కుతంత్రాన్ని మనపై రుద్దేందుకు ప్రయత్నిం చాయి.

నేర్పుగా తప్పుకున్నాము.

దేశంలో అరాచకం బయలుదేరింది.

శాంతితో అణచివేశాం.

కానీ, పూర్తి స్వతంత్రులము కాలేకపోయాము.

అది ఆనాటి మాట.

కానీ ఈనాడు?

మిత్రరాజ్యాల దురాక్రమణ అణచివేశాం.

భారతీయుల ధైర్యసాహసాలను, నేర్పును అగ్ర రాజ్యాలకు తెలియజెప్పాం.

దేశంలోని అరాచకాలను కూకటివేళ్ళతో కబళించివేశాం.

పెత్తందారుల పెత్తనం సడలిపోయింది.

పేద ప్రజలకు చల్లని నీడ దొరుకుతూంది.

రామరాజ్యానికి నాంది ప్రస్తావన పలుకుతూంది.

[signature]




ఎడిటర్ గార్కి,

జూలై మాసం 'జ్యోతి' ముఖచిత్రం కడు రమణీయంగా చిత్రీకరించారు. ఎంతో ఆకర్షణీయంగా ఉంది. శ్రీ గణేష్‌పాత్రో గారి 'మరో ప్రేమ కథ' సీరియల్ మా హృదయాలను స్పృశించి రసయోగంలో చరమావస్థకు తీసుకు వెళ్ళింది. అంతటి మహనీయ శక్తి కలిగి ఉన్న గోపీచంద్ రచనలను ప్రశంపిస్తున్నాము. 'ఆశల శిఖరాలు' సీరియల్ క్షణ-క్షణం ఉత్సుకత కలిగించేలా ఉంది. ఈ కథ రచనా విధానాన్ని మెచ్చుకున్నాము. రచయిత్రి యద్దనపూడి సులోచనారాణి గార్కి మా ప్రత్యేక అభినందనలు. 'పాశలేని మిత్రమా' కవిత, 'మనిషిమార్పు' కథలు కూడా మాకు బాగా నచ్చాయి. రచయితలకు మరియు మాకు అందజేస్తున్న ఎడిటర్ గార్కి ప్రత్యేకంగా అభినందనలు తెల్పుకుంటున్నాము.

—యాలాల కాశీనాధ్,
వై. సుజాత-కె రమాదేవి.
యాదగిరిగుట్ట.

* * *

'మరో ప్రేమ కథ' చాలా ఇంట్రెష్టింగ్‌గా యున్నది. మరియు మాకు చాలా ఆకర్షణీయంగా యున్నది. కాని 'ఆశల శిఖరాలు' ముగింపు చెప్పుకోదగ్గట్టుగా లేదు. 'ఉద్యోగము' కథలో శ్రమకు ఫలితం శూన్యం అక్షరాల త్రివిక్రమ్‌గారు నిరూపించారు. 'పనికిరాని పరిజ్ఞానం' ఇంట్రస్టింగ్‌గా లేదు. న్యూస్, స్టోరి మొదలగు వాటి నిర్వచనములు చాలా బాగా నిర్వచించినారు. నిర్వచించిన వారి పేరు తెలుసుకొనగోరుచున్నాము. మరియు ప్రతి నెలా కొన్నింటిని నిర్వచించెదరని ఆశించుచున్నాము. మిగిలిన కథలు, కార్టూనులు, జోక్స్ చాలా ఆనందం కల్గించినవి. ప్రతి నెలా యిలా యున్నచో ప్రతి వారికి ఆనందంగా యుండును.

—మృదుల బృందము,
హైదరాబాద్-4.

* * *

మంచికి కాలం లేని రోజులివి. శ్రమకు ఫలితం శూన్యం. శ్రమించకుండానే ఫలితం దక్కాలంటే, యజమాని తప్పులు కార్మికుని కంటబడాలి—'ఉద్యోగం'.

తాము చేయని నేరాన్ని నిరూపించుకోలేని అమాయకులంతా ఖూనీకోరులు.... డబ్బుతో, పలుకుబడితో నేరాన్ని కప్పిపుచ్చుకోగల సమర్థులు-నిజాయితీ పరులు. ఇదే మన నవసమాజ నిర్మాణంలో మొదటి ఘట్టం—'నేరమూ-శిక్ష'.

విషాలో విప్లవ గీతాలు రాసినా-పాడినా దేశం మారదు. వ్రాసిన వాడూ, పాడిన వాడూ మారినప్పుడే దేశం నగభాగం మారినట్లు—'నల్ల అంచు - తెల్ల మబ్బు'.

భవిష్యత్తులో జరగబోయే అనర్థాల్ని ముందే ఊహించి, భయపడటమే భారత వారి తత్వం. భార్యా భర్తలు ఒకే మార్గములో పయనించితే ఆ సంసారం ఆదర్శ కుటుంబం—'లాటరీ'.

పెళ్ళి చేయమని ఏ ఆడపిల్ల నోరు తెరిచి అడుగుతుంది? పాత జంధ్యం పీకి కొత్త జంధ్యం ధరిస్తే కులం తిరిగొస్తుందా?—'ఒక సావిత్రి కథ'.

ఆశ్చర్యానికి అంతుండదీ ప్రపంచంలో. ప్రేమంటే తెలియని వాడు ప్రేమించాడంటే, అదీ ప్రపంచ జ్ఞానం పూర్తిగా అవగాహన చేసుకున్న అమ్మాయి నర్తిపై చేసింది—'మనిషి-మార్పు'.

ఇంకా పీరియల్స్, కబుర్లు, స్కెచ్‌లు, జోక్స్, రాజకీయాలు-వెరసి, జూలై 72 జ్యోతి, రూపాయితో కొన్నది 'పనికి రాని పరిజ్ఞానం' కాదు.

—వి. మధుసూదనరావు,
హైదరాబాద్-36.

* * *

జూలై మాసం 'జ్యోతి'లో ప్రచురించబడ్డ అన్ని కథలు బావున్నాయి. పవని నిర్మల ప్రభావతిగారి "నేరమూ-శిక్ష"లోని 'శంకరం' పాత్ర పాఠకుల సానుభూతికి గురికాక తప్పదు.

చలసాని ప్రసాదరావుగారు మాతో ఆడిన "కబుర్లు మరువలేని పచ్చి నిజాలు. డాక్టర్ మహీధర నళినీమోహన్ రచనలు ప్రారంభిస్తున్నందులకు మీకు నా కృతజ్ఞతలు.

—శ్రీపాద సత్యం,
వరంగల్లు-2.

* * *

జూలై నెల 'జ్యోతి' ముఖ చిత్రం కృష్ణ-జమున ఎంతో ఆకర్షణీయంగావుంది. దుర్గగారి లాటరీ చదివిన తరువాత దేశంలో చాలమందికి లాటరీ పిచ్చి తగ్గుతుందని ఆశిద్దాం. 'మరో ప్రేమ కథ', గణేష్‌పాత్రోగారిది చాలా ఇంట్రస్టుగా వుంది. పవని నిర్మల ప్రభావతిగారి 'నేరమూ-శిక్ష' చదివిన తరువాత మన దేశంలో న్యాయం ఇలా వుందా అనిపిస్తూంది. శ్రీమతి యద్దనపూడి సులోచనారాణిగారి 'అగాధ శిఖరాలు' ముగింపు చాలా బాగుంది.

—ఉపాధ్యాయుల అన్నపూర్ణ,
జయపురం.

* * *

# ఈ ఆగస్టు '15 రోజు

జాతి చైతన్యలహరి
ప్రగతి శిఖరాగ్రాలలో
శాంతికపోతానికి
ఆనందపు గిలిగింతలు పెడుతున్నరోజు.
ఇన్నేళ్ళ స్వాతంత్రపు అనుభవాలు
మహతి శతతంత్రీ విపంచిలా
ప్రతి ఎదలో మ్రోగుతున్నరోజు.
పాతికేళ్ళ స్వేచ్ఛా జీవితాన్ని
తలపోతల కలబోత చేసుకుంటున్నరోజు.
యువ భారతీయుల్లో
నవభావనలు పండుతున్నరోజు.
త్రివర్ణ సు'వర్ణ' రజతాధ్యాయానికి
శ్రీకారం చుట్టుకుంటున్నరోజు.
వర్తమానపు ఆలోచనల అందం
భవితవ్యపు ఆశల అద్దంలో
కనబడుతున్నరోజు.
కొత్త బాధ్యతలు గుర్తించాల్సినరోజు.
దేశభక్తి అగరొత్తులు
వెలిగించుకోవాల్సినరోజు.
స్వేచ్ఛా పరిరక్షణకు హృదయంలో
ప్రతివాడూ పట్టం కట్టుకోవాల్సినరోజు.
భారత స్వాతంత్ర్య రజతోత్సవాల
పండుగరోజు.
నేడే
ఆగస్టు '15;
అమందానందకందళిత హృదయారవిందాలతో
ఆంధ్రజనత అలరారే రోజు.
భారతజనత బ్రహ్మానందపడేరోజు.
చరిత్ర దీపావళిలో
కొత్త జ్యోతి వెలిగించినరోజు.
నేడే స్వతంత్ర్య రజతోత్సవాల పండుగరోజు.

—సుధామ




గత పాతిక సంవత్సరాలుగా భారత-పాకిస్తాన్ దేశాల మధ్య వైషమ్యం ఉభయ దేశాల ప్రజల జీవితంలో ఎంతగా చెలగాటమాడిందో తెలియజేసే ఉదంత మొకటి సిమ్లా శిఖరాగ్ర సమావేశం సందర్భంగా బయట పడిందట. దేశ విభజన తరువాత ఒక హిందూ మతస్థుడు భారత దేశానికి రాకుండా లాహోర్‌లో వుండి పోయాడట. పాకిస్తాన్ పౌరుడయాడట. 1965 తరువాత ఆయనకు భారతదేశంలో వున్న తన పిల్లలతోగాని, ఇతర బంధువులతోగాని ఎలాంటి సంబంధం లేకుండా అయిందట. ఆయన వారికి వుత్తరాలు రాయకుండా, తన వాళ్ళ దగ్గరనుంచి ఉత్తరాలు అందుకోకుండా పాకిస్తాన్ ప్రభుత్వం ఆంక్ష పెట్టింది. తండ్రిని పిల్లల నుండి పూర్తిగా వేరు చేసింది. ఒకరి క్షేమసమాచారాలు యింకొకరికి తెలియకుండా పోయింది. భారత-పాకిస్తాన్ సంబంధాలను బాగు చేయవలసిన అవసరాన్ని గూర్చి చర్చిస్తున్న సమయంలో భారత ప్రతినిధి వర్గం యీ ఉదంతాన్ని దృష్టాంతంగా పేర్కొన్నప్పుడు పాకిస్తాన్ ప్రతినిధి వర్గం వారు వెంటనే లాహోర్‌కు టెలిఫోను చేసి ఆ హిందూ మతస్థుడు కులాసాగానే వున్నట్టు తెలుసుకున్నారట. భారతదేశంలో ఆయన కుటుంబ సభ్యులలో ఒకరి వివాహానికి వెళ్ళడానికి అతనికిప్పుడు అనుమతి లభించినదట.

ఇదొక ఉదాహరణ మాత్రమే. ఈ రెండు దేశాలలోనూ వున్న బంధు మిత్రుల మధ్య సంబంధాలు లేకుండా వున్నవారు చాలమంది వున్నారు. రాజయాలు మానవ సహజ సంబంధాలను ఎలా కత్తి పోట్లు పొడవగలదో దీనివల్ల మనకి స్పష్టమవుతుంది.

ఇదివరకెన్నడూ పాకిస్తాన్ పాలకులు మానవ విలువలను లక్ష్యపెట్ట లేదు. పోనీ హిందువుల మీద వైషమ్యంతో భారత దేశం మీద దాడులు జరిపారేమో అనుకోడానికి కూడా వీలులేదు. ఎందుకంటే వారికి మహమ్మదీయులన్నా అభిమానం లేదు. కాబట్టే తూర్పు బెంగాల్‌లో లక్షలాది మహమ్మదీయుల్ని చిత్రవధ చేశారు.

ఇక మీదనైనా పాకిస్తాన్ పాలకులు యీ అమానుష విధానాన్ని మానుకుంటే భారత ఉపఖండంలో, ప్రజలు ప్రశాంత వాతావరణంలో జీవించగలుగుతారు. ఈ ఉద్దేశంతోనే శ్రీమతి ఇందిరాగాంధీ సిమ్లా

సమావేశంలో భుట్టో సామరస్యానికి కావడానికి ప్రయత్నించింది. వెయ్యి సంవత్సరాల పాటు భారత దేశంతో యుద్ధం సాగిస్తానన్న శ్రీ భుట్టోకు సిమ్లా సమావేశంలో జ్ఞానోదయమయినట్టు కని పిస్తూంది.

ఉభయ దేశాలమధ్య వివాదాలనన్నిటినీ మూడవ రాజ్యప్రమేయం లేకుండా, బల ప్రయోగం లేకుండా, పరస్పర సంప్ర దింపుల ద్వారా పరిష్కరించుకుంటామని ఉభయ దేశాల నాయకులు ఒప్పందం చేసుకున్నారు. వాణిజ్య, సాంస్కృతిక తదితర సంబంధాలను పెంపొందించు కుంటామన్నారు. కాశ్మీరులో మినహా తక్కిన ప్రాంతాలలో ఆక్రమిత ప్రదేశాల నుండి తమ తమ సేనలను ఉపసంహ రించుకుంటామన్నారు. కాశ్మీరు సమస్యా పరిష్కారానికీ, తక్కిన సమస్యల పరి ష్కారానికీ మున్ముందు యిలాంటి శిఖ రాగ్ర సమావేశాలు జరుపడానికి నిశ్చ యించారు.

ఈ ఒప్పందం నిజంగా అమలు జరిగి నట్టయితే భారత ఉపఖండంలో శాంతి నెలకొనగలదన్న విషయంలో సందేహం లేదు. మూడవ రాజ్యప్రమేయం లేకుండా రెండు దేశాలమధ్య శాంతియుత సంప్ర దింపుల ద్వారా వివాదాలను పరిష్కరించు కోవడమన్నది చాల ముఖ్య విషయం. కాని యిది ఎంతవరకు సాధ్యమో వేచి చూడాలి. నేటి రాజకీయ ప్రపంచంలో ప్రత్యక్షంగా గాని పరోక్షంగా గాని ఇతర దేశాల, ముఖ్యంగా అగ్ర రాజ్యాల ప్రభావం నుండి తప్పించుకుని బతకడం ఏ ఒక్క దేశానికి సాధ్యమయేటట్టు లేదు. ఇది సాధ్యమయేటట్టు చేయాలని శ్రీమతి ఇందిరాగాంధీగారి ఉద్దేశమయి వుండొ చ్చును.

సేనల ఉపసంహరణను అంగీకరించి నందుకు భారత ప్రధానిని కొందరు విమ ర్శిస్తున్నారు. కాని యిది సద్విమర్శ కాదు. ఎందుకంటే పాకిస్తాన్ భూభాగాన్ని ఆక్ర మించుకోవాలనే కోరిక భారత దేశాని కెన్నడూ లేదు. ఎప్పుడో ఒకప్పుడు ఎవరి ప్రాంతాలు వారికి వెళ్ళవలసిందే. ఏ చిక్కులూ లేనంతమేరకు ఆ పని వెంటనే జరగడం మంచిదే.

భారత-పాకిస్తాన్‌ల మధ్య సుహృద్భావ వాతావరణం కలిగించాలని శ్రీమతి ఇందిరా గాంధీగారి ఆశయం. ఆ ఆశయం నెర వేరితే ఉపఖండంలో శాంతి నెలకొన గలదని ఆమె ఆశ. శ్రీ భుట్టో కూడా సిమ్లాలో విజ్ఞతతోనే ప్రవర్తించాడు. ఉభయ దేశాలమధ్య సంబంధాలు బాగు పడగలవనే ఆశ కల్పించాడు.

కానీ అన్ని సమస్యలూ యితరుల ప్రమేయం లేకుండా ఉభయ దేశాలమధ్య సంప్రదింపుల ద్వారా పరిష్కరించుకో డానికి ఒప్పందం మీద సిమ్లాలో సంతకం పెట్టేక రెండు వారాలు తిరక్కుండానే




శ్రీ భుట్టో పాకిస్తాన్ శాసన సభలో ప్రసంగిస్తూ, యీ సంప్రదింపులు విఫలమైతే కాశ్మీరు సమస్యను తాను ఐక్యరాజ్య సమితికి తీసుకు వెళ్ళగలనని అపశ్రుతి ప్రారంభించాడు. కాశ్మీరు ప్రజలు భారత దేశపు సంకెళ్ళనుండి కాశ్మీరును విముక్తి చెయడానికి, స్వాతంత్ర్య పోరాటం ప్రారంభించాలన్నాడు. అలాంటి పోరాటం ప్రారంభిస్తే పాకిస్తాన్ దానికి అన్నివిధాల సాయపడుతుందన్నాడు, కాశ్మీరు ప్రజల కోసం పాకిస్తానీయులు తమ రక్తాన్ని ధారపోయడానికి వెనుదీయరన్నాడు.

తన దేశంలోని ప్రతి కక్షులనూ, ఉగ్రవాదులనూ, అవతల అమెరికాను, ఇవతల చైనాను తృప్తి పెట్టడానికి మాత్రమే భుట్టో బయటికలా అంటే ఏమంత ప్రమాదం లేదు. కాని మనస్ఫూర్తిగా అంటే మాత్రం ప్రమాదం.

కాని భుట్టో అదే ప్రసంగంలో కాశ్మీరుకు స్వయం నిర్ణయాధికారం 1948లో పాకిస్తాన్ ఐక్యరాజ్య సమితి తీర్మానాన్ని అంగీకరించడంతోనే పోయిందన్నాడు. మళ్ళీ కాశ్మీరు సమస్యను ఐక్యరాజ్య సమితికి తీసుకువెళ్ళినా ప్రయోజనం లేదన్నాడు. ఈనాడు పాకిస్తాన్ భారతదేశంతో యుద్ధం చేసే స్థితిలో లేదన్నాడు.

ఇదీ భుట్టోగారి గందరగోళం. కాని రెండు ముక్కలైన పాకిస్తాన్ భారత దేశంతో యిక మీదట యుద్ధం చేయడం అసాధ్యమనే విషయం గ్రహించినట్టుగానే వుంది. ఇప్పటికైనా పాకిస్తాన్ నాయకులకు కనువిప్పు అయితే మంచిదే. లేకపోతే తాష్కెంట్ సరళికి పట్టిన గతే సిమ్లా సరళికీ పట్టే అవకాశముంది.

—కృష్ణవేణి

# మా ఆవిడా, మారిస్ మైనరూ

గొల్లపూడి
మారుతీరావు



అసలు నేను కారు కొని తీరాలని మా ఆవిడికి ఆలోచన వచ్చింది——ఇంజనీరుగారి భార్యతో పేరంటానికి వెళ్ళినప్పుడు

ఒకసారి కుంకుడుకాయలు అప్పడిగితే యివ్వలేదనీ, మా పెరట్లో జామచెట్టు వాళ్ళ కాంపౌండులోకి వంగితే రెండుకాయలు

తెంపేసుకున్నారనీ, పచ్చడి రుబ్బుకునే రోకలిబండని యివ్వమని పనిమనిషిని కబురు పంపిస్తే యివ్వలేదనీ ఇంజనీరు గారు భార్య మీద మొదట్నుంచీ కోపంగానే వుంది మా ఆవిడకి.

ఏంచాతనో ఆ రోజు పేరంటంలో కలిస్తే-మాట వరుసకి తనతో కారులో రమ్మని ఆవిడ ఆహ్వానించిందట. మా ఆవిడ పిల్లలతో సహా కారులో కూర్చుందట. అంతవరకూ బాగానేవుంది. కారులో ఉండగా పసుపు అంటుకున్న చేతుల్ని కారు సీట్లు మీద దులుపుకో బోయిందట. ఆవిడ గమనించి వెంటనే "కొత్త సీట్లు కవర్లండి పాడవుతాయి'' అందట. అంతే. ఆ మాట నా ప్రాణం మీదికి వచ్చింది.

నేవారోజు సైకిలుదిగి యింట్లోకి రాగానే చిరునవ్వుతో ఎదురయింది మా ఆవిడ. అప్పుడే మనస్సు ఏ మూలో కీడు శంకిస్తూనేవుంది దానికి తోడు. కాళ్ళూ, చేతులూ కడుక్కోగానే 'గులాబ్‌జామ్' ప్లేటు తెచ్చి చేతికి అందించింది. అంతే. నాకు గుండె జారిపోయింది. ఏదో పెద్ద ప్రమాదానికి సిద్ధపడిపోయాను. అయాచితంగా మా ఆవిడ చేసే సేవల మీద నాకు బొత్తిగా నమ్మకంలేదు. ఆఫీసు మంచి వచ్చాక-బుజ్జిగాడిని చుట్టుప్రక్కల అయిదారు యిళ్ళకు పంపితేకాని కనిపించని మాఆవిడ. యింట్లో ఉండడం ఇలా ఫలహారం అందించడం—పాకిస్తాన్‌వాళ్ళు హఠాత్తుగా స్నేహితులయి పోయినంతటి షాక్ నాకు.

ప్రక్కింటికెళ్ళి పప్పు రుబ్బుకొచ్చేందుకు కారు. మిషను కెళ్ళి పసుపు పట్టించుకొచ్చేందుకు కారు.

ఇండియాలో మారిస్‌మైనర్ కారులు వున్నంతకాలం రుబ్బురోళ్లు,రోకళ్లూ హాయిగా కారులో ప్రతి యిల్లు తిరుగుతూనే వుంటాయి.

సరే, నెలాఖరుఅయినా యాభై రూపాయల చీరెకి "ఇవాళ వొంట్లో ఏం బాగు లేదా? ఈ స్వీట్సు అవీ ఎందుకు చేసేవ్?'' అని నీరసంగా అడిగాను. మా ఆవిడ చిలకలాగ నవ్వింది ఆ మాటకి. మా ఆవిడలో నేను ఆనందించే తక్కువ విషయాల్లో ఆ నవ్వొకటి. అదిచూడగానే మనస్సు ఎయిర్‌కండిషన్ చేసినటు అయిపోయింది.

''మీరు మరీనండీ. నాకు వంట్లో బాగులేకేం? రోగం-బాగానే వుంది'' అంది.

ఆ తర్వాత మెల్లగా అసలు విషయం చెప్పింది. కారు-పేరంటం పసుపు చేతులు ఇంజినీరు గారి భార్య అన్న మాటలు— వగైరా.

అంతా చెప్పి-ముఖం ఎర్రగా చేసు కొని-"ఇంతోటి బోడికారుందని-ఆవిడకి మిడిసి పాటు చెయ్యివిదిలించుకో బోయే సరికి నోర్మంది కదా అని మాట అనే సింది. ఆవిడకి తగిన పాఠం చెప్పక పోతే నేను ఆదిభట్ల వెంకటనారాయణ కూతురునే కాదు. నా పేరు అప్పల నరసమ్మే కాదు." అంది.

"నువ్వు కాదన్న అవక తప్పుతుందా ఏమిటి? నీకు కోపం వచ్చిందని పేరు మార్చుకుంటే తర్వాత చాలా చిక్కు లున్నాయి. కొత్త పెళ్ళాన్ని తెచ్చుకున్నా వనుకొని నా వుద్యోగం తీసేస్తారు. యింతకీ ఎలా పాఠం చెప్పదలచుకు న్నావు." అన్నాను మనస్సు ఎదోకీడును శంకిస్తూండగా.

"ఎలాగేమిటండీ. మళ్ళీ వరలక్ష్మి వ్రతం నోము నాటికి మన సొంతకారులో పేరంటానికి వెళ్ళి తీరాల్సిందే."

ఆ మాట వినగానే నాకు శరీరమంతా తిమ్మిరెక్కినట్టయిపోయింది. చెవులు పని చెయ్యడం మానేశాయి. పదిరోజులు పత్యంమీద బతికిన టైఫాయిడ్ రోగిలాగ నరనరాల్లోను నీరసం వచ్చేసింది.

"నరసూ- నువ్వు చెప్పింది సరిగ్గా విన్నానా లేదా?" అన్నాను ఇంకా అను మానంగా.

"వినిపించకపోతే మళ్ళీ చెప్తావినండి. వచ్చే వరలక్ష్మి వ్రతానికి-మనం కారులో వెళ్ళాలి. ఆవిడకి రోగం కుదరాలి" అంది.

కుదిరేది ఆ విడ రోగం కాదని నాదని మా ఆవిడకి వచ్చి చెప్పలేక పోయాను.

"పోనీ రెండు జతల కారు సీటు కవర్లు కొనిస్తాను. పీకపతీరా వాటినిండా పసుపు జల్లెయ్. వాళ్ళింటికి తీసుకెళ్ళి చూపించి వస్తాను. ఆవిడ రోగం కుదిరి పోతుంది." అన్నాను.

"ఛీ ఛీ నేను పంతం పట్టాక అలా లాలూచీ పడతాననుకున్నారేమిటి?" అని కసురుకుంది.

అప్పటికి ఊరుకుని మళ్ళీ రాత్రి వచ్చి చెప్పబోయాను: "నరసూ! నాకు 500 రూ॥ల జీతం అని మరిచిపోయావా?"

"మరేం ఫరవాలేదు. ఆ యింజినీరు గారికి అంతేగా జీతం?"

"ఆయన రెండు చేతుల్తోనూ సంపా దిస్తున్నాడు."

"మీకు సంపాదించడం చేతకాదని చెప్పండి."

"కాలేజీ లెక్చరరు గాడికి ఎవడిస్తాడే లంచాలు? సరిగ్గా కాపీ కొట్టనివ్వక పోతే




పొడిచేస్తా మంటున్నారు స్టూడెంట్లు అన్నాను దిగులుగా.

కానీ మా ఆవిడ నిర్ణయం చెక్కు చెదరలేదు. ఇంటి ఖర్చులు ఎలా ఆదా చేస్తుందో చెప్పింది.

ఇకనుంచీ రాత్రివేళ రొట్టెలు చేస్తుందట. కొబ్బరికాయల ధర పెరిగిందిగనుక ఆ పచ్చడి మానేస్తుందట పట్టు జర్తారు చీరెకు బదులు కోయంబత్తూరు చీరెలు వాడుకొంటుందట. ఇక నుంచి కోపం వచ్చినా రివాజు ప్రకారం పుట్టింటికి సంవత్సరానికి 3 సార్లు కాక 2 సార్లే వెళ్తుందట యిలాంటివి చాలా చెప్పింది.

'ఇదంతా ఒకవారం పెట్రోలు ఖర్చుకు రాదన్నాను.' అంతే ఆవిడికి కోపం వచ్చింది. ఆ మర్నాడు కొబ్బరికాయ పచ్చడి మాట దేవుడెరుగు?—కంచంలో కూరలేదు. రాత్రి రొట్టెలులేవు మజ్జిగలో పులుపు ఎక్కువయింది. బాయిలర్ వేడెక్కలేదు. వాయిదాల ప్రకారం పిల్లల వీపులు వరసగా ఛెళ్ళుమంటున్నాయి. రాబోయే యుద్ధానికి యిది సూచన.

మరో పద్ధతి చెప్పాను మా ఆవిడకి. "ఇంజినీరుగారి భార్య సీటు కవర్ల మీద నీ చేతులు దులుపుకోనియ్య లేదన్నావు. బాగుంది. రేపు తెల్లవారు ఝామునే వాళ్ళ

కాంపౌండులోకి దూరి బ్లేడు పెట్టి ఆ సీటు కవర్లని కోసేస్తాను. పీకసి తీరిపోతుంది కదా?'' అన్నాను - జీవితంలో ఎప్పుడూ ఎరుగని దొంగతనానికి కూడా సిద్ధ పడుతూ.

''ఛీ-ఛీ! అలాంటి పని చెయ్యడానికి మీకు సిగ్గు లేదూ?'' అంది. నిజమే! సిగ్గు పడిపోయాను మా ఆవిడ చెప్పాక, ఆవిడ పంతానికి వాళ్ళాయన తల వొంచి కారు కొనిపించడానికి సిగ్గు పడడం లేదు కాని. నేను గోడ గెంతితే మా ఆవిడ సిగ్గు పడి పోయింది. సంస్కారం కూడా ఒకప్పుడు అలా ఎదురు తిరుగుతుంది కాబోలను కున్నాను.

సరే యింక ఏ మార్గమూ కనిపించ లేదు. పది రోజులు మానసిక చిత్రవధని అనుభవించాక - బేషరతుగా నా ఓటమిని అంగీకరించాను. కారు కొనడానికి నిర్ణయ మయింది.

ఒక మంచిరోజు చూసి యిద్దరం కూర్చుని డబ్బు ఎలా సమకూర్చుకోవాలని లెక్కలు వేశాం. నా కాలేజీ పరీక్ష పేపరు దిద్దిన డబ్బు 256 రూపాయలు. బాంకులో డబ్బు మరో రెండు వందలు కనిపించింది. పండగకి కొత్త బట్టలు కొనుక్కోడానికి వాళ్ళ నాన్న పంపించిన 100 రూపాయలు అతి ఉదారంగా నాకివ్వడానికి అంగీక రించింది మా ఆవిడ. అంతా చేరి 556/- అయింది. నా జీ. పి. యఫ్ లోనే 2000 తీశాను మరో రెండు వేలు అటు పడి-ఇటు పడి ఒక కాబూలీవాలా దగ్గర జీవి తంలో మొదటిసారిగా అప్పు చేశాను.

వారం తిరక్కుండా మరో దుర్వార్త తెచ్చింది మా ఆవిడ. వీధి చివర మిలటరీ మేజర్ కర్తాన్‌సింగ్‌కు బదిలీ అయిందట. మరొకప్పుడయితే ఆ వార్త అశరీరవాణి చెప్పిన దివ్యసందేశం లాగ నా చెవులని వినిపించేంది. ఎందుచాతనంటే ఆ మేజర్ కారు వల్ల, దాని శబ్దం వల్ల ఖాయిలా పడి పోయిన దురదృష్టవంతుల్లో నేనొకణ్ని. అయితే వెంటనే దుర్వార్త మా ఆవిడ చేర్చనే చేర్చింది. అతని కారు అమ్మ

ఎస్. ఎస్. ఎల్. సి. ———

● స్కూలు జీవితంలో చివరి మెట్టు.

(పెద్దల మాటల యెడల నమ్రత, వినయ విధేయత మొదలుగాగల (సు)గుణాలు వదలివేయు దశ)

లనుకొంటున్నాడట. అది వినగానే నా గుండె పగిలి పోయింది. నిజానికి ఆ మేజర్ మా వీధికి వచ్చినప్పట్నుంచీ వీధిలో ఎవరూ సుఖంగా నిద్ర పోలేదు. ఆయన కారు పదేళ్ళనాటి మారిస్ మైనరు. రాత్రీ-పగలూ నడిచినప్పుడల్లా కంకర రాళ్ళ బండీ వెళ్ళినట్టు హోరెత్తించేస్తుంది. వెలుగు రాపిన కుక్కగొంతులాగ హారన్. రాత్రి తాగి వస్తాడేమో హారన్ మీద చెయ్య తియ్యడు. కారంతా ఒక పక్కకి వంగి పక్కకి నిలబడిన వాళ్ళకి తమమీదకి వచ్చేస్తున్నట్టుంది ఆ కారు. అరమైలు దూరం నుంచీ దానిచప్పుడు — పిండి మర లాగ కిరకిరలాడుతూ వినిపిస్తూంటుంది. రెండీళ్ళవతల హెడ్మాష్టరుగారికి ఆ శబ్దం వినలేక గుండెజబ్బు ఎక్కువయి మంచం పట్టాడు. ఆయన వెళ్ళిపోతున్నాడంటే వీధివీదంతా ఏకగ్రీవంగా సంతోషించారు. కాని దాన్ని మా ఆవిడ నా చేత కొనిపిం చాలనుకొంటోందని విని అందరికి బెంగ ఎక్కువయింది. ఓ పది మంది చిన్న కమిటీలాగ ఏర్పడి నా దగ్గర రాయబారం వచ్చారు ఆ కారు కొనవద్దని. మరీ ముస లాయన, ఇన్కం టాక్సు ఆఫీసరు గారి తండ్రి. "అయినా బడిపంతులకి నీకు కారెందుకయ్యా. పోయే కాలమా?" అన్న భావం కాస్త మెత్తటి మాటల్లో వ్యక్త పరిచాడు. ఆ బృందానికి రెండు చేతులూ జోడించి "అయ్యా ఆ కారుమీద మీ కెంత సదభిప్రాయం వుందో నాకూ అంతే సదభిప్రాయంవుంది. నా అంతట నన్ను అది కొంటావా అర్ధసేరు వంటా మదం తాగుతావా అంటే, మంచి నీళ్ళ ప్రాయంగా ఆ మదమే సేవిస్తాను. మీకు దమ్ముంటే మా ఆవిడని ఒప్పించండి." అన్నాను వాళ్ళు మా ఆవిడ నోరుకి భయపడి వెనక్కి వెళ్ళారు. అయినా ఆశ చావక ఒక మహిళా బృందాన్ని మా ఆవిడ మీదకి తోలారు. కాని ఆవిడ అభి ప్రాయాన్ని ఆడవాళ్లెవరూ మార్చలేక పోయారు.

"విశేషంలాంటి కారు మనం కొను క్కొంటూంటే కళ్ళు కుట్టి వాళ్ళు ఏడుస్తు న్నారు" అంది.

పి. యు. సి. ——————————

● విశ్వవిద్యాలయానికి తొలి మెట్టు.

(వ్యక్తిత్వం, నాయకత్వం, ఆ తత్వం, ఈ తత్వం (అవసరమైతే అసలు తత్వమే మారిపోవచ్చు) నేర్చుకొనే తత్వాల తొలి దశ.)

"నిన్నటి దాకా ఆ కారునీ, ఆ మేజరునీ నువ్వూ తిట్టావు కదేః" అన్నాను.

"అది వేరే సంగతి. నిన్న నేను చూసివచ్చాను. గచ్చకాయ రంగుకారు. బుజ్జిముండ—ఎంత ముద్దుగా వుందను కొన్నారు." అంది ఆనందంతో లుస్మ తిరిగిపోతూ.

"బుజ్జిముండ ఎవరు" అన్నాను అర్థం కాక.

"అదేనండీ-కారుః" అంది. నా పెద్ద కొడుకుని కూడా మాఆవిడ అంత ముచ్చటగా లాలించి వుండదు. తీరా అంత వ్యామోహం పెంచుకున్నాక ఇంక కొనక గత్యంతరం లేదని అర్థమయిపోయింది.

ఒక మంచిరోజు చూసి ఓ సాయంకాలం మేజర్‌గారింటికి వెళ్ళాను. ఆయన విస్కీ-పేవిస్తూ మంచి కిక్కులో వున్నాడు. ఆయన కారు కొనాలనుందని చెప్తే మొదట షాక్ అయిపోయాడు. తన జీవితంలో ఆ కారు అమ్మడం సాధ్యమవుతుందని వూహించలేదనుకుంటాను. ఎగిరి గెంతేశాడు-నా ఆర్థికస్థితి, ఆ కారు కొనడానికి కారణాలు అవీ వివరించి—కేవలం 4000/- యిచ్చుకొంటానని మొరపెట్టుకొన్నాను. నానోట్లో మాట నోట్లో ఉండగానే అంగీకరించాడు మేజర్.

అంతేకాదు. మర్నాడే ఆ కారు మాయింట్లో తీసుకువచ్చి వదిలేశాడు మేజర్. ఆ రోజు మా ఆవిడ ఆనందం వర్ణనాతీతం తన పెళ్ళి నాడు కూడా అంత ఆనందంగా కనిపించలేదు. కారుకి హారతిచ్చి, దిష్టితీసి, నా చేత వట్టుపంచ కట్టించి పూర్ణకుంభంతో ఎదురు తీసుకు వెళ్ళి దానికి నోటికొచ్చిన పద్యాలన్నీ చదివింది- ఆంజనేయ దండకము మొదలుకొని, సరస్వతీ నమస్తుభ్యం వరకూ. కారు కొనడంతో నా సమస్యలు తీరిపోతాయనుకున్నాను కాని కొత్త సమస్యలు ఎదురవుతాయని వూహించలేదు

ఆ మర్నాటి ఉదయం అయిదు గంటలకే లేచి నన్నూ లేపి కారు శుభ్రం చెయ్యడానికి రెండు బాల్చీల నీళ్ళు అందించింది. "అంత డబ్బుపోసి కారుకొన్నాక దాన్ని శుభ్రంగా ఉంచుకోకపోవడం ఎలాగండీ" అంటూ.

ఆ రోజునుంచి అయిదు గంటల నుంచి ఆరువరకూ కారువెనుక సీటులో నిద్రపోవడం అలవాటు చేసుకున్నాను.

ఒక రోజు హఠాత్తుగా గుర్తుచేసింది. "ఏమండోయ్ ఎల్లుండి వరలక్ష్మి వ్రతం" అంటూ.

"అయితే నన్నేం చెయ్యమన్నావు. కారుందిగాః నీ కోరిక తీరిందిగాః" అన్నాను.

"కారుంటే సరిపోయిందండి— వాళ్ళంతా చూడొద్దూ. రేపట్నుంచి పిలుపులకి వెళ్లాలనుకొన్నాను. మీరు రాకపోతే కారులో వెళ్ళేదలాః" అంది.

అంతే ఆమె గొప్పతనాన్ని ప్రదర్శించ డానికి ఆ తర్వాత రెండు రోజులు ఆఫీసుకు శెలవుపెట్టి మా ఆవిడిని ప్రతీ యింటికీ తిప్పాను. ఆ వూళ్ళో ఆడవాళ్ళె వరీని వదలకుండా, అందరినీ పేరుపేరునా పిలుచుకు వచ్చింది. అందరినీ గుమ్మం లోకి తీసుకువచ్చి కారు చూపించింది. చూపించి, చూపించి అంతలో యేదో జ్ఞాపకం వచ్చినట్టు స్టీరింగు ముందు చెమటలు కక్కుకుంటూ కూర్చున్న నన్ను చూపించి "అయ్యో నా మతి మండా! చెప్పడమే మర్చిపోయాను దొడ్డమ్మగారూ! ఆ ముందు సీట్లో చక్రంముందు కూర్చున్నది మా వారే!" అని పరిచయం చేసింది.

"అలాగుటమ్మా-యింకా మీ డ్రైవరు అనుకున్నాను," అని ఒక ముసలావిడ అననే అంది కూడాను, ఆ విధంగా చాలా పరపతిని సంపాదించుకు వచ్చింది మా ఆవిడ, ఇంటికి వచ్చాక పీరసంగా అన్నాను."ఏకంగా వూరంతటినీ పిలిచేస్తున్నావు 'కారుకి ఎలాగాతప్పలేదు. పేరంటానికి మరో కొత్త అప్పు చెయ్యమంటావా ఏమిటీ!' అన్నాను.

"అయ్యో! శుభమా అని వ్రతం చేసుకొంటూంటే అవేం మాటలండీ- వచ్చే జన్మలోనూ మీరే భర్తకావాలని చేసే వ్రతం యిది కాదనకండి." నా గుండె జారిపోయింది. ఈ కారు. డ్రైవరు పదవీ యావన్నీ వూహించుకొని- వచ్చే జన్మకయినా నన్ను కరుణించు తల్లీ అని వరలక్ష్మికి మనస్సులోనే మొక్కుకున్నాను.

ఇక-కారులేందే బయటికి వెళ్లే అలవాటు మానుకుంది మా ఆవిడ. ఒక సాయంకాలం యింటికి వచ్చేసరికి గోధుమలు డబ్బా పెట్టుకుని-వాకట్లోకూర్చుంది. నన్ను చూడగానే "పదండి-పదండి.... వేళయిపోతుంది" అంది.

"ఎక్కడికి?" అన్నాను అర్ధంకాక.

"పిండి మరకి- మరో పావుగంటలో కట్టేస్తారు" అంది.

"పిండిమరకి కారెందుకు? ఆ పెట్రోలు ఖర్చుతో మరో రెండు కిలోలు గోధుమలు కొనుక్కోవచ్చు" అన్నాను.

"అయ్యో—రామ అనవసరమయిన చోట ఆదా చెయ్యడంలో మీరు ఫస్టు. ఇవాళ శనివారం. విసిరించుకోపోతే రాత్రి పస్తే-పదండి....పదండి" అని అంది.

"మరి ముందే పని మనిషిని ఎందుకు పంపలేకపోయావు?"

"మధ్యాహ్నం వెంకుబాయమ్మగారి మనమరాలు వచ్చిందని మాట్లాడుతూంటే పని మనిషి వెళ్ళిపోయింది."

ఇక తప్పలేదు. పిండి మర ప్రయాణానికి సిద్ధపడ్డాను. మా ఆవిడ లోపలికి వెళ్ళి క్షణంలో రెండు యిత్తడి గిన్నెలు, ఒక సీసాతో సహావచ్చింది.

"మళ్ళీ యివేమిటీ" అన్నాను.

"ఎన్నాళ్ళ నుంచో-ఈ గిన్నెలు చిల్లు పడిపోయాయండీ. బజారికి వెళ్తున్నాం కదా ఏకంగా మాటువేయించుకు వచ్చేద్దాం" అంది.

"మరి ఈ సీసా?"

"అన్నీ మీకు చెప్పాలి ఖర్మ.... నువ్వుల నూనె అయిపోయింది. తెచ్చుకోకపోతే అవుతుందా?"

"ఐతే పీటికన్న మాట కారు."

"ఐతే ఏమిటి మీరనేది? సినిమాస్టారు ల్లాగ తిరగడానికేమిటి కారు? ఇంటిపనులు చేసుకోనక్కరలేదా?" అంటూ కస్సుమంది.

మొదటి తప్పు చెయ్యాలే కాని - తర్వాత అనడానికి వీల్లేదు. పిండి మరకీ, ఇత్తడి దుకాణానికీ, నూనె దుకాణానికీ వెళ్ళాం. మా ఆవిడ కారు ప్రయాణాన్ని అనుక్షణం ఆనందిస్తోంది. దారిని పోయే వాళ్ళని గట్టిగా పిలిచి పలకరించి. "ఏమండోయ్, పంకజంగారూ? బజారుకేనా?" అని రోడ్డుమీద వాళ్ళంతా హడలి పోయే లాగ పిలుస్తోంది. ఆ పంకజాక్షి రోడ్డు పక్కన నడిచి పోతూంటే— "మేమూ అటువేపే వెళ్తున్నాం. కారులో వెళ్దాం రండి." అంటూ లోనికి ఎక్కించింది. అసలే ఒక పక్కకి ఒంగి నడిచే కారు. ఆవిడ 250 పౌన్ల శరీరాన్ని తట్టుకోలేక కిర-కిర లాడింది. ఆమె కూర్చున్న సీటు మీద ఉన్న నూనె సీసా సీటు మీదే ఒలికింది. పంకజమ్మ వాళ్ళ యింటిదగ్గర దిగేనరికి మా ఆవిడ కొన్న నూనె సగం ఆవిడ చీరెకీ, సగం నా కారు సీట్లకీ ఉంది. నువ్వుల నూనె వాసన కారుని పదిరోజుల వరకు పట్టుకు వదలలేదు.

ఓ రోజు మడత మంచాలకి కొత్తగుడ్డ కుట్టించాలని అవన్నీ బయటికి తీసింది. రిక్షావాడు రూపాయి అడిగాడని వాడిని కసిరి పొమ్మని చేంతాడుతో కారు టాపుకి వేసి రెండు మంచాలు కట్టింది.

పెట్ట్

❋ "లోపలికి రా!" తన స్నేహితుడిని పిలిచాడు మరో మిత్రుడు.

"నాకేసే చూస్తోంది నీ కుక్క. ఏమీ చెయ్యదుగదా?" ఆ స్నేహితుడు లోపలికి రావటానికి సంశయించాడు.

"ఏం చేస్తుందో చూద్దామనే నిన్ను ఆహ్వానిస్తున్నాను. దీన్ని ఈ రోజే కొన్నాన్లే" అన్నాడాతను.

—కె. ప్రసాద్, సికింద్రాబాద్.

"విశేషం లాంటి కారుకి యిదేం ఖర్మే!" అన్నాను.

"అదేమిటండీ - కారుంది కదా అని మంచాలు పారేసుకొంటావేమిటి? మనల్ని చూసి నవ్వే వాళ్ళ పళ్ళే బయట పడతాయి" అంది.

పరాయివాళ్ళ పళ్ళేమో కాని మంచాల్ని షాపు దగ్గర దింపుతుండగా ఒక మంచం జారి నా ముందు పన్ను విరిగి పోయింది.

క్రమంగా కారు నా జీవితంలో పీడకలగా తయారయింది. ఇంకా ఏ కొత్త అవాంతరాలు వచ్చి పడతాయో మా ఆవిడకి ఏ కొత్త ఆలోచనలు వస్తాయో అని హడలి చస్తున్నాను.

ఇంతలో యింజనీరుగారి భార్యకి రోగం కుదిరిందో లేదో తెలీదు కాని ఓ శనివారం రెండో ఆట సినిమాకి వెళ్ళి వచ్చి కారుని వాకిట్లో వుంచి ఉదయం లేచి చూస్తే వెనుక సీటు కవర్లు బేడుతో కోసేసి వున్నాయి. అది చూసి మా ఆవిడ గంగవెర్రులెత్తి పోయింది. నాకూ మనసు చివుక్కుమంది.

"ఏ వెధవలు చేసిన పనండీ యిది?" అని గదమాయించింది మా ఆవిడ వాళ్ళకి నేను ప్రతినిధిలాగ.

"ఎవరయితేనేం? నేను ఇంజినీరుగారి కారు సీట్లు కోసేస్తానంటే చెయ్యనిచ్చావు కాదు. మనం కారు కొని వాళ్ళు మన సీట్లు కోసేసేదాకా ఆగావు - నీకున్న పెద్ద మనిషి తరహా నీ పక్కవాడికి ఉంటుందనుకోవడం పొరపాటు" అన్నాను.

ఐతే ఈ సంఘటనతో కొత్త అవాంతరం వచ్చి పడింది. అంతవరకూ తెల్లవారు ఝామునే బయట పడుకొనే వాడిని. ఆ రోజునుంచీ కారు పక్కనే మంచం వేసింది మా ఆవిడ. "ఏమే! యివాళ సీటు కవర్లు కోసేసిన వాళ్ళు రేపు నా పీక కోసేస్తే ఏం దారి?" అన్నాను మా ఆవిడతో దీనంగా.

"మీపీక కొయ్యడానికి ఎంత ధైర్యం. అందులో కవర్లు నోరు లేనివి. మీ పీక కోసేస్తే గట్టిగా అరవండి నేనొచ్చి వాళ్ళ దుంప తెంచుతాను" అంది.

అంతే....ఇంకే మార్గాంతరం లేదు. చేసుకున్న పాపంలాగ కొనుక్కొన్న కారుకి కాపలా పడుకోవడం అలవాటు చేసుకొన్నాను.

వారం గడిచాక—

"సరసూ! నీతో ముచ్చటగా కబుర్లు చెప్పుకు వారం రోజులయిపోయిందే!.... నీ కోసం బెంగ పెట్టుకున్నాను. ఇలా భార్యా భర్తల్ని విడదీసే కారు లేకపోతే ఏం? చెప్పు...." అన్నాను.

ఏ ముఖాన వుందో మా ఆవిడకి ఆ మాటకే భోరున కన్నీళ్ళు వచ్చేశాయి—"బాధ పడకండి. అన్ని రోజులు ఒకలాగ




ఉంటాయా? ఆ యింజినీరుగారికి బదిలీ అయిపోతుందట. ఆ రాక్షసులు వెళ్ళగానే మళ్ళీ మీరు లోపలికి వచ్చి పడుకోవచ్చు" అంది.

అంతే.... కాని ఆరోజు నుంచి లోపల విద్ర పోయే వరాన్ని ప్రసాదించలేదు.

తర్వాత అయిదారు నెలల్లో నా కారుతో నేను చేసిన పొరపాటు మా ఆవిడ చేయించిన కార్యకలాపాలు వర్ణనాతీతం. ఒక చంద్రగ్రహణానికీ, ఒక సూర్యగ్రహణానికీ మా చుట్టుపక్కల ఆడవాళ్ళను సముద్ర స్నానాలకి తీసుకు వెళ్ళాను.... ఇడ్లీ పప్పు రుబ్బడానికి ఆలశ్యంగా ఇంట్లో ఉండిపోయిన పని మనిషిని వాళ్ళ యింటి దగ్గర దింపి వచ్చాను. హఠాత్తుగా బోయిలర్ వంట చెరుకు అవసరమయితే వెనక సీటులో కర్రలు వేయించుకు వచ్చాను. ఊరుకి ఎడంగా ఉన్న అత్తయ్యగారికి వెంకటగిరి చీరలు కావాలంటే నెలవారీగా వచ్చే బట్టల వ్యాపారిని నా కారులో తీసుకెళ్ళి ఆ అత్తయ్యగారి యిల్లు చూపించి వచ్చాను. వీధి చివర ఆచార్యులుగారి అమ్మాయికి తేలు కుడితే చచ్చినట్టు తేలు మంత్రగాడిని తీసుకు వచ్చాను.

ఇలా యింకా చాలా సాహసకృత్యాలు చేసేవాడినే కాని ఒక రోజు ఉన్నట్టుండి మా ఆవిడ నాతో చెప్పింది. "ఏమండీ! వెంటనే కారు అమ్మేయండి" అని.

నా నెత్తిన పిడుగు పడ్డంత షాక్ అయాను.

''అదేమిటీ!'' అన్నాను.

''అదంతేనండీ! అది అమ్మే వరకు దానితో మీరు తిరక్కండి.... ఇంట్లోనే వుంచేయండి'' అం

''అది వుంది కదా అని సైకిలు అమ్మేశాను. ఇప్పుడు సైకిలు కొనుక్కునేవరకయినా తిరగనీ! ఇప్పుడు నడవాలంటే చస్తాను. అదీగాక ఉన్నపాటునే యిలాంటి పుష్పక విమానాన్ని ఎవరుకొంటారు? ఆ మేజర్ అదృష్టానికి మనం దొరికాం కాని—'' అన్నాను.

''ఏమయినా సరే. యిక ఆ కారులో మీరు ఎక్కడానికి వీల్లేదు.''

''కారణం ఏమీటి?''

''నన్నడగకండి'' అంది.

అది ఏ విషయమయినా చెప్పకూడదని మా ఆవిడ నిర్ణయించాక యింక అడిగినా ప్రయోజనం లేదని నాకు తెలుసు.

ఏమయినా ఇదేదో మంచికే వచ్చిందనుకొన్నాను. ఎవరూ కొంటారని నమ్మకం లేకపోయినా యిద్దరు బ్రోకర్లకి వెంటనే వర్తమానం చెప్పాను. కారుని వాకిట్లోనే కాస్త యివతలగా వుంచి దాని మీద పెద్ద పరదా కప్పాను.

నెలరోజులకి ఒక పార్టీని తెచ్చాడు బ్రోకర్. రేపు పార్టీ వస్తారనగా - మా ఆవిడతో చెప్పాను. ''ఆ పరదాతీసి కాస్త పని మనిషిచేత తుడిపించు'' అని. సరే నంది.

కాని మర్నాటి ఉదయమే దరదరా వచ్చింది. ''కారు యిప్పట్లో అమ్మడానికి వీల్లేదండీ!'' అంది.

''మళ్ళీ ఏమొచ్చిందే!'' అన్నాను విసుగ్గా. చచ్చిపోయి.

''ఏమొచ్చిందో రండి చూద్దురుగాని'' అని చెయ్యి పుచ్చుకు లాక్కెళ్ళింది. చూశాక నాకు మతిపోయింది. మా ఇంట్లో రోజూ తిరిగే ఎర్రమచ్చల తెల్ల పిల్లి కారు వెనక సీట్లో పిల్లల్ని పెట్టింది. చిరిగిన సీట్ కవర్లలోంచి పీచు బయటికి లాగి వాటి మధ్య వెచ్చగా పిల్లల్ని పడుకో పెట్టింది.

నాకు వొళ్ళు మండిపోయింది. ''ఇంకా చూస్తావేం? ఆ దరిద్రగొట్టు పిల్లిని బయటికి తరమవేమే!'' అని కర్ర తియ్యబోయాను.

నన్ను వెంటనే ఆపింది. ''అయ్యో! పాపం బాలింతరాలిని యిబ్బంది పెట్టడం మహా పాపమండీ! పిచ్చిముండ మనల్ని శపిస్తుంది. పిల్లి శాపం మంచిది కాదంటారు'' అంది.

పిల్లి యిచ్చే శాపం మాట దేవుడెరుగు నా కారుకి బేరం పోతోందని ఒప్పించలేకపోయాను. ఫలితం కారుకి వచ్చిన పార్టీ తిరిగిపోయారు.

తర్వాత ఆరు నెలలవరకూ ఏ పార్టీని తీసుకురాలేకపోయాడు బ్రోకరు. ఈలోగా కారుకి చాలా అన్యాయాలు జరిగిపోయాయి. పిల్లి పిల్లల్ని తీసుకుని మరెక్కడికో వలసపోయింది. కాని బొగ్గుల లారీ వాడు మా వాకిట్లో లారీని వెనక్కి నడిపి కారుకి ఢీకొట్టాడు. వెనక మడ్‌గాడులు రెండూ వంగిపోయాయి. ఒక రోజు తీవ్రంగా వర్షం పడి ఒక కొబ్బరి మట్ట, నాలుగు కాయలూ కారు మీద సరాసరి పడ్డాయి.

టాపు బాగా లొత్తలు పడిపోయింది. టైర్లలో గాలిపోయి క్రమంగా నేలని కరుచుకున్నాయి. కారు హారన్ ఎవరో ఎత్తుకుపోయారు. తలుపుల హాండిల్స్ తుప్పు పట్టిపోయాయి. ఎట్టకేలకు ఒక గేరేజ్ యజమానిని లాక్కొ వచ్చాడు బ్రోకర్. కారంతటినీ కదిపి చూసి అక్కడా అక్కడా స్పేర్ పార్టులు పనికి వస్తాయని చెప్పి రెండువేలకి బేరం కుదుర్చుకుని వెళ్ళిపోయాడు. నేను మాత్రం మేజరీకంటె తొందరగా ఆ బేరానికి! ఒప్పుకున్నాను - ఆలశ్యంచేస్తే అదీ రాదని భయపడి. తర్వాత యింటి ముందు వేసిన కర్రదుంగని చీల్చినట్టుగా పదిమంది వచ్చి కారుని ఏ పార్టుకి ఆ ఆ పార్టు విప్పి తలో చక్రం, సీటు, హాండిల్ పటుకు వెళ్ళారు.

కారు పూర్తిగా వెళ్ళిపోయిన రోజు మా యింట్లో సత్యన్నారాయణ వ్రతం ఏర్పాటుచేసింది మా ఆవిడ. దాన్ని పంపించి వెయ్యడానికి మా ఆవిడ అంత ఆతృత, అంత తతంగం ఎందుకు పడిందో అర్థం కాలేదు. ఆఖరికి పూజ చేయించిన పురోహితుడు చెప్పాడు. అతనికి కాస్తపాటి జ్యోతిష్యం కూడా తెలుసును లెండి.

''అయ్యా తమకు జీవితంలో వాహన గండం వుందని చెప్పానండీ. అది ప్రాణానికే ముప్పు తేవచ్చునని రాసి వుందండి. అది విన్నాక అమ్మగారికి కరచరణాలు ఆడలేదు.'' అన్నాడు.

నాకు నోట మాట రాలేదు. "అంత మంచి విషయం చెప్పడానికి యింత ఆలశ్యంగా తగలపడ్డావేమయ్యా? పది నెలల కిందటే చెప్పి వుంటే నాకీ శ్రమా, మూడువేలు నష్టం తప్పేది కాదా!'' అనుకొన్నాను కారు ద్వారా పక్కింటి ఆవిడ మీద ఆధిక్యత సాధించాలన్న పట్టుదల కంటె, భర్త శ్రేయస్సు మా ఆవిడని జయించడం నా అదృష్టం. అ తర్వాత ఎప్పుడూ పొరుగు వాళ్ళ కారులో కూడా నన్ను ఎక్కనివ్వలేదు మా ఆవిడ!

ఇప్పటికీ అద్దం చూసుకున్నప్పుడల్లా మా ఆవిడా; మారిస్ మైనరూ, మడత మంచాలూ గుర్తుచేస్తుంటుంది పోయిన నా ముందు పన్ను.




దైవభక్తీ, దేశభక్తీ ఈ రెండూ మన జన్మహక్కులు. మనది పుణ్యభూమి. ఇక్కడ ఎన్ని అద్భుతాలయినా ఇట్టే జరిగిపోతాయ్. అలవాటు పడిపోయాం గనుక మనకవి మామూలుగానే కనిపిస్తాయి గానీ ఇక్కడి గాలీ నీరూ కూడా గాంధీటోపీలా స్వచ్ఛమూ, పరమ పవిత్రాలూ. కనుకనే కొద్దిమంది టోపీల్తోనూ చాలా మంది గాలీ, నీళ్ళతోనూ, సుఖంగా బ్రతుకు గడుపుతున్నారీ పుణ్యభూమిలో.

ఈ రహస్యం తెలీకనే బుద్ధుడు పాపం ఈ అమాయక ప్రజల్నేదో ఉద్ధరించి పారేద్దామని ఇంట్లోంచిబయల్దేరి పారిపోయాడు. బుద్ధుడికి బుద్ధి రావటానికి బోధివృక్షం కావాల్సొచ్చింది. సంవత్సరాలు తరబడి క్షౌరం చేయించుకోకుండా ఈగల్నీ, దోమల్నీ తోలుకుంటూ చెట్టు క్రింద కూర్చోవాల్సొచ్చింది.

కానీ, ఈ మధ్య దేవుళ్ళ మీద దయ్యాలమీద పీకలదాకా నమ్మకంగల ఓ పెద్ద మనిషికి అంత శ్రమ పడనవసరం లేకుండానే మంగలి దుకాణంలో గెడ్డం గీయించుకుంటూండగా తపీమని జ్ఞానోదయమై అతని ఆఫీసు సమస్యలన్నీ హనుమంతుడు దొరకగానే రాములవారి కష్టాలెగిరిపోయినట్లుగా పరిష్కారమై పోయాయట. సంగతేమంటే మద్రాస్ సెక్రటేరియట్‌లో ఆయనగారో ఎన్జీవో. ఓ రోజు ఆఫీసు పనొకటి అర్జంటుగా మరో ఆఫీసుకు పోయి పూర్తి చేసుకోరమ్మని ఆఫీసరుగారు ఆర్డరివ్వగా, తత్క్షణం టాక్సీలో వెళ్ళి క్షణాల్లో ఆపని పూర్తిచేసి, అర్జంటుగా ఆఫీసుకు తిరిగొచ్చి, అర్జంటుగా టీఏ బిల్ వ్రాసి అర్జంటుగా దాన్ని ఆఫీసర్‌గారికి సమర్పించుకోగా ఆర్నెల్ల తర్వాత ఆడిట్ అబ్జక్షన్‌తో సహా అది తిరిగొచ్చిందట.

"నాయనా! నీవో మామూలు ఎన్జీవో గాడివి. ఎంత అర్జంటు పని అయినా ఆఫీసర్లాగ అర్రూపాయలు ప్రజాధనం తగలేసి టాక్సీలో షికార్లు కెళ్ళొచ్చే హక్కు నీకు లేదుగాక లేదు. ఎన్జీవోగాళ్ళు ఎక్కడికయినా జట్కాల్లో రూల్సు తగలడాల్సిందే గాని టాక్సీల్లో వచ్చేందుకు ఒప్పుకోవు." గాక ఒప్పుకోవు అని ఆ అబ్జక్షన్ సారాంశం.

అది చూచుకుని అతగాడు ఆఫీసరుగారి దర్శనం చేసుకుని ఏడుపు ముఖం పెట్టగా! "అవును నాయనా! రూల్సు అనేవి చాలా పవిత్రమయినవి. వెనకటికి రాముల వారి రూల్సుకు విరుద్ధంగా ఎవడో శూద్రుడు తలక్రిందులుగా తపస్సు

చేస్తూంటే తక్షణం ఆ నక్సలైట్‌ను సఫాచేసి, ధర్మాన్ని తోకపచ్చుకు తొక్కొచ్చి కాపాడలేదా! మనది రామ రాజ్యం. ఆ మాత్రం దేశభక్తీ, రూల్సు భక్తీ ఉండొద్దా అని హితోపదేశం చేశాట్ట.

అందుకని మన ఎన్జీవోగారు ఆ అబ్జక్షన్‌ను ఆమోదించి చేసిన తప్పుకు లెంపలేసుకుని గుంజీలు తీసేరు. మరయితే పెట్టిన ఖర్చును వసూలు చేసుకోవటం ఎలా? ఆ ఊళ్ళో జట్కాలు తిరగటం మానేసి చాలా సంవత్సరాలై పోయిందాయె.

ఇలాంటి సందిగ్ధావస్థలో మన ఎన్జీవో గారికి మంగలి కత్తి చెంపకు తగలగానే అద్భుతమైన ఐడియా వచ్చేసింది.

వెనుక ఇలాంటి సమస్యే వచ్చినప్పుడు రాములవారేం చేశారు? ఇండో-సిలోన్ యుద్ధంలో సుగ్రీవుడి సైనిక సహాయం అర్జంటుగా కావాల్సొచ్చి అందుకోసం రూల్సుకు విరుద్ధంగా వాలిని మర్డర్ చేసేసిన రాములవారు వాల్ని సమర్థించుకునేందుకు వాలి గత జన్మపాపాలను త్రవ్వి తీయలేదా!

అలాగే మన ఎన్జీవోగారూ తన పవిత్రావసరార్థం ఏనాడో తిరగటం మానేసిన జట్కాబళ్ళను లాక్కొచ్చేరు. వాటిని తన టీయే బిల్లు కింద దౌడు తీయించాడు. రూల్సు ప్రకారం జట్కా ప్రయాణంచేసి ఆఫీసు పని పూర్తిచేసుకు వచ్చినందుకుగాను మైలేజీ లెక్కల ప్రకారం అక్షరాలా పదహార్రూపాయల పన్నెండు పైసలకు బిల్లును మళ్ళీ సబ్‌మిట్ చేశాడా దేశభక్తుడు.

పెద్దలున్నూ అతని ప్రభుభక్తికి సంతసించి వారంరోజుల్లో బిల్లు పాసు చేయటం. ఆ అదనపు రూపాయల్తో ఆ ఎన్జీవోగారు సకుటుంబంగా సంపూర్ణ రామాయణం సిన్మా చూసి తరించటం అన్నీ సక్రమంగా జరిగిపోయాయి.

ఓ గవర్నమెంటు డిపార్టుమెంటులో గంటకు నలభై మూడు నిముషాలేనట. అదేమిటని అసెంబ్లీలో అడిగితే, మంత్రిగారు తపీమని 'రూల్సు' అన్నారట. "ఈ రూల్సు మూలంగా తొంభై వేలు నష్టపోయాను మహాప్రభో!" అని ఆ సభ్యుడు వాపోయాడు. పాపం ఆయన రామాయణం చదివి ఉండరు. భగవద్గీత చూసి ఉండరు. వాళ్ళకు తగ్గట్టే ఈయనా "నా రూపాయికి దెబ్భైయిదు పైసలే" అనుకుంటే తొంభై వేలు లాభం తీసి ఉండరు గదా! ఈ పుణ్యభూమిలో ఏది అసంభవం గనుక.

ఫ్రాన్సులో సెటిలయిపోయిన ఓ భారతీయ రచయిత ఆ మధ్య మాతృభూమినోసారి దర్శించి, ఇక్కడి గాలీ - నీరూ వగైరాలు సేవించి ధన్యుడనవుదామనే ఆశతో పుష్పకవిమానం ఎక్కి బొంబేలో వామపాదం మోపారు. ఆయ నలా దిగీ దిగగానే మన కస్టమ్సు దేశభక్తులు స్వాగతమిచ్చి, ఆయన్నీ, ఆయన సామాన్లనీ లంకను గాలించిన హనుమంతుడి తమ్ముళ్ళలా సోదాచేసి, చివరికో షాంపేన్ బుడ్డిని బయటికి లాగేరు.

"ఈ పుణ్యభూమిలో మ్లేచ్ఛుల సీసాలు సేవించాలంటే తమరు ప్రత్యేకంగా పర్మిషన్ తెచ్చుకోవాలి స్వామీ!" అని చెప్పి,

రాముల వారు ధర్మాన్ని దాచినట్లు ఆ షాంపేన్ సీసాను గాడ్రేజ్ బీరువాలో దాచి ఆయనగారికో రశీదిచ్చి పొమ్మన్నారు.

ఈయనగారు చేసేది లేక రామనామ జపం చేస్తూ ఓ టాక్సీ మాట్లాడుకుని కస్టమ్స్ వాళ్ళిచ్చిన అడ్రసుకు పోయి చూస్తే అక్కడసలు ఏ ఆఫీసూ లేదట. వాకబు చేయగా ఆర్నెల్ల క్రితమే ఆ ఆఫీసు మరో చోటికి మారిందని తెలిసి - మళ్ళా టాక్సీ ఎక్కి అక్కడకు చేరాడట....

అక్కడ మూడంతస్తుల మెట్లూ ఎక్కి, ముప్పైమూడు సెక్షన్లూ గాలించి, చివరికి పర్మిట్ల సెక్షన్ చేరుకుని తన గోడు చెప్పుకోగా, అక్కడి ఆఫీసరు అప్పుడే నిద్ర లేచిన కుంభకర్ణుడిలా ఓ నవ్వు నవ్వి, రాములవారికి ప్రేమపాఠాలు నేర్ప బోయిన తాటకిలా పోజు పెట్టి, "అయ్యా, ఇది యిండియన్లకు మాత్రమే పర్మిట్లిచ్చే పవిత్ర డిపార్టుమెంటు. మీ వంటి విదేశీయులకు పర్మిట్లిచ్చే మ్లేచ్ఛ డిపార్ట్‌మెంట్ ఈ బొంబే నగరంలోనే ఆమూల అంధేరీలో అయిదో అంతస్తులో ఉంది. దయ చేయండి." అన్నాడు

"ఔరా!" అనుకుని ఆ రచయితగారు భగవద్గీతనోసారి నెమరు వేసుకుని అంత దూరం పోయి ఎలాగోలా సాయంత్రం లోగా పర్మిట్ సంపాదించుకున్నాడు. అది పుచ్చుకుని ఎర్‌పోర్టుకు పోతే, "అయ్యా, మీ సెక్షన్‌కు పవ్వళించు వేళ దాటె! కనుక మా షాంపేన్ బుడ్డీ స్టాక్ రూంకు ఏతెంచె! తమరీ రాత్రికి సుఖంగా పవ్వళించి రేపు తెల్లవారే రేడియోలో వెంకటేశ్వర సుప్రభాతం విని లేచి కాలకృత్యములు నెరవేర్చి ఆ స్టాక్ రూం నుండి మీ సీసా తెచ్చుకొందురు గాక!" అని పంపివేశారట. 'సరే'నని ఆయనగారు మర్నాడుదయమే సుప్రభాతం విని ధన్యుడై, లెంపలు వేసుకుని స్టాక్ రూంకు మళ్ళీ టాక్సీ ఎక్కి వెళ్ళి, తన సీసాను కస్టమ్స్ దేశభక్తుల చెరనుండి విడిపించి చూడగా, ఖరీదయిన ఆ ఫుల్ బాటిల్‌లో సగం ఖాళీగా ఉందట. సీలు ఎగిరిపోయిందట. ఏడుపు మొహం పెట్టిన ఈయనగార్ని చూసి అక్కడి స్టాక్ రూం కావలాదార్లు హనుమంతుణ్ణి చూసిన అశోకవనపు రాక్షసుల్లా గాక కాస్త మర్యాదగానే ఇకిలించారట....

దాంతో ఈ రచయిత గారికి భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్ముడు సెలవిచ్చిన అమూల్య పాఠాలన్నీ ఇట్టే అర్థం అయిపోయాయట ...

అదీ సంగతి! మన పవిత్ర భారతం గురించీ, మన రూల్సు వగైరాల్ని గురించీ ఎవరూ ఎవరికి ఏమీ చెప్పనక్కర్లేదు.... అర్నెల్లు అక్కర్లేదు. ఆరు గంటల పాటిక్కడి గాలీ-నీరూ సేవించినా అదే అర్థమయిపోతుంది. అందుకే గాబోలు ఫారిన్ పోయి నాలుగు నెలలక్కడున్న వాళ్ళకి ఈ పుణ్యభూమికి తిరిగి రావాలంటే అంత బెదురు.

అవును మరి! రాముడు అగ్నిప్రవేశం చెయ్యమంటాడని ముందే తెలిస్తే సీత లంక నుండి ఈ పుణ్యభూమికి తిరిగి వచ్చేందుకు ఇష్టపడేదేనా? అని నా అనుమానం. ✻



"ఇంక చాలు. భోజనానికి లేవండి." అంటూ చేతిలోని గ్లాసు అందుకో పోయింది స్వర్ణముఖి.

సెంచరీలో తొలి జోకు విన్నంత గట్టిగా నవ్వేడు రావు. అతనితో పాటే చుట్టూ ఉన్న స్నేహితులూ నవ్వేరు.

అతని చేతిలో గ్లాసు అలా పట్టుకునే నిలబడి తనూ నవ్వ నట్టు నవ్వింది స్వర్ణముఖి.

"మిమ్మల్నే: ఇంక చాలు." అంది గోముగా.

"భారతనారి నోట యీ చాలు శబ్దం వింటూంటే మహా గమ్మత్తుగా వుంది స్వర్ణా! ఏదీ మళ్ళా అను...." అంటూ స్వర్ణముఖి గెడ్డం పట్టుకున్నాడు రావు.

"చాల్లెండి. అప్పుడే పన్నెండవుతోంది. అన్నీ చప్ప చల్లారాక కెలికి

---

## క్రొత్త సీరియల్

---

రావడం....లెండి. భోజనాలకి." అంది చిన్నపిల్లల్ని అదలించినట్టు.

"చూడు చిట్టీ! చాలు అన్నది - యీ లోకంలో లేదు. ఏది చాల్తోంది చెప్పు!" గ్లాసు ఖాళీ చేశాడు.

కష్టపడి నడిచి టేబిలు చేరాడు రావు. అప్పటికే అతని చేతులకి పొంతన కుదరడం లేదు. గ్లాసుకి పక్కన పెట్టి బాటిల్ వంచేస్తున్నాడు.

ఒక్క అంగలో వెళ్ళి బాటిల్ అందుకుంది స్వర్ణముఖి. "ఉండండి నే పోసి యిస్తాను" అంది.

"నో. నో! నువ్వు వద్దు. నువ్వన్నీ పీళ్ళే పోసేస్తావు. నాకు వద్దు." అంటూ బాటిల్ లాక్కున్నాడు.

"లేదు. మీక్కావలసినన్ని పోస్తాను. అనవసరంగా నేల పాలు చేస్తున్నారు.

"చూశావా! విలువైన డ్రింకు నేల పాలు చెయ్యడం నీకూ యిష్టం లేదు. గుడ్! ఏదీ ఆన్ రాక్స్. పొయ్యి" గ్లాసు ముందుకు జాపాడు.

ఐస్ ముక్కలు రెండు వడేసి దానిమీద విస్కీ పోసింది స్వర్ణముఖి. ఆమె ముఖంలో ఎలాంటి విసుగూ లేదు; ఎలాంటి ఉత్సాహమూ లేదు. ఇద్దరు పని పిల్లలు చిన్న-చిన్న ప్లేట్లలో ఫ్రైడ్ చికెన్ మిరపకాయి బజ్జీలు, మసాలా వేరు సెనగలు అన్నీ పెడుతున్నారు. అప్పటికే మాటల జోరు తగ్గింది. నాలుకలు మొద్దుబారి ఏం చెప్తున్నారో అర్థం కావడం లేదు.

"చూడు స్వర్ణా! యింక చాలండీ, యింక వద్దండీ అంటూ నువ్వు సాధిస్తే ఎలా చెప్పు!" ఒక్క గుక్కలో గ్లాసు ఖాళీ చేసి పక్కన పెడుతూ అన్నాడు రావు.

"లేదింక. ఎప్పుడు భోజనం చేస్తారని అన్నాను." రేగిన అతగాడి క్రాఫు సరి చేస్తూ ముద్దుగా అంది. "వీళ్ళందరినీ త్వరగా యిల్లు చేర్చమనండి మనం విశ్రాంతి తీసుకోవచ్చు." గుస గుసలాడుతున్నట్టు అతగాడి చెవిలో చెప్పింది.

"స్వీట్ గర్ల్! నువ్వంటే నాకెందుకే అంత యిష్టం. ఈ భూప్రపంచం అంతా నాదే అయితే - నీ పాదాల దగ్గర పడేసి. నా ప్రేమకానుక స్వీకరించు అని యిచ్చేసే వాడిని. అయినా స్నేహితులని ఎలా వెళ్ళిపొమ్మంటాం చెప్పు? స్నేహితులెందుకు? ఆనందం పంచుకుందుకు ... విషాదం పంచుకుందుకు...."

"అవునవును. మనకి రోజూ ఏదో ఒకటి వుంటూనే వుంటుంది కదా!...." కొంగుతో అతని ముఖం అద్దింది.

ఆ కొంగు చేతితో అందుకున్నాడు రావు. అప్యాయంగా దాన్ని తన రెండు చేతుల్లో పెట్టుకుని "స్వర్ణా! నువ్వు నా జీవితంలోకి చాలా లేటుగా ప్రవేశించావు.

ముందే ఎందుకు కనిపించలేదు?" ఆమె వడిలో ముఖం దాచుకుంటూ అడిగాడు.

"బాగుంది. వీళ్ళని పంపరా?" అడిగింది స్వర్ణ.

"వుండనీ. పాపం. వాళ్ళేం చేశారు నిన్ను. చూడు కాస్సేపు ఆడిస్తాను. నీకూ బాగుంటుంది. స్నేహితులు మనని ఆనంద పెట్టడానికే కదూ? ఒరే జగన్నాధం. ఈ వేళ మనం ఏం చేశారా?"

మళ్ళీ గ్లాసుచేత్తో పట్టుమని బాటిల్ కేసి నడవబోయాడు రావు. స్వర్ణముఖి తనే గ్లాసు అందుకుంది. కొంచెం విస్కీ పోసి రెండు ఐస్ ముక్కలు వేసి పట్టు కొచ్చి రావు చేతిలో పెట్టింది.

వాలిపోయిన తలని కష్టపడి పైకి ఎత్తుతున్నాడు. జగన్నాధం. అతని కను రెప్పలు చెప్పిన మాట వినడంలేదు. మూసుకుపోతున్నాయి.మాట్లాడ్డానికి ప్రయ త్నిస్తున్నాడే గాని మాట రావడంలేదు. 'రావు....మనం' అక్కడితో సరి. మళ్ళీ కుర్చీలో కూలబడ్డాడు. 'మళ్ళీ గ్లాసు నింపు వాడే మాట్లాడుతాడు' నవ్వుతూ అన్నాడు రావు.

పనిపిల్ల జగన్నాధం గ్లాసు నింపింది. కష్టపడి ఓ గుక్క వేశాడు. రెండు నిము షాల మూకాభినయం తర్వాత మళ్ళీ కళ్ళె త్తాడు.

"మనం గెలిచాం .... లేదు, మనం

ఓడిపోయాం కదూ॥'' అని మూలపడ్డాడు.

అంతా గొల్లున నవ్వారు.

''గుడ్ అలా నవ్వులు విన్పిస్తే ఎంత బాగుంటుంది కదూ॥'

"అరె రావు. మనం ఈ రోజు ఓడిపోయి నందుకే కదూ పార్టీ చేసుకుంటున్నాం?" కష్టపడి అడిగాడు వెంకట్రామన్.

''అవును బ్రదర్. మనకి గెలుపు ఓటమి ఒకటే అందుకే యీ పార్టీ."

"ఎంత పోయిందేమిటి?'' కుతూహలంగా అడిగింది స్వర్ణ.

''ఎనభై వేలు'' అనేసి ఒక్క గుక్కతో గ్లాసు ఖాళీచేసి పక్కన పెట్టేశాడు రావు.

"ఎపినభై వేలే? రోజు రేసుల్లో పది వేలు దాటవియ్యనని నాకు మాటిచ్చావుగా?'' కోపంగా అడిగింది స్వర్ణముఖి.

''నువ్వు అడిగావు కనుక చెప్పాను. లేకుంటే నాకెలా తెలుస్తుంది చెప్పు?'' వేళాకోళంగా అన్నాడు రావు.

''అయితే మీ మాటకి విలువ అంతే నన్నమాట॥''

''చూడు స్వర్ణ, ప్రేమిసి కౌగిలిలో ఎన్నెన్నో ప్రామిస్లు చేస్తాం. తాగినప్పుడు ఎన్నెన్నో నిర్ణయాలు చేస్తాం అవన్నీ విలువిసి పాటించమంటే ఎలా చెప్పు॥''

కోపంగా స్వర్ణముఖి లేచి వెళ్ళిపోయింది. రావు లేచి గ్లాసు నింపుకున్నాడు.

"ఆడది లేని పార్టీకి అందం లేదు బ్రదర్ స్వర్ణముఖి వెళ్ళిపోయిందేం?'' వెంట్రామన్ అడిగాడు.

"ప్రామిస్ బ్రేక్ చేశానట. కోపం వచ్చింది."ఊరెగిరేలా నవ్వేడు వెంకట్రామన్.

"ప్రామిస్ ఎందుకు చేసినట్టు. బ్రేక్ చెయ్యడానికి కాకపోతే? మైగాడ్, రావు. బలేమాట. తీసుకురా,'' అన్నాడు.

''పోనీలే, అలసిపోయి వుంటుంది.... ఏడీ మనమూర్తి! కమాన్ మూర్తి! నువ్వే నారీ సుందరివీ పార్టీకి. రా. ఆడు. పాడు మమ్మల్ని ఆనందింప చెయ్యి.'' అంటూ ఆహ్వానించాడు. మూర్తి సన్నగా నాజూకుగా వున్నాడు. తెల్లని పైజామా. జుబ్బా. వుంగరాల జుట్టు రేగిపోయింది. కళ్లు నక్షత్రాల్లాగా మెరిస్తున్నాయి. లేచి నిలబడ్డాడు. బాగా తాగివున్నాడేమో నిటారుగా నిలబడలేకుండావున్నాడు. వంగినిలబడ్డాడు, శెభాష్ అంటూ స్నేహితులంతా మెచ్చుకున్నారు.

''ఈ డ్రెస్సులోనా॥''

''మరెలా?''

''వైట్'' అంటూ రావుగారు లోపలికి వెళ్ళాడు. మళ్ళీ రెండు నిముషాల్లో ఓ పరికిణీ ఖండువా పట్టుకు వచ్చాడు.

"ఒరేః మోహినిలా వున్నావురాః ఏదీ అమృతం వడ్డించు." అంటూ గ్లాసు పట్టాడు.

నీసా వయ్యారంగా అందుకుని అందరికీ తలో రౌండూ వడ్డించాడు మూర్తి. అంతా తమ గ్లాసుల్లోంచి తాగనివ్వారు మూర్తిని. ఆవేశం వచ్చినట్టు, పిచ్చి ఎక్కినట్టు గదంతా తిరిగాడు మూర్తి.

జేర వేసిన తలుపు సందులోంచి తొంగి చూసింది పనిపిల్ల. ఇక దానికి నవ్వు ఆగింది కాదు. పరుగెత్తి వెళ్ళి స్వర్ణముఖిని పిలుచుకు వచ్చింది.

స్వర్ణముఖి తలుపు సందులోంచి చూసింది. నవ్వుతూ తలుపులు బార్లా తెరిచింది. ఎక్కడిది వాళ్ళక్కడే నిలబడి పోయారు.

జగన్నాథం చేతిలో వున్న మూర్తి పైటకొంగు నేలకు జారింది. మూర్తి సిగ్గుగా ముఖం పక్కకి వంచాడు.

"[illegible] మీ ఆట... రేపట్నుంచి [illegible] పరిపిస్తాను. గానా బజానా [illegible]." అంటూ నవ్వుతూ వెళ్ళి రావు [illegible] స్వర్ణముఖి.

ఆమె నడుం చుట్టూ చెయ్యి వేసి "కోపం పోయినట్టుంది [illegible]...." [illegible] ముద్దు పెట్టుకున్నాడు.

"పదండి, పోదాం" రహస్యంగా అతని చెవిలో అంది.

నడుంమీద చెయ్యి గట్టిగా నొక్కుతూ "నీ ఆజ్ఞ.... ఈ రోజు జాక్‌పాట్ వచ్చి తీరాలని పంతం వచ్చేసింది. ఎంతైనా సరే, పందెంలో పెట్టాలని పెట్టేశాను.... ఫరవాలేదు-పోయింది" అన్నాడు రావు.

"ఆదేనా యీ పండుగః" వేళాకోళం చేసింది స్వర్ణముఖిః

"గెలుపు సెలిబ్రేట్ చెయ్యాలి. ఓటమి దిగమ్రింగాలి. రెండింటికి పార్టీ తప్పదు కదూః మూర్తీ. కమాన్. లాస్టురౌండ్ వేయండి. పార్టీక్లోజ్." అన్నాడు రావు.

మూర్తి ఆత్రంగా ఒక్కొక్కరికి అర గ్లాసు నింపేశాడు. ఐస్ కరిగిపోయింది. ఐస్‌వాటర్ బాటిల్ అందించింది పనిపిల్ల. "నీ తెలివి మెచ్చుకోవాలే సుబ్బీ..." అంటూ దాని బుగ్గ గిల్లాడు మూర్తి. "ఛీ, నా పేరు సుబ్బలక్ష్మి....సుబ్బిలు సుబ్బి...." చీదరించుకుంది పనిపిల్ల.

"మళ్ళీ రేపు కలుసుకుందాం!" అంటూ అందరూ గుమ్మం దాటే దాకా ఆగి.... స్వర్ణముఖిని రెండు చేతులా గట్టిగా కౌగలించుకొన్నాడు రావు.

అతని మెడ చుట్టూ తన చేతులు వేసింది స్వర్ణముఖి అతని పెదవులపై ముద్దు పెట్టుకుంది. [illegible] "రండి అన్నం తిందురుగాని" అంది.

అప్పటికే [illegible] వుండాలని ప్రయత్నిస్తున్న రావుకి పట్లు తప్పుతున్నాయి. (సశేషం)

# అభ్యుదయం

రాబందుల గగన విహారం
వృకజాలం వనసంచారం
విషక్రిముల వికారగానం
మోసంతో నిండెను లోకం॥
కాలానికి శీలం శూన్యం
వెఱ్ఱెత్తిన రంగులగుఱ్ఱం॥
నవలోకం నీతికి దూరం
పాపంతో మురిగిన కుంభం
అస్థులతో కట్టిన దుర్గం
చీకటితో నిండిన కూపం॥
ధూర్తులకిది భోగపు సదనం
ద్రోహులకిది విలాస భవనం॥
ఆ దిక్కున రుధిరసాగరం
ఈ దిక్కున అశ్రుప్రవాహం
క్షుద్బాధల భీకరరావం
సామాన్యుల తీరనిదుఃఖం॥
విశ్వమాత విప్లవశంఖం
పూరించెను పదండిపోదాం
అదిగదిగో సంధ్యారాగం
అభ్యుదయం అనంతధామం.

—మాగాపు అప్పారాజు.



# అమ్మా.....

అక్కిరపు హనుమంతరావు

"మరొక్క మాట ఆలోచించురమా! ఏడాది నాగన్న! నిన్నొదిలి వాడుండగలడా?" అనునయంగా అన్నారు మా మావఁగారు.

మా ఆవిడకొక్కసారి కోపంతోబాటు దుఃఖం కూడా వచ్చేసింది...."అటువంటప్పుడు మీరెందుకలా ఉత్తరం రాశారు? అసలు మీకు వాణ్ణుంచుకోడం యిష్టం లేదు....కాని - పోని ఆమదం మనకెందుకని ఆలోచిస్తున్నారు...." గబ గబా ఏదో అనేయబోయింది....మధ్యలోనే మా అత్తగారు అడ్డుతగిలింది.

''చాల్లేవే అమ్మాయి! నీ మాటలూ నువ్వూను!! మీ పది మందిని కని-పెంచిన చేతులివి. వాడు మాకాముచం ఎలాగవు తాడు?....కాకపోతే నీ కోసం బెంగట్టు కుంటాడేమోనని మా భయం! అంతే!!....''

''ఏం బెంగెట్టుకోడు. తొమ్మిదో నెల దాకా నీ చేతుల్లోనూ. పెద్దక్క దగ్గరే కదా వాడు పెరిగింది!! రెండ్రోజులు పోతే వాడికే మీదగ్గర చేరికవుతుంది....ఇదుగో! చూశావా....అప్పుడే నీ మీదికి ఎలా ఎగబుసుతున్నాడో?!....'' అంటూ మా బుజ్జిగాణ్ణి వాళ్ళమ్మ చంకలోకి మార్చింది. విజయగర్వంగా నాకేసి చూస్తూ మా ఆవిడ-పైట సవరించుకుని.

అంతలో పైట చెంగుని చేతులు తుడుచుకుంటూ మా పెద్ద వదినగారు అంటే మా ఆవిడ పెద్దక్కగారే వచ్చింది వంటింట్లోంచి. ఆవిడకి చిన్నప్పుడే మొగుడు పోయాడు. అప్పట్నుంచీ పుట్టింట్లోనే వుంటూంది. మా ఆవిడంటే ప్రాణం ఆవిడకి!! పైగా పిల్లల్లేరు ఆమెకి.

''నీ కొడుక్కేం ఫరవాలేదు. పువ్వుల్లో పెట్టి చూసుకుంటాం! నీకా భయం అక్కర్లేదు. హాయిగా వుండవే రమా....'' అంటూ పూర్తి భరోసా యిచ్చేసిందావిడ.

మా మావఁగారు నాకేసి చూసి ''లాభం కాదు గురూ! మనకి డిపోజిటు గల్లంతు' అన్నట్టు చిరునవ్వు నవ్వారు. నేనూ బలవంతపు నవ్వొకటి నవ్వేసి వూరుకున్నాను. మర్నాడే నేనూ, మా ఆవిడ బుజిగాణ్ణి వాళ్ళ తాత, అమ్మమ్మల దగ్గర వదలి రైలెక్కాం....

**అమ్మ**—ప్రతీ పసిప్రాణి తొలిసారిగా పలికే శబ్దం.

అమ్మలేని నాడు పశువులైనా మనుష్యులైనా అనాధలే!

ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంటులో నేనూ రమా తప్ప యింకెవ్వరూ లేరు. నా మనసు పూర్తిగా ఉల్లాసభరితంగా వుంది. మా బుజ్జిణ్ణి వదలి రావడం నాకు మొదట్నుంచీ యిష్టం లేదు. ఏదో గోల్కొండ [illegible] కున్న కాంతిలా బయటికి చూస్తూ కూర్చున్నాను.... చెట్లు, పుట్టలు, గుట్టలు, టెలిఫోన్ స్తంభాలు వెనక్కి పరిగెత్తుతున్నాయి....

''ఏమండీ....'' మా ఆవిడ భుజం

మీద చెయ్యి వేసి కుదిపింది....ఉలిక్కి పడ్డాను.

'మీకు కోపం వచ్చింది కదూ....''

''అబ్బే....నాక్కోపం ఎందుకూ?....'' సర్దుకోబోయాను.

''కాయ్యక ండీ!....పో నీ....మీ కు చాలా బాధగా వుంది. అవునా!?....''

నేను మాట్లాడలేదు.

మా ఆవిడ నా తొడ మీద తల పెట్టుకుని సర్దుకుని పడుకుంటూ అంది.

''నాకు మాత్రం లేదనుకుంటున్నారా వాడి మీద?....అయినా యిదొక చిన్న ఎక్స్పెరిమెంటు....చూద్దాం....'' అంటూ కళ్ళు మూసుకు పడుకుంది.

ఏదో స్టేషన్లో రైలాగింది. ఎవరేనా ఎక్కితే బాగుండదేమోనని పక్కనున్న దిండు మీదకి మా ఆవిడ తల మార్చి, నా తొడ తప్పించాను. ఎవ్వరూ ఎక్కలేదు మా కంపార్టుమెంటులోకి.

రైలు మళ్ళా బయల్దేరింది....

ఇందాకట్నుంచి మా ఆవిడ తలపెట్టడం మూలంగా గాబోలు కాళ్ళంతా తిమ్మిరెక్కింది. ఒక్కసారి లేచి కాళ్ళు గట్టిగా జాడించి, మళ్ళా కూర్చున్నాను. కళ్ళు మూసుకుని కాసేపు నిద్రపోదానికి ప్రయత్నించాను....లాభం లేకపోయింది! మా ఆవిడ మాత్రం హాయిగా నిద్ర పోతోంది. తనకేసే చూస్తూ కూర్చున్నాను. ఒక రకంగా తనని చూస్తే జాలేసింది. అలా ఆదమరచి పడుకుని ఎన్ని రోజులైందో!! బుజ్జిగాడి మూలంగా తనకి రోజూ రాత్రి నిద్ర సరిగా వుండేది కాదు....రెండు మూడు సార్లయినా దీస్టర్బవుతూ వుండేది. ఆ తర్వాత నిద్ర పట్టడం లేదో అని గోల పెట్టేది.

ఒక్కసారిగా రివ్వుమంటూ గాలి లోపలికి దూసుకుని వచ్చింది. ఆ తాకిడికి మా ఆవిడ పైట పూర్తిగా ప్రక్కకి తొలగింది. ఉఛ్వాస నిశ్వాసాలకామె వక్షస్థలం వింతగా కదులుతోంది. నా వొళ్ళొక్కసారి ఝల్లుమంది ఎందుకో....మా ఆవిడ నిద్దర్లోనే పైట సరిచేసుకుని వత్తిగిలి పడుకుంది మళ్ళీ....మరో సందర్భంలో ఐతే నేనేం చేసేవాణ్ణో గాని, ప్రస్తుతానికి నా మనస్థితి అంత బాగుండక పోవడంతో మళ్ళీ దృష్టి బయటికి సారించాను.

మళ్ళీ వెనక్కి పోతున్న ఎలక్ట్రిక్ స్థంభాలు, చెట్లు, పుట్టలు, గుట్టలు....

* * *

అవి మా కొత్తగా పెళ్ళయిన రోజులు....

ఒక రోజు రాత్రి మా ఆవిడ అంది. ''చూడండి! మీరేమీ అనుకోనంటే ఒక్క మాట....''

''ఏమిటది? ' అన్నా! గోముగా మా ఆవిడ వీపు నిమురుతూ.

''మనం యిలాగే కొన్నాళ్లు హాయిగా,





ఫ్రీగా వుండాలంటే మనకే బాదర బందీ వుండకూడదు. మనిద్దరమే....''

''మనమిద్దరమేగా యిప్పుడున్నది?''

''అదే! మూడో వ్యక్తి అప్పుడే మన మధ్యకి రాకూడదు....''

''అంటే? మా అమ్మా, వాళ్ళూ మా వూళ్ళోనేగా వున్నదీ? వాళ్ళు మనం రమ్మన్నా రారు.''

''అబ్బ....వాళ్ళు కాదండీ! మూడో మనిషి అంటే వాళ్ళనేనా మీకర్థమయింది? మరేం తట్టడం లేదూ?....'' కిలకిలా నవ్వింది మా ఆవిడ జారిపోయిన పమిట సరి చేసుకుంటూ.

''ఓహో....అదా! మనం కొన్నాళ్ళ దాటు ఫామిలీ ప్లానింగు అమలు జరపాలంటావు....అంతేనా?'' అన్నాను నవ్వుతూ.

''కరెక్ట్!'' అంది మా ఆవిడ మళ్ళీ నా దగ్గరగా జరిగి.

అప్పటినుంచీ తెలిసినంతవరకు మా జాగ్రత్తలో మేం వున్నా. అదేం చిత్రమో గాని అర్నెల్లు తిరక్కుండా మా ఆవిడ కాస్తా 'న్యూ ఎంట్రీ' సిగ్నల్ చూపించేసింది. ఒక వారం రోజులు నా మీద కారాలు, మిరియాలూ నూరి పారేసింది. తనని సమాధానపర చేసరికి నా తలప్రాణం తోకకి వచ్చింది.

''చూడు రమా....ఎవరికేనా సరే! పిల్లలు పుడితే ముప్పయ్యేళ్ళు లోపునే పుట్టేయాలి. తలిదండ్రులకి నలభై ఐదు-ఎభై ఏళ్ళు వచ్చేసరికి. మగవాళ్ళయితే

వాళ్ళ ఎడ్యుకేషను. ఆడపిల్లయితే పెళ్ళి వగైరాలు పూర్తి చేసెయ్యాలి! వృద్ధాప్యంలో పిల్లల బెడద తల్లిదండ్రులకు వుండకూడదు. కాని పక్షంలో నానా యిబ్బందీను....'' అని ఎన్నో రకాలుగా మా ఆవిణ్ణి వొప్పించి, లాలించి, ప్రసన్నురాలిని చేసుకునేసరికి నా తల ప్రాణం తోక కొచ్చింది.

ఆ తర్వాత మా ఆవిడకి మగపిల్లవాడు పుట్టడం, ఆరవ నెలలో మా యింటికి మళ్ళీ తీసుకు రావడం జరిగింది. తాత, అమ్మమ్మల దగ్గర అతి గారాబంగా పెరిగిన మా వాడు మా పాలిటి ఏకు మేకై కూర్చున్నాడు. కొన్నాళ్ళదాకా సాయంగా వుండడానికి మా పెద్ద వదినగారు వస్తానన్నా మా ఆవిడొప్పుకోలేదు 'ఫరవాలేదు నా కలవాటవాలి' అంటూ ఎవర్నీ రానివ్వలేదు. మా మధ్యకి మూడో వ్యక్తి రావడం తనకి మొదట్నుంచీ యిష్టంలేదు. చంటివాడు.... తప్పక సరిపెట్టుకుంది! ఇక మా బుజ్జిగాడి సంగతి....ఇరవై నాలుగ్గంటలూ వాణ్ణి ఎవరో ఒకరు ఎత్తుకునే వుండాలి! కింద పడుకోబెడితే వాడికి పాపం బోర్డు అనీజీగా వుంటుంది. వెంటనే యిల్లెగిరిపోయేలా సంగీతం మొదలెడతాడు. సినిమాకెళ్తే యింటి కొచ్చేదాకా నోరు ముయ్యడు. ఎవరింటికేనా వెళ్తే కొత్త ముఖాలు చూసి గోల గోల! షికారుకెళ్తే మా ఆవిడ చీర రెండు సార్లేనా పాడు చేస్తేగాని వాడికి తృప్తిగా వుండదు... ఇక రాత్రిళ్ళ సంగతి సరే సరి! మా ఆవిడ వాడి వేపునుంచి మరో వేపు వత్తిగిలిందా రాగం అంకించుకుంటాడు.... ఎప్పటికప్పుడు మా ఆవిడ నన్ను నమిలి మింగేసేలా చూసేది-యిదంతా మీ మూలంగానే నన్నట్టు! నా మటుకు నాకు వాణ్ణి సముదాయిద్దామనే ఆశ!....కాని ఏం చెయ్యను? వాడు పూర్తిగా అమ్మ కొడుకు. నా వోడ కిట్టదు. అధవా రెండు నిముషాలున్నా వాళ్ళమ్మ కనిపించగానే నాకు విడాకులిచ్చేస్తాడు!....

ఇలా మా వాడు మాకు, ముఖ్యంగా

లాయర్ ——

● తాను చెప్పేదంతా నిజమనుకునే వ్యక్తి.

(నల్లకోటు ధరించి కాసేపు చెట్టు క్రింద దమ్ముకొట్టి కోటు గాలిలో రెపరెపలాడేట్లు ఒక్క దూకులో జడ్జిగారి ముందుకు గెంతి బల్ల గుద్దిందే గుద్దుతూ క్లయింటూ జడ్జిగారు పరిసర వాతావరణంకు తాను చెబుతున్నది పచ్చినిజం (అంతా అబద్ధమయినా)గా నిరూపించేందుకు ప్రయత్నించేలాడి(గ్రీహోల్డర్.)

మా ఆవిడకి పెద్ద ప్రోబ్లమై కూర్చు న్నాడు. "ఒక సినిమా లేదు, సరదాలేదు పాడు...." అంటూ తెగబాధపడేది. చుట్టు ప్రక్కల వాళ్ళతో ఒకటి రెండు సార్లంది సానుభూతి కోసం .... "చూడండి! వీడు నా ప్రాణాలు తోడేస్తు న్నాడు...." అని.

"చంటి పిల్లలన్నాక అంతే నమ్మా మరి... ఏం చేస్తాం...." అని వాళ్ళనే సరికి మా ఆవిడ తిప్పమని లోపలికొచ్చి, ఏడేమని తలుపు వేసేసింది.ఇలా .. మరో ఆర్నెలు గడిచాయి మా వాడికి కొంచెం నడక వస్తోంది....మాటలు మాత్రం రాలే దింకా....'అమ్మా' అని మాత్రం అందం వచ్చింది. నా దగ్గరకుకూడా రావడం మొదలెట్టాడు యిదివరకటి కంటె కాస్త నయం! యింతలో మా ఆవిడికి బ్రహ్మాండమైన ఐడియా వచ్చింది! మా వాణ్ణి వాళ్ళ పుట్టింటి దగ్గర వదిలేసివస్తే ఎలా వుంటుందని!! ఆ ఐడియా కాస్తా ఇంతై, అంతై ఆఖరికి, మహమ్మారిలా మా ఆవిడ బుర్రని పూర్తిగా ఆక్రమించు కుంది .. నిజం చెప్పొద్దూ! నాకు మాత్రం వాడి నక్కడ వొదలడం యిష్టంలేదు. ఏదో పసివాణ్ణి తల్లినుంచి వేరు చెయ్యాల నంటే నా కెందుకో చాలా బాధనిపిం చింది .. కాని అలాగని మా ఆవిణ్ణి సమాధా నపరచడం కూడా చాలా కష్టమే! పైగా, ఏదను కున్నది-మంచయినా, చెడ్డ యినా ఆక్షరాలా అమలు జరిపే నరకా ఇందిరా గాంధీలా చస్తే విడ్రవోదు మా ఆవిడ!! ... తప్పించుకోడానికి మరో మార్గంలేక "మీ వాళ్ళకు రాసి చూడు! ఏమంటారో!' అన్నా ఆఖరికి.

"వాడు బెంగెట్టుకోని పక్షంలో మాకే అభ్యంతరము లేదు.... అలాగే వుంచు కుంటాం... " అని మావగారె ఉత్తరం రాశారు.

పర్యవసానం....యీ ప్రయాణం.

* * *

రైలు గంటన్నర లేటుతో మా వూరు

జడ్జి

- తాను వినేదంతా అబద్ధం అనుకొనే మహాసీయుడు (అడ్వోకేటులు అబద్ధ మాడుతున్నప్పుడు 'ఆర్డర్... ఆర్డర్' అని హెచ్చరిస్తూ (ఈయన లాయరుగా చాలా అబద్ధాలు ఆడివుంటారు) ఎక్కువ అబద్ధాలు వినేటప్పుడు చూడలేక (కోర్టుకు కళ్ళు లేవంటారు ఇదే) చెవులతో వింటూ లాయర్స్ (లయ్యర్స్) వైపు సన్నని మందహాసంతో తిలకించి వారి వాదాన్ని నిరాకరించే న్యాయాధిపతి)

చేరేసరికి రాత్రి తొమ్మిది గంటలైంది.. అప్పుడు యింటికెళ్ళి ఏం తంటాలు పడతామని హోటల్లో భోంచేసి యిల్లు చేరుకున్నాం.... ఆ కబురూ, ఈ కబురు చెప్పుకుంటూ తాత్కాలికంగా మా బుజ్జిగాణ్ణి మర్చిపోయి, ఉత్సాహంగా యింటికొచ్చినా, మళ్ళీ పడుకోబోయే వేళకి వాడి ప్రసక్తి రానే వచ్చింది.

ఎక్కువ మాట్లాడకుండా అన్యమనస్కంగా చెరో వేపూ వొత్తిగిలి పడుకున్నాం నాకు కొద్దిసేపట్లోనే నిద్రపట్టేసింది.

"అమ్మా!...."

ఉలికి పడిలేచాను. ఎవరిదో పిలుపు!! అదోక రకమయిన బొంగురు కంఠం!

టైము చూశాను....

ఒంటిగంట!!!

"అమ్మా....!!" మళ్ళీ అదే పిలుపు! ఆదే కంఠం!! హృదయ విదారకంగా వుందా పిలుపు. ఒక్కసారిగా వొళ్ళు జలదరించింది....నెమ్మదిగా లేచి లైటు వేశాను....

యింతలో మా ఆవిడ కూడా లేచింది. "ఏమిటండీ? ఏం జరిగిందీ?" అంటూ....

"ఎవరో!!? అమ్మా... అమ్మా" అని రోదిస్తున్నట్టుగా... అదోకలాంటి కంఠం! బొంగురుగా, భయంకరంగా దిగులుగా వుంది....

మా ఆవిడ భయంగా నా కేసి చూసింది.

"ఒక వేళ మీరు భ్రమపడ్డారేమో నండి! బుజ్జిగాణ్ణి వొదిలివచ్చిన దగ్గర్నుంచి మీరదోలా వున్నారు. వాడలాగే 'అమ్మా....' అంటూ వుంటాడు.... ఆ ధ్యాసలో మీరు..."

"అమ్మా... అమ్మా" అదే బొంగురు కంఠం!! హృదయవిదారకంగా, గుండెలు పిండేలా ..తల్లికోసం విలవిల్లాడి పోయే కంఠం!!! ఈ సారి ఆశ్చర్యపోయి, ఉలిక్కిపట్టం మా ఆవిడ వంతయింది.

గభాల్ని నా దగ్గరగా వచ్చి నా చెయ్యి పట్టుకుంది.

"ఏమండీ!! ఎవరిదా పిలుపు? ఏంటిది??...." అంది ఆందోళనగా. తన చెయ్యి వొణుకుతోంది. నుదురంతా స్వేద బిందువులు ఆవరించుకున్నాయి.

"పద....చూద్దాం...." అంటూ బయటికి రాబోయాను.

"వొద్దండీ....నాకేదో భయంగా వుంది...." మా ఆవిడ చెయ్యి మరింత బిగుసుకుంది.

"మరేం ఫరవాలేదు....చూద్దాం పద!" అన్నాను మొండిగా.

బయట లైటు వేసి అరుగు మీద కొచ్చాం.

రోడ్డు నిర్మానుష్యంగా వుంది. గేటు తలుపు తీసి బయటికి చూశాను. మళ్ళీ గేటు తలుపు వేసి మా యింటికి ప్రహరీ

గోడకి మధ్య వున్న రెండు సందులు పరికించి చూశాను. చీకటి తప్ప ఏమీ కనుపించలేదు....మా ఆవిడ అరుగు మీదే ప్రాణాలు బిగి బట్టుకుని నుంచుంది.

''ఎవ్వరూ లేరు ...'' పొడిగా అన్నా అరుగెక్కుతూ.

''అమ్మా...'' తృళ్ళి పడ్డాం ఇద్దరమూను. వెనక్కి తిరిగాను. మా ఆవిడ నన్నొక్క కుదుపు కుదపుతూ ''ఏవండీ! అదుగో! ఆ చావడిలోంచండీ....'' అంది మా యింటి ఎదురుగా వున్న గొడ్లచావడి చూపిస్తూ.

మా యింటి ఎదురుగా రికామీగా వున్న కాళీ స్థలంలో కృష్ణ అనే కేరళ అతను హోటలు పెట్టి నడుపుతున్నాడు హోటలు పాకయినా కాలేజి ప్రక్కనుండడంతో కాలేజి స్టూడెంట్సు, ప్రక్కనే వున్న యిన్‌కంటాక్సు ఆఫీసు వాళ్ళతోనూ, అడపా దడపా వచ్చే రోడ్డుమీద జనంతోనూ అతని హోటలు బాగానే నడుస్తోంది. పాలవాళ్ళ బాధపడలేక అకనొక ఆవుని, గేదెని కొని, కాంటిన్ పక్కనే మరొక పాక వేశాడు వాటికోసం........ యీ అర్ధరాత్రి హృదయ విదారకమైన పిలుపు ఆ పాక లోంచే!!

"రమా! బ్యాటరీ లైటు పట్రా''.... అన్నా ఆదుర్దాగా.

బ్యాటరీ లైటు వేసి, మా ఆవిడ, నేను కంచె తప్పించి పాక దగ్గరకు వెళ్ళాం లైటు లోపలికి సారించాను— నలువైపులా. గేదె తాపీగా నెమరువేస్తూ మా కేసి కాస్త సీరియస్‌గానే చూపింది. యినతల ప్రక్క మూలగా ముడుచుకుని పడుకున్న చిన్న ఆవు దూడ లైటు చూసి బెదురుతూ లేవబోయి మళ్ళీ పడిపోయి.

''అమ్మా''....అంది బాధగా లైటు వెలుగులో దానికళ్ళు చమక్‌మని మెరిశాయి కన్నీటిచారికలు స్పష్టంగా అవుపిస్తున్నాయి చుట్టూ చూస్తూ. 'అమ్మా....' అంది. మళ్ళీ. ఇద్దరం గాఢంగా నిట్టూర్చాం! మా ఆవిడ నా భుజం నొక్కుతూ.... ''తల్లి కోసమండీ .... వెర్రి ముండ....'' అంది

చుట్టూ చూశాం! తల్లి అమ్మ కనిపించ లేదు....

కృష్ణ గుర్రు స్పష్టంగా వినిపిస్తోంది.

"సర్లే....ప్రొద్దున కనుక్కుందాం.... నడు!" అంటూ ముందుకు దారి తీశాను

గాఢంగా నిట్టూరుస్తూ భారంగా కదిలింది నా ఆవిడ

లైటార్పి పక్కపై కళ్ళు మూసు కున్నాను. ఆమె పడుకోలేదు. కూర్చుని ఆలోచిస్తోంది దీర్ఘంగా

"రెండవుతోంది.. పడుకో రమా!" అన్నా

"అది సరే కాని....ఏమండీ! బుజ్జిగాడిప్పుడేం చేస్తుంటాడంటారు?" అంది దిగులుగా.

"ఏం చేస్తాడు? అమ్మమ్మ దగ్గరో. పెద్దమ్మ దగ్గరో వెచ్చగా పడుకునుంటాడు.."

"అది కాదండీ! వాడు రాత్రి రెండు-మూడు సార్లు లేస్తాడు, నేను లేవకపోతే, 'అమ్మా-అమ్మా' అని పిలుస్తాడు. లేచి పాలు పట్టగానే కాసేపు గొడవ చేసి పడుకుంటాడు...వాడి పిలుపు వాళ్ళకి విని పించి లేస్తారో లేదో!! మా అమ్మకసలే మొద్దు నిద్ర! మా అక్కయ్య పగలు చేసి చేసి వుంటుంది! దానికి పడుకుంటే మరి మెలకువ రాదు...." అంది బెంగగా.

"సర్లే! లేవకపోతే మన ప్రబుద్ధుడూరుకుంటాడా? వాళ్లే పడతారు! పడుకుందూ!" అన్నా. విసుగ్గా మరో వైపుకి వత్తిగిలి పడుకుంటూ.

"అవుననుకోండి! వాళ్ళే పడతారు! ఎందుకు పట్టరూ..." తనలో తనే అనుకుంటూ,

పడుకుంది... పడుకుందన్న మాటే గాని నిద్ర పోలేదు. అటూ-ఇటూ దొర్లు తూనే వుంది.

నాలుగ్గంటలు కొట్టేదాకా నాకూ నిద్ర పట్టలేదు. అరగంటకొకసారి బయటినుంచి 'అమ్మా....' అని పిలుపు మా ఆవిడ ఉలిక్కి పడ్డం నేను గమనిస్తూ వున్నాను. ఆ తరువాత ఆ పిలుపు మరి వినిపించలేదు. కారణం....నాక్కూడా గాఢంగా నిద్ర పట్టేసింది.

* * *

మా ఆవిడ గట్టిగా తట్టి లేపుతుంటే మెలకువ వచ్చింది. టైము చూశాను... ఎనిమిది గంటలైంది!! మా ఆవిడకేసి చూసి విభ్రాంత పోయాను....అప్పుడే నీట్‌గా తయారై ఎక్కడికో ప్రయాణానికి సిద్ధంగా వుంది!!

"త్వరగా లేవండి! ప్లీజ్....ఆలశ్యం చెయ్యొద్దు! తొమ్మిదిం బావుకి మెయిల్లో మా వాళ్ళింటికి వెళ్ళాలి...." అంది పక్క గదిలోకి దారి తీస్తూ.

"అదేమిటి రమా! నీకేమయినా మతి



పోయిందా? ఇప్పుడింక దీకెందుకు? నిన్న నేగా వచ్చింది! పైగా యివాళ సెలవు కూడా కాదు...'' అన్నాను ఆయోమయంగా.

"సెలవు లేకపోతే రాపి పక్కాయన చేత పంపించండి! లేదా, నే వొక్కర్తినీ వెళ్ళొచ్చేస్తాను. బుచ్చిగాడు మాత్రం అక్కడుండడానికి వీల్లేదు. ప్లీజ్.... ఏమండీ! త్వరగా తెమలండి....ప్లీజ్.. '' కాప్కిన్ చీర, బ్లౌజు బాగ్‌లో పెడుతూ వొస్తున్న దుఃఖాన్ని క్రింది పెదవితో ఆపుకుంటూ, కళ్ళ నిండా నీళ్ళతో నాకేసి చూస్తూ దీనంగా అంది మా ఆవిడ.

ఇక ప్రశ్నించదల్చుకోలేదు నేను.

క్రిష్ణ కాంటీన్‌లో పనిచేసే కుర్రాణ్ణి అడిగాను. ఆదరా బాదరాగా దొడ్లో పళ్ళు తోముకుంటూ 'ఆవు ఏమయింద'ని! వాడు రోజూ మా కుళాయి నుంచి మంచినీళ్ళు పట్టుకెళ్తూ వుంటాడు.

''మొన్న మంచి బేరం వొస్తే దూడ నుంచి ఆవునమ్మేశాడండి కిట్నా....'' అని హడావుడిగా వెళ్ళిపోయాడు వాడు.

మా ఆవిడ రిక్షాలో కూర్చుంది!

ఇంటికి తాళం వేసి రిక్షా ఎక్కుతుంటే దూడని భుజాన వేసుకుని పాకలోంచి ఎదురొచ్చాడు కాంగ్రెస్ పనివాడొకడు! ఒక్క క్షణం నిర్ఘాంత పోయాను దాని తల నిర్జీవంగా వెనక్కి వేళ్ళాడుతోంది

"రమా! ఆ దూడ...''

''నాకు తెలుసు! మీరేం చెప్పక్కర లేదు....'' అంటూ జేబురుమాలు నోటి కడ్డం పెట్టుకుని, కళ్ళు రెండూ మూసుకుని ముఖం తిప్పుకుంది మా ఆవిడ.

రిక్షాలో కూర్చుని ''పోనీవోయ్ ...'' అన్నా.

స్టేషనుకేసి దూసుకుంటూ పోయింది మా రిక్షా. 

# తూనికలూ కొలతలూ

డాక్టర్ మహీధర నళినీమోహన్

దూరాల్ని కొలవడానికి క్రోసులు, యోజనాలు అని స్వదేశీమానాలు యెన్ని ఉండేవో గాని వాటి నన్నింటినీ తోసేసి 'మైలు' అనే మాట మనదేశ భాషలన్నిటిలోనూ స్థిరపడిపోయింది. 'మైళ్ళు' అనే బహువచన రూపం చూస్తే ఇది అచ్చ తెనుగు మాటా అన్న భ్రమ కలుగుతుంది.

అసలు మైలు అనే మాట రోమనుల నుంచి దిగుమతి అయింది. MILLE PASSUS అనగా వెయ్యి PACES లేదా రెండు వేల అంగలు అనిఅర్థం. ఇది సుమారు 5000 అడుగులకు సమానం. మైలు కొకరాయి చొప్పున మైలు రాళ్ళను పాతే ఆచారం రోమనుల నుంచి వచ్చింది. నిజానికి రోమనుల మైలు ఇప్పటి మన మైలు కన్న చిన్నది. వారి మైలు మన ఇప్పటి 1618 గజాలకు సమానం. రోమనుల తర్వాత మళ్ళీ 17వ శతాబ్దం వరకూ ఏ రాజులూ మైలు రాళ్ళు పాతించే ఆచారాన్ని చేపట్టలేదు

ఐరిష్ మైలు మన 2240 గజాలకు సమానం. 'నాటికల్ మైలు' అని దీని జ్ఞాతి మరొకటి వుంది. ఇది 1. 15 మామూలు మైళ్ళకు సమానం. అందరికీ తెలిసిన మన మామూలు మైలును వదిలిపెట్టి నావికులు చిత్రమైన ఈ నాటికల్ మైలును వాడవలసిన అవసరం ఏమిటో చాలా మందికి తెలియదు. సముద్రంలో ప్రయాణం చేస్తున్న నావికుడు తానుఉన్న చోటును (అక్షాంశము. రేఖాంశము) సూర్యుడినీ. నక్షత్రాలనూ బట్టి తెలుసుకుంటాడు. అక్షాంశంలో ఒక్క డిగ్రీ బేధం వచ్చిందంటే ఓడ 69 మైళ్ళు ప్రయాణం చేసిందని అర్థం. ఏమంటే భూమి చుట్టు కొలతను 360 డిగ్రీలు పెట్టి భాగిస్తే ఒక డిగ్రీ = 69 మైళ్ళు అని వస్తుంది. ఒక్కొక్క డిగ్రీని 60 నిముష

ములుగా భాగిస్తారు. అంటే ఒక్క నిమిషము: 69/60 = 1 3/20 = 1. 15 మైలు. అక్షాంశంలో ఎన్ని నిముషాలు భేదం వచ్చిందో తెలుసుకుని, దానిని 1.15 పెట్టి గుణిస్తే, ప్రయాణం చేసిన దూరం మైళ్లల్లో వస్తుంది. మాటి మాటికీ 1. 15 అనే భిన్నం వస్తూవుంటే గుణించడమూ భాగించడమూ చికాకు. కనుక, ఈ ఇబ్బంది




నుంచి తప్పుకోడానికి 1. 15 మైళ్ళు = ఒక నాటికల్ మైలు అనుకుంటే ఎన్ని నిముషాల భేదం ఉంటే అన్ని నాటికల్ మైళ్ల దూరం ప్రయాణం చేసిందని వెంటనే చెప్పెయ్యవచ్చు. ఓడ వేగము, అది ప్రయాణం చేసిన దూరమూ తెలుపడానికి ఈ నాటికల్ మైలు ఉపయుక్తమైన ప్రమాణం. ఇంగ్లీషులో లీగ్ (LEAGUE) అనే మరో దూరపు కొలత వుంది. దాన్ని 'చూపు దూరం' అని అనువదించవచ్చును. మైదానం మీద నిలువబడితే మనిషికి ఎంత దూరం కనబడుతుందో ఆ దూరాన్ని లీగ్ అంటారు. ఇది సుమారు మూడు మైళ్ళకు సమానం.

తూనికలు:

ఇంగ్లీషు వారితో బాటు, వారి తూకం 'పౌను' కూడా మన వ్యవహారంలోకి వచ్చేసింది. దానినే lb అని వ్రాస్తూ వుంటారు. రోమనుల LIBRA అనే మాటకు lb అనేది హ్రస్వరూపం. ఈ ఈ లీబ్రా అనేది రోమనులు వాడిన ఒక తూనికరాయి LIBRARE అనే మాటకు తూచుట అనే అర్థంవుంది. సామాన్యమైన మనిషి కుడిచేతిని జాపి, చేతిలో

ఉంచుకోగలిగిన బరువును ఒక తూనిక లెంగా తీసుకున్నారు. అదే పౌను. ఇప్పటికీ స్పెయిన్ వారికీ, పోర్చుగీసు వారికీ లిబ్రా అనే తూకపు రాయివుంది. అల్లాగే ఫ్రెంచి వారికి LIVRE (లీవ్ర్) అనీ, ఇటాలియనులకి లిబ్రా (LIBBRA) అనీ బరువులు ఉన్నాయి.

మొట్టమొదట రోమనులు LIBRA అనే పేరుతో ఒక అడుగు పొడవుగల లోహపు కడ్డీని తూనిక రాయగా వాడే వారని తోస్తుంది. ఆ కడ్డీని 12 సమభాగాలుగా చేసి, ఒక్కొక్క సమ భాగాన్ని 'ఔన్సు' అన్నారు. UNCIA అనే వాటికి మటుకు అడుగులో 12వ భాగమనీ, పౌనులో 12వ భాగమనీ అర్థాలు ఉన్నాయి. UNCIA అనే మాటనుంచే INCH (అంగుళం) OUNCE(ఔన్సు) అనే వేరువేరు అర్థాలుగల మాటలు ఏర్పడ్డాయి. (అన్నట్లు ట్రోయ్ పౌండు కి 12 ఔన్సులు.)

రోమనుల కాలంలోనూ, ఇంకా అనేక కాలములలో - అనేక జాతులలో రెండు రకాల తూనికలు ఏక సమయంలో వాడినట్లు ఆధారాలున్నాయి. ఒకటి మామూలు తూనిక, రెండవది రాచ తూనిక. రాచ తూనిక మామూలు తూనిక కన్న పెద్దది. రాజులు ప్రజల నుండి పన్నులు ధాన్యాది వస్తురూపంలో తీసుకునేటప్పుడు ఈ రాచ తూనికను ఉపయోగించే వారు. రాజులు ఇతరులకు యివ్వవలసి వచ్చినప్పుడు మామూలు తూనికలు ఉపయోగించే వారు. ఆ విధంగా రాజులకు ఆదాయం అధికంగా వచ్చేది.

సరిగ్గా యిల్లాగే కాకపోయినా, ఇంచు మించు యిటువంటి పద్ధతే ఇప్పటికీ మరో రూపంలో కనిపిస్తోంది. హైదరాబాదులో పళ్ళ వర్తకులు తోటలోకి వెళ్ళి ఉదాహరణకి వంద పళ్ళు పది రూపాయలకు కొంటారు. కాని, వంద అంటే సరిగ్గా వంద అని కాదుట వంద అని చెప్పి 125 పళ్ళు తీసుకుంటారు. ఆ హెచ్చు పాతిక పళ్ళూ వారికి లాభం మళ్ళీ చిల్లరగా అమ్మేటప్పుడు వంద అంటే ఇచ్చితంగా వంద పళ్ళు పది రూపాయలకు (లేదా ఎక్కువకి) అమ్ముతారు టోకున తక్కువ ధరకు కొని, చిల్లరగా ఎక్కువ ధరకు అమ్మడం మనకు విడ్డూరంగా కనిపించడం లేదు. నిజానికి యీ రెండూ ఒకటే కదూ?

ఇంగ్లండులో 1526వ సంవత్సరం వరకూ యీ రెండు రకాల తూనికలూ అమలులో ఉండేవి. ప్రజలు బంగారము, వెండి టంకశాలకు తీసుకు వచ్చి, నాణెములుగా ముద్రించి పట్టుకుపోయేవారు ఉదాహరణకు ఒక రాచ పౌను వెండి ముద్దను టంకశాల వారు తీసుకుని, మామూలు పౌను బరువుగల వెండి నాణెములు ఆ అసామికి తిరిగి ఇచ్చేవారు.







నాణెములు ముద్రించి నందుకు మజూరీగా ఆ భేదం టంకశాలకు ముట్టేది!

ఇంగ్లీషులో ఔన్సులకు హ్రస్వ రూపంగా OZ అని వ్రాస్తూ వుంటారు. దానికి కారణం ఇటాలియన్ భాషలో ONZA (ఓంజా) అంటే ఔన్సు అని అర్థం ఉండడమే. ఈ మాట కూడా UNCIA అనే లాంటి పదం నుంచి వచ్చినదే; 15వశతాబ్దానికి పూర్వం యూరప్ అంతకీ ఇటలీ వర్తక కేంద్రంగా ఉండేది. ఇటాలియన్ వర్తకులు ఔన్సుకి OZ అని వ్రాసేవారు. దానినే ఇంగ్లీషు వారు కాపీ చేశారు.

రోమనులకు CENTUM PONDIUM అనే ఒక తూనికరాయి ఉండేది. దాని బరువు పౌనుకి వందరెట్లు. అదే ఇప్పటి హండ్రెడ్ వెయిట్ (Hundred Weight) కాని హండ్రెడ్ వెయిట్‌కి ఈ నాడు వంద పౌనులు కాదు, 112 పౌనులు! ఇల్లా భేదం ఉండడానికిన్నీ కారణం ఉంది. టోకున సరుకు కొని, చిన్న చిన్న భాగాలుగా చేసి చిల్లరగా అమ్మేటప్పుడు కొంత తరుగు ఉండడం సహజం. కొందరికి 'కొసరు' వేయక తప్పదు. మరి ఈ నష్టం ఎవరు పెట్టుకుంటారు? కనుక 112 పౌనుల బరువైన సరుకుని 100 పౌనులకీ

ధరకట్టి ఇచ్చేవారు పెద్ద వర్తకులు చిన్న వర్తకులకి. ఇటువంటి హండ్రెడ్ వెయిట్లు 20 కలిపి ఒక టన్ను అయింది కనుక టన్నుకి 20 × 1 2 = 2240 పౌనులు. టన్నుకి పౌనులు రెండు వేలుఅని వీలైన పూర్ణ సంఖ్య కాక 2240 పౌనులు అయి ఉండడానికి కారణం ఇదీ.

కొలతలు:

కుండలు కావలసిన సైజుకి తయారు చేసే కళ బాగా పట్టుబడ్డాక వాటితో కొల వడం ఆరంభమైంది. పక్షుల గుడ్ల గుల్లలతోటీ, కొబ్బరి చిప్పలతోటీ కొలవడం ఆగిపోయింది. ఒక స్థిరమైన ప్రమాణం పట్టే పాత్రలను హెచ్చు సంఖ్యలో చేయడం చేతనైంది. అందులో అర్ధలూ, పావులూ ఏర్పడ్డాయి. కాని, ఒకే పరిమాణంగల వేరువేరు ద్రవాలు వేరువేరు బరువులను కలిగి ఉంటాయని గ్రహించడానికి మానవులకు చాలా కాలం పట్టింది.

ఒక పౌను బరువున్న ధాన్యం పట్టే పాత్ర పరిమాణం PINT (పైంట్) అన్నారు. కాని ఇది చాలా అవకతవక కొలత. ఏమంటే పాత్రను కుదిపితే గింజలు సర్దుకొని, ఖాళీజాగాలు తక్కువై మరికొన్ని గింజలు అధికంగా పడతాయి. ఇందులో యింకో తమాషా కూడా వుంది. ఘన పరిమాణం ఒక్కటే అయినప్పటికీ సన్నగా-పొడుగ్గా ఉన్న పాత్రలో ఎక్కువ గింజలూ, వెడల్పుగా-పొట్టిగా ఉన్న పాత్రలో కొంచెం తక్కువ గింజలూ పడతాయి. ఎందుచేతనో తెలుసా? పొడుగ్గా సన్నగా ఉన్న పాత్రలో అట్టడుగు గింజల మీద పైనున్న గింజల వత్తిడి ఎక్కువ. కనుక గింజల మధ్య ఖాళీలు తగ్గుతాయి. కనుక గింజలు మరి కాస్త అధికంగా పడతాయి.

పైగా ధాన్యపు గింజల వంటి ఘన పదార్థాలను పాత్రలతో కొలవడంలో మరో ఇబ్బంది ఉంది. పాత్రకి 'తలకొట్టి' కొలవాలా? లేక పాత్ర పైభాగాన గుట్టలా పోసి కొలవాలా? అని సందేహం వస్తుంది. దానితో మోసాలకు దారి తీస్తుంది. 'పాత్ర బియ్యానికి పాత్ర నూనె ఇస్తాం' అని ఒక తెలివైన వాడు వర్తకం మొదలు పెట్టిన కథ మనకు తెలుసు. బియ్యం కన్న నూనె ధర రెండు-మూడు రెట్లు అధికం కదా. ఈ విధంగా యివ్వడం ఎల్లా సాధ్యమని ఆశ్చర్యపడ్డారు జనం. వెడల్పాటి, లోతు తక్కువగా ఉన్న పళ్ళెం కొల సాధనంగా ఉపయోగించి, బియ్యాన్ని ఆ పళ్ళెంలో గుట్టగా పోసి తీసుకుని, నూనె అంచులు పొర్లేలా పోసి ఇచ్చాడని కథ. గుట్టగా పోసిన బియ్యం, పళ్ళెం అంచు వరకూ ఉన్న బియ్యం కన్న రెట్టింపు ఉండడంచేత అతడి వర్తకం లాభసాటిగానే జరిగింది. ఆ వర్తకుడిని మోసగాడు అని ఖైదులో పెట్టడానికి బదులు, మేధావి అని రాజకుమార్తె పట్టుబట్టి పెళ్ళాడిందని చెప్తారు.

ఘన పదార్థాలను తలిగేసి కొలవాలా? గుటగా పోసి కొలవాలా? అనే విషయం మీద 1835 లో ఇంగ్లండులో పార్లమెంటులో చర్చ కూడా జరిగిందిట.

'గేలను' అనే పదాన్ని కేవలం పాత్ర అనే అర్థంలోనే మొట్టమొదట్లో ఉపయోగించే వారు. కొన్నాళ్ళకి అది ఒక ప్రమాణం అనే అర్థాన్ని సంతరించుకుంది. దాహంగా ఉన్న పనివాడు ఆపకుండా తాగగల నీరు ఒక 'పైంట్' అని లెక్క వేశారు రోమనులు. అదే కొలత ఎక్కువ మారకుండా ఈనాటికీ నిలిచి ఉంది.

'బుషెల్' (BUSHEL) అనేది ధాన్యాన్ని కొలవడానికి ఒక మానంగా పాశ్చాత్యులు వాడుతూ ఉంటారు. పూర్వపు ఫ్రెంచి భాషలో BOISSEL అంటే కర్రపెట్టె అని అర్థం ప్రత్యేకమైన కర్ర పెట్టెను ధాన్యం కొలవడానికి ఉపయోగించేవారని తెలుస్తోంది.

ద్రవములను కొలవడానికి పాత్రలు ఉపయోగించడంలో ఇబ్బంది ఏమీ లేదు. మధ్యలో ఖాళీలు మిగిలిపోవడం, అంచులు దాటి గుట్టగా ఏర్పడడ వంటివేమీ జరుగవు. కాని రానురాను ద్రవములను కూడా తూకం వేయడం వైపే మొగ్గు చూపుతున్నారు. ఘన పదార్థాలు సరే సరి. అనపకాయలు, పుచ్చకాయలు, కాబేజీ, కాలీప్లవరు వంటివి తూచి అమ్మడం కొందరికి ఆశ్చర్యంగా ఉంటుంది. కొన్ని చోట్ల నారింజ కాయలూ, అరటి పళ్ళూ వగైరాలు కూడా తూచి అమ్ముతారు. అదే న్యాయం మరి పండుని కంటితో కొలిచి చిన్న-పెద్దలు నిర్ణయించడం కష్టం కదా? తూకం వేస్తే వెంటనే తెలిసి పోతుంది.

డబ్బాలలో సీలు వేసి అమ్మే వస్తువులకు లోపల సరుకు ఎంత ఉన్నదో డబ్బా పైన వ్రాయాలని నియమం ఉంది కాని, ఈ చక్కని నియమం అన్ని వస్తువులకూ ఉన్నట్లు లేదు. స్నో సీసాకి అడుగున అరంగుళం మందాన గాజు ముక్క ఉంటుంది. పైకి చూస్తే చాలా ఉన్నట్లు కనిపించి కొంటాం. లోపల వస్తువు ఎంతో ఉండదు ఇది కూడా మోసం క్రిందే లెక్క. అల్లాగే టూత్ పేస్టుల విషయంలో కూడాను పైకి పెద్ద ట్యూబులా కనిపిస్తుంది. తీరా చూస్తే లోపల చాలా భాగం గాలి. వీటి కన్నింటికీ కూడా లోపల ఉన్న సరుకు బరువు ఇంత అని స్పష్టంగా పైన వ్రాయించే నియమం ఉంటే బాగుంటుంది కదూ? సైన్సు ఇంతగా అభివృద్ధి చెంది, గ్రామంలో కోటి కోట్ల వంతును కూడా కొలవగలిగిన సాధనాలను కలిగి ఉన్న ఈ శతాబ్దంలో కూడా ట్యూబులో టూత్ పేస్టు ఎంత ఉందో తెలుసుకోడానికి వీలు లేక పోవడం శోచనీయం కదూ?




రాత్రి పది గంటలయింది....బడ్డీ అంగళ్ళు ఒక్కొక్కటే మూత పడుతున్నాయి.

నా అంగడి కూడ మూసి వేయవలసిందే కాని క్రొత్తగా విడుదలయైన కొమ్మూరి వారి డిటెక్టివ్ నవల చదువుతూ వుండి పోయాను. బీడీకో, సిగరెట్టుకో ఎవరో ఒకరు వస్తూనే వున్నారు. రోడ్డు మీద జనం పలుచనయ్యారు. రెండో ఆట సినిమా మొదలు పెట్టి ఉంటారు. మిఠాయి బండి తిరిగి వచ్చేస్తూ వుంది. ప్రతి రోజూ నాలుగు గంటలకే బయలుదేరి సినిమా హాలు ముందుకు చేరుకొంటుంది.

ఆ వుప్పాటి అక్కమ్మ బడ్డీ మీదనుంచి [illegible]గి దిక్కుకు ఒప్పజెప్పి వచ్చేస్తూ వుంది. లావుగా వున్నా మాటలతోనే బేరగాళ్ళను చేరదీస్తుంది. ప్రతి సాయంత్రము బడ్డీ ప్రక్కనే పొయ్యి వెలిగించి, మసాలా వడలు వేస్తుంది [illegible] పిలిచి [illegible] రాజా హారిలు [illegible]

సులభంగా ఇరవై రూపాయిల బేరం చేస్తుంది. నా భార్యకూడ వుంది. ఉత్త సిగ్గు మనిషి. డిటెక్టివ్‌లు చదవటం మరిగింది.

ఓ యబ్బో! నాగరత్నం వస్తోందే! పూల తట్ట వుంది ఈ రోజు చంకలో. ఏ రోజు ఏ వ్యాపారం చేస్తుందో అంతు బట్టదు. కాకిలా వున్నా ఏం వయ్యారం పడుతుంది ఈ ఆడది! 'కూటికొరకు కోటి విద్యలు'—ఊరికే అనలేదు పెద్దలు.

మొదటిలో ఏడేళ్ళ అమ్మాయిని చంక

క్కొంటాము." అని చెప్పి ఆమె కట్టిన చీర చినిగి వుండగా చీరలు యిచ్చి పంపింది కలెక్టరు భార్య.

'అమ్మా! కలెక్టరమ్మ చీరలు యిచ్చిదంటూ' తక్కువ ఆఫీసర్ల భార్యల దగ్గర కూడా వసూళ్లు చేసింది.

'ఉత్తరం ఏమైనా వచ్చిందా!' అని పోయి వస్తూనే వుంది. అప్పటికీ తన తట్టలో వున్న పూలు, పండ్లు చల్ల చల్లగ అమ్మేస్తూ వుంది.

---

ఆకలి బాధతో అలమటించినా ఆశయాలతో మనుగడ సాగించాలను కొనే వారి జీవిత కధకు అంత మేమిటి?!

ప్రతి మనిషికీ ఓ ప్రత్యేకమైన కధవుండితీరుతుందీప్రపంచంలో!

---

వేసుకు తిరిగింది ఆఫీసర్ల యిండ్లకు. "నా భర్త రిజర్వు పోలీసు. ఫలానా ఊర్లో ఉన్నాడు. రెండు నెలలుగా డబ్బు లేదు. ఉత్తరమూ లేదు. పస్తులుంటున్నాము నేను, నాబిడ్డలు." అంటూ గొంతు పైకి లేవనట్లే అన్నము తిని ఎన్నో రోజులైనట్లు మాట్లాడసాగింది.

దయ కలవాళ్లు వారికి తోచిన సహాయం చేశారు చివరికి ఒక రోజు కలెక్టరు భార్యను దర్శించింది.

"నీ భర్త ఏమయ్యాడో వ్రాసి కను

ఈ మధ్య ఒంటికి బాగా రక్తం వచ్చినట్లుంది. బుట్ట చంకన బెట్టి మండీల దగ్గరికి వెళ్ళి పండ్ల బేరం చేసినట్లే ఆ మండీ ఈ మండీ తిరుగుతూ మాట్లాడుతూనే కడుపు నిండుగా మెక్కేస్తుంది.

'ఒక్కటే కదా' అని రాముడి తల్లి ముందు గది ఒకటి అద్దెకిచ్చింది నాలుగు రూపాయలకు.

"బాడుగ ఏదే రత్నా!" అంటే—
"ఇస్తాలే! కూటికే లేదు నా దగ్గర...." అనటం మొదలెట్టింది.

"పూలమ్ముతున్నావు. పండ్లమ్ముతున్నావు. ముక్కాల చీరలు కడుతున్నావు. సినిమా కెళ్తున్నావు. నీ దగ్గర డబ్బు లేదంటే నేను నమ్ముతానా!?" అని విల దీసినా లొంగిరాలేదు. రాముడికి చెప్పుకొంది తల్లి "దాని పెట్టె గుడ్డలు బయటకి పారేయ్." అని చెప్పిన వాడు ఒక్కరోజు నిజంగా అలాగే చేశాడు.

"ఏరా! వెధవా! నన్ను పిలిచావు. నేను రాలేదనేనా నా పెట్టె బయటకి వేశావు" అంటూ గయ్‌మని లేచింది.

రాముడి భార్య పుట్టింటికి వెళ్ళి కూర్చుంది. అన్నెము పున్నెము ఎరుగని రాముడు. "అయ్యో! అయ్యో! దొంగ! ఏం నాటక మాడుతున్నావే!?" అంటూ నెత్తి నోరు కొట్టుకున్నాడు.

కాని వాడి మాట నమ్మే దెవ్వరు! చిత్రాంగి కాలం నుంచి యిలా ఎంత మంది నోరు కొట్టుకుంటున్నారో కదా! చరిత్ర దాటి పోయింది.

భూషమ్మ సన్నని ఆకారం నీడలా కనిపించింది దూరం నుంచి ఖాళీ అయిన అన్నం తట్ట నెత్తిన వుంచుకొని తిరిగి వస్తూవుంది. హోటళ్లలో ఎంగిలి ఆకుల అన్నమంతా ఒక దగ్గర చేర్చి. 'మిక్చరు భోజనం' ఇరవై. ముప్పయ్ పైసలకు సత్రం దగ్గర చేరిన బిక్షగాళ్ళకు అమ్ముతుంది.

ఇంత ప్రొద్దుదాకా వుందేం యిది ఈ రోజు? చుట్టము పక్కమూకాదు, ఇరుగు పొరుగు కాని ఓ గ్రుడ్డి ముసలివాణ్ణి వెంట బెట్టుకొని బస్ స్టాండ్. రైల్వే స్టేషన్. తిరగ వలసిన స్థలములన్నీ తిరిగి తిరిగి. వచ్చిన డబ్బులో తన భాగం తీసుకొని. గ్రుడ్డివాణ్ని గుడిసెలో వదలి. తన గుడిసెకు చేరుకుంటుంది. కుంటి ముసిల్ది. మరో ఊళ్లో సేద్యం చేసుకొంటూన్న కొడుకు కూతుళ్ళు వచ్చి ముసలిది కూడ వేసిన డబ్బు పట్టుకుపోతూ వుంటారు.

కుంటి ముసలి వెనుకనే. కర్ర టకటక లాడించుకొంటూ వస్తున్నాడు దిగంబరి తాత. రాముల వారి గుడి దగ్గర నుంచే కాబోలు. వాడి దిగంబరత్వం చూడలేక చొక్కాలు. కోట్లు. పంచలు దానం చేసిన వాళ్లూ వున్నారు. ఇచ్చినవి యిచ్చినట్లే మాయం చేస్తూ వుంటాడు. అంటే గిట్టిన ధరకు అమ్మేస్తూ వుంటాడు. ఎండకూ. వానకూ అలవాటు పడింది వాడి శరీరం. పుట్ట గోచితోనే జీవితం గడిపేస్తూ వున్నాడు.

పదకొండు గంటలు కొట్టింది ఎక్కడో! నోరంతా తెరిచి ఆవలింతను బయటకు గెంటి చెక్క తలుపును క్రిందికి దించి. తాళం పెట్టి రోడ్డెక్కాను.

దాదాపు నిర్మానుష్యంగా వున్న రోడ్డు మీద అయిదారుగురు పిల్లలు పరుగెత్తుతూ










నడుస్తూ, అరుచుకొంటూ వస్తున్నారు. వాళ్ళ మధ్య మూడేళ్ళ కుర్రాడు వున్నాడు. అల్లంత దూరంలోనే వాళ్ళను గుర్తు పట్టాను. వాళ్ళు రంగయ్య తాత మనవళ్లు. చిన్నాడు రాము. దగ్గరకు వస్తూనే నన్ను చూచి, ''మామా! అంగడి మూత పడిందా!!'' అంటూ పలుకరించాడు. వాణ్ణి ఎత్తుకొని నడువ సాగాను. వాడి చిన్న జేబులోని పైసలు శబ్దం చేశాయి. తక్కిన పిల్లలు నా ప్రక్కగా నడువసాగారు. వాళ్ళంతా పదేళ్ళ లోపు వాళ్ళు నిద్ర కళ్లతోనే నడుస్తున్నారు. చెడ్డీ వున్నవాడికి చొక్కాలేదు. ప్రతి వారి చేతిలో పొట్లాలు వున్నాయి దేవుని ప్రసాదం.

''ఇంతసేపు వున్నావేంరా రామూ?'' అన్నాను.

''అయ్యవారు పంపలేదు మామా!'' ముద్దుగా చెప్పాడు.

అందరిలో రాము ముద్దుగా వుండి ప్రత్యేకంగా మెత్తని కుందేలు పిల్లలాగా వుంటాడు. నల్లనల్లని గుండ్రని కళ్ళు. పొట్టి ముక్కు, చిన్నవి తెల్లని పాలవంటి పళ్ళు. స్వేచ్ఛా జీవి. తింటానికి మిఠాయి లేకపోయినా స్వేచ్ఛ కావాలి వాడికి. అదే నన్ను ఎక్కువ ఆకర్షించింది వాడిలో. మా పక్క యిల్లే వాడిది.

భార్యను, పిల్లలను పోషించలేక ఊరు వదలి వెళ్ళిపోయాడు రాము తండ్రి.

రంగయ్య కూతుర్ని చేరదీసి కలిగిన దానితోనే పోషించాడు. ఊరు వదిలిన రంగయ్య అల్లుడు హైదరాబాదు అవతల వున్న సిమెంటు ఫ్యాక్టరీలో చేరి, తిండికి

వంపాదించుకున్నట్టే సంసారానికి మరో భార్యను కూడ చేసుకొన్నాడు.

"ఇక్కడి వాళ్ళను పూర్తిగా మర్చిపోలేదు; అని చెప్పినట్టుగా నెలకు ఇరవై. ముప్పయ్ పంపిస్తూ వున్నాడు.

ఆ పంపే దానికి కూడ ఒకొక్కసారి నాగాలు వుంటాయి. రూపాయికి విలువ తగ్గిన ఈ రోజుల్లో ఇరవై ముప్పయ్ ఏ వారికి వస్తాయి?

నడుము విరగ గొట్టుకొని పూలమాల లను కట్టినా రోజుకు అరవై. డెబ్బయ్. పైసలు వచ్చేసరికి గగనమై పోతూవుంది రాము తల్లికి.

ఎలాగో జీవితాన్ని సాగిస్తూ వుండగా. రంగయ్యకి పై లోకం నుంచి పిలుపు టెలిగ్రాంలా వచ్చింది. పోయేటప్పుడు అయినా వాళ్ళను చుట్టూ వుంచుకొని. "ఏరా బాబులు! మీకు నేనేమీ యిచ్చి పోవటంలేదు. నాజీవితమంతా ఆస్వాముల వారి గుడి దగ్గరే గడచిపోయింది. మీకూ ఆ స్వామే దిక్కు!" అంటూ ప్రాణాలు వదిలాడు రంగయ్య తాత.

ఆ రోజునుంచి పిల్లలు ప్రొద్దునే లేచి. అమ్మ యిచ్చిన గంజి త్రాగి. గుడికి పోజ రౌతారు. రంగయ్యతాత స్వాముల వారి గుడి దగ్గర పూజారి చెప్పిన పనులల్లా చేస్తూ వుండేవాడు. ఈ పిల్లలు కూడ చుట్టూ పీళ్ళు చల్లి. శుభ్రం చేసి అక్కడే వుంటారు. అయ్యవారిచ్చే ప్రసాదం. భక్తుల దగ్గర దొరికే కొబ్బరి ముక్కలే వారి భోజనం.

మిగిలిపోయిన ప్రసాదం తెచ్చి అమ్మ కిస్తూ వుంటారు. ఓ పౌర్ణమినాడు వచ్చిన రంగయ్య అల్లుడుపిల్లల్ని బడిలో వేశాడు ఉన్న వారం రోజులు పండుగ చేసుకొన్న టున్నారు. ఆ తర్వాత మామూలేను .. పక్కింటి మామలాగే వుంటాడు నాన్న. ఎనలేని గౌరవం నాన్న మీద పెంచు కొన్నాడు రాము. వదిలి వెళ్ళిపోయిన తండ్రిమీద ఎంతో గౌరవం. ప్రేమ.

తల్లి చంక దిగిన రాము నడక మాటలు నేర్చాడు. గుడికి పోయే వంతు వచ్చింది వాడికి బుజ్జిగా వున్న రాముని చూస్తే అందరికీ ముద్దే!

ప్రొడ్యూసర్ ——————————————

● పెట్టుబడీ దారి

(ప్రతి షాట్ తొలి దశలోనే ఓకే కావాలని వినాయకుణ్ణి ప్రార్థించే దైవ భక్తుడు (ఈ భక్తి దర్శకుని పాలిటి యమపాశం)

ప్రసాదమే కాక పూజారి మధ్య-మధ్య వాడికి మిఠాయి కొని యిచ్చి, వచ్చే టప్పుడు జేబులో డబ్బులుంచుతాడు. అక్కడ వాడు ఆడకూడదు; అల్లరి చెయ్య కూడదు. అయ్యవారి చెప్పు చేతల్లో వుండాలి. అది వాడికి నచ్చదు. స్వేచ్ఛగా ఇంటి పరిసరాల్లో ఆడుకొంటూ, అందరినీ పలకరించుకొంటూ తిరగటం వాడి కిష్టం.

గుడికి పొమ్మంటే ఏడుస్తాడు....

''నాన్నకు చెప్పతానం''టూ అన్నలను బెదిరించాలని చూస్తాడు. కేవలం తిండి కోసం వెళ్ళటం వాడికే మాత్రం యిష్టం లేదు. జాలిగా వాడివైపు చూడడం వాడు సహించడు. ఒక వ్యక్తిగా గుర్తించి పలుకరించడం వాడి కిష్టం.

ఒక్క మాట పడడు. ఆ చిన్నారి ముఖంలో పౌరుషం కొట్టవచ్చినట్లు కని పిస్తూ వుంటుంది.

పీడు వారి వెంట వుంటేనే వారికి లాభం. ఏడుస్తున్నా, ఆరుస్తున్నా లాక్కొని పోతారు రోడ్లో.

''వాడి కిష్టం లేదు. ఎందుకురా బల వంతం?'' అంటే —

''ఇక్కడ వుంటే కడుపెలా నిండు తుంది? మా అమ్మ అన్నం వండదు మరి!'' పదేళ్ళ శ్రీను జవాబు.

నేను మూగవాడినే అయ్యాను. ఒక్క రోజు పెట్టగలనేమో! మరో రోజు!!

మరి రాము బాధను అర్థం చేసుకొనే దెవ్వరు? ప్రతి రోజు గుడి మూసే వరకు అక్కడే వుండి పదకొండు గంటలకు తిరిగి వస్తారు.

రాము వచ్చేటప్పుడు దారిలో అందరినీ పలుకరించుకొంటూ, యిలు అంత దూరంలో వుండగానే కేకలు పెట్టుకొంటూ వస్తాడు. జేబులోని పైసలు యిస్తూ, ''దాచు,'' అంటాడు తల్లితో.

ఈ రాము కథ ఎవ్వరికి చెప్పను!? పేరు లేని ఈ కథను ఎవ్వరు వింటారు?

అందుకే నాలోనే వుంచేసు కొన్నాను. ●

## డైరెక్టర్

● ఖర్చు దారీ

(రోజుకు కనీసం వెయ్యి గజాల ఫిలిం పాడావందే తన ప్రతిభ తెరమీద కెక్కదనుకొనే శ్రమజీవి. ఈ శ్రమవల్ల నిర్మాతకు అప్పుడప్పుడు బ్లడ్ ప్రజర్ రావచ్చు.)

# ఎవరు

ప్యారిస్‌లో కౌంట్ బైజట్‌కు ఒక్కగా నొక్క కొడుకు ఎన్నాళ్ళకో పుట్టాడు పేరు బెల్లాన్. లేక-లేక పుట్టాడని అబ్బనా కారంగా పెంచాడు. ఆడింది ఆటగా, పాడింది పాటగా అన్ని సౌకర్యాలు సమకూర్చాడు. అందుకే కొరకరాని కొయ్యగా తయారై తండ్రికి మనోవ్యధ కలిగించాడు.

చదువు వంట బట్టలేదు సంస్కారం అబ్బలేదు. పెరిగే వయస్సుతో పాటు అహంకారం .. దాంబికం .... పెరగ నిచ్చాడు. ముక్కు మీద కోపం. తలంతా తిక్కతో నిండి పోయింది. ప్రతి వారిని తేలిగ్గా తీసి పారేయడం. హేళనగా మాట్లాడ్డం అతనికి పరిపాటి. ఈ ప్రపంచం అంతా తనకు కొట్టిన పిండి అని మిడిసి పాటు.

నౌకర్లను కొట్టి, ఇరుగు పొరుగు వారితో కజ్జాలు పెట్టుకొని మిడిమేలప్పు దొర అయ్యాడు. తాగుబోతు తిరుగుబోతు. స్నేహితుల్లేరు-హితుల్లేరు. సన్నిహితులు అంతకన్నా లేరు. ఉన్నదల్లా 'నేను' అనే ఒక్క మొండి ధీమా.

అందమైన అమ్మాయితో పెండ్లి జరిగింది కొన్నాళ్ళపాటు కుదురుగా వున్నట్టు కనుపించినా మళ్ళా మామూలు ధోరణే సాగింది మనవడు పుట్టబోతున్నట్టు బైజట్‌కు వర్తమానం అందింది. ఎన్నాళ్ళ బట్టో ఎదురు చూస్తున్న సుముహూర్తం వచ్చేసినట్టు బైజట్ అనుకొన్నాడు. ఆ రోజు రాత్రి 2 గంటలకు పుత్రోదయం అయింది.

టిప్-టాప్‌గా ముస్తాబై పొద్దున్నే కొడుకును చూడ్డానికి బెల్లాన్ బయలు దేరాడు. గదిలోకి వచ్చి చూసేసరికి రెండు ఉయ్యాలల్లో ఇద్దరు పాపలు ఉన్నారు. ఒకే రకం దుస్తులు వేసి వున్నాయి. ఒక పాపడు రెండెలా అయ్యారు. ఇందులో తన బిడ్డ ఎవరు? ఎలా గుర్తు పట్టడం?

ఈ ఆలోచనల్లో అతనికి కోపం వచ్చింది. నౌకర్లపై ఒంటి కాలితో లేచాడు శివమెత్తిన వాడిలా చిందులు తొక్కి పిచ్చిగా అరిచి ఇల్లంతా గగ్గోలు చేశాడు.

ఇంతలో బైజట్ వచ్చి "ఏంట్రా ఈ అంకమ్మ శివాలు!" అన్నాడు

"ఇదేదో మాయగా వుంది నాన్నా! ఎవరు చేశారు? ఎందుకు చేశారు? ఇందులో నీ మనవడు ఎవరని?" అన్నాడు.

పక-పకా నవ్వుతూ "సర్వజ్ఞుడవని దబ్బా మోగించేవాడి కదరా! నీ కన్న

కొడుకు ఎవరో కూడా గుర్తించలేవా? ఎవరిలో నీ నెత్తురు పారుతుందో నీ బోడి తెలివి తెలివి తేటలతో కనిపెట్టలేక పోయావా?.... షేమ్! షేమ్! నువ్వొట్టి ఉంతవేనన్న మాట!" అన్నాడు ఎగతాళి చేస్తూ.

"అదేంటి నాన్నా! అంతేసి మాట లంటారు...." అన్నాడు చిన్నబుచ్చు కొంటూ.

బైజట్ ఉయ్యాల దగ్గరకొచ్చి "ఇదుగో వీడు నీ కొడుకు. కాలి వేలికి ఓ తాడు కట్టి

# గొప్ప?

వుంది చూడలేదట్రా చవటా? ఈ గుర్తు లేకపోతే నాకూ నీ అవస్థ పట్టేది. విచ్చల విడి మిడిసిపాటు తగదని, నీకు బుద్ధి చెప్పాలని నేనే యీ ప్లాన్ వేశా...." అన్నాడు.

కొన్నాళ్ళకు బెల్డ్రా జబ్బున పడ్డాడు. డాక్టర్ ఆపరేషన్ చేయాలన్నాడు. కాక తాళీయంగా బైజట్ నౌకర్లలో ఒకడికి ఇంచుమించు అదే జబ్బు చేసింది ఇద్దరికీ ఆపరేషన్ జరిగింది. బైజట్ కోరికపై డాక్టరు ఇద్దరి రక్తాన్ని వేరు-వేరు పాత్రల్లో కొంచెం పోసి పెట్టాడు.

"డాక్టర్? ఈ రెండిటిలో ఏది స్వచ్ఛ మైన రక్తమో పరీక్ష చేసి చెప్పండి!" అని అడిగాడు బైజట్. కాసేపటి తర్వాత డాక్టర్ టెస్ట్ చేసి "ఈ పచ్చగాజు పళ్లెం లోది చాలా 'ప్యూర్'!" అన్నాడు.

"ఒరేయ్! అది నీ రక్తం అనుకొం టున్నావేమో! కాదు. ఇది నీ వద్ద వెట్టి చాకిరిచేసి బ్రతికే నీ నౌకరుది నీ నెత్తురు కన్నా స్వచ్ఛంగా వుండట విన్నావా? ... అందుకు కారణమేంటో తెలుసా? నీ నౌకరుకు అహంభావం లేదు. సౌమ్యుడు. శాంతపరుడు మెత్తని మనస్సు కలవాడు. ప్రకృతికి అనుగుణంగా ఊపిరి పీల్చే సహజమైన జీవి. ప్రవృత్తిని బట్టి-ప్రవ ర్తన బట్టిరా చిన్నా పెద్దా! డబ్బును, హోదాను బట్టి కాదోయ్! తన విధిని సక్రమంగా నిర్వర్తిస్తూ, చేసే సేవలో తృప్తి పడుతూ అంచెలంచెలుగా ఎదిగిస్తూ వుంటాడు. అట్టి వాళ్ళు నూరేళ్ళు బ్రతుకు తారు చేసే పని ఏదైనా, జీవించే జీవితం ఎలాంటిదైనా వారి-వారి తాత్విక శైలిని బట్టి మనిషి సుఖపడి ఇతర్లను సుఖపెట్ట కలుగుతాడు. ఈ జీవిత సత్యాన్ని చచ్చేంత వరకూ మరిచిపోకు, తెలిసిందా?...." అన్నాడు బైజట్.

—కొల్లికుదురు రాజశేఖరరెడ్డి.




తండ్రి యిచ్చిన టెలిగ్రాం అందుకున్న గోపీకృష్ణ వెంటనే బయలుదేరి యింటికి వచ్చేశాడు ఒకటే ఖంగారు పడిపోతూ.

వాకిట్లోకి ఎదురైన మేనమామ గోపీకృష్ణని చూస్తూనే "ఓ బావా! వచ్చేసే రయ్యా నా అల్లుడూ! నే చెప్పలా, వుత్త పడ్డాడు. గనుక మిగతా పనులన్నీ చక-చకా కానీయండయ్యా! ఇదిగో మన పందెం మాట మరవకు అర కిలో లంక



రాలకి వూడి పడతాడా? ఓ టెలిగ్రాం పారెయ్యి—దెబ్బకి దెయ్యం కుదిరినట్లు రెక్కలు కట్టుకు వాలకపోతే నా పేరు కామయ్యే కాదని ఛాలెంజ్ చేసి చెప్పానా? గోపీ నే చెప్పినట్లుగా టంచనుగా వూడి పుగాకిలాపారేయవయ్యా బావగారూ!"

చేతిలోని హేండ్ బాగ్ పాలేరు కుర్రాడు అందుకుంటుంటే యాంత్రికంగా యిచ్చేసి యింటి వాతావరణం అంతా కలయజూస్తూ "అంతా బాగున్నారా మామయ్యా! నాన్న

పరీ....అమ్మా!''

మేనమామ ఏదేదో అంటూన్నా అర్థం కాక తెల్లముఖం వేసుకు చూస్తూ విల్చున్నాడు గోపీ.

''అల్లుడా! అందరం క్షేమం. అక్కా! యింకా లోపల ఏం చేస్తున్నావమ్మా.... ఇదిగో నీ పుత్ర రత్నం.''

గోపీ తల్లి కాంతమ్మ పరుగు-పరుగున వచ్చి కొడుకుని కౌగలించుకుంది.

''ఎన్ని వుత్తరాలు రాసినా రాకుండా యిన్నాళ్లు ఎలా వుండ బుద్ధి అయిందిరా? రా లోపలికి .. కాళ్ళు కడుక్కో. కాఫీ తెస్తా!'' తల్లి లోపలికి నడిచింది.

తండ్రి కాస్త దగ్గరకొచ్చి ''ఎన్నాళ్ళు శలవు పెట్టావురా?'' అన్నాడు కొడుకుని ప్రేమగా చూస్తూ.

''రెండు రోజులు.''

''రెండు రోజులెలా సరిపోతుంది? మరో వారం శలవు రాసి పడెయ్యి''

''ఎందుకూ? ఇంతకీ నన్నిలా అర్జెంటుగా రమ్మని టెలిగ్రాం ఎందుకిచ్చినట్లూ?''

''ఎందుకేమిటి! నీతో బోలెడంత పని వుంది. ఆ విషయం తర్వాత ముందు స్నానం కాఫీ అదీ తీసుకో!'' అంటూ వెళ్ళిపోయాడు ఆయన.

ఇంట్లో ఎవరెవరో బంధువులు చాలా మందే వున్నారు. ఒక్కొక్కరూ వచ్చి పల్కరిస్తున్నారు. గోపీకి మహా చికాకే వచ్చింది. స్నానం చేసి డాబా మీదకి వెళ్ళి ఆరుబయట వాలుకుర్చీలో పడుకుని తల్లికి కబురు పంపాడు.

కాంతమ్మ ''ఏమిటిరా నాయనా!'' అంటూ వచ్చి కూర్చుంది.

''ఇందరు చుట్టాలూ కట్టగట్టుకుని ఒకేసారి యిల్లు విండిపోయేలా వచ్చారు. ఎందుకమ్మా?'' విసుగ్గా ముఖం పెట్టి అడిగాడు.

''అదేమిటిరా అలాగంటావూ! సిద్ధాంతి మరో మంచి ముహూర్తం లేదని రెండు రోజుల్లోనే మంచిది వుందని 'లగ్నం' పెట్టాడు. అందుకని ఏర్పాట్లన్నీ యిక్కడే చేయించేస్తే బాగుంటుందని ఆలోచించి యాకంగా రెండూ....''

తల్లి మాట పూర్తి కాకుండానే కోపంగా అన్నాడు. ''మళ్ళీ ఎవరి పెళ్ళి చేస్తున్నారు?''

''నీ ప్రశ్న నా ముఖంలా వుంది. ఒక్క పెళ్ళికేనా 'లగ్నం' పెట్టేది. గృహప్రవేశానికి, పిల్లలని బడిలో వెయ్యటానికి వడుక్కి, పెళ్ళికి, సోభనాలకి....ఇలా చెప్పాలంటే ఎన్నింటికో - మంచి రోజు చూడాలిగా!''

''నువ్వు చెప్పే ఏ ఒక్క అవసరం లేదు కదమ్మా! మరెందుకిప్పుడీ హడావిడి అంతా?''

''అవసరం మనకే....అంటే నీ

కోసమే యిదంతా....పదేళ్ళ పిల్ల మెడలో మంగళసూత్రం కట్టి ఒక్కసారి తప్ప మళ్ళీ వాళ్ళ గడప తొక్కావా? అలా వెళ్ళి యిప్పటికి మూడేళ్ళు దాటిపోయింది. ఎన్ని సార్లు రమ్మని రాసినా విన్పించు కున్నావా? మామాట ఖాతరు చేస్తున్నావా? కోడలు పుష్పవతి అయి రెండేళ్ళు దాటి పోతోంది. ఇంకా ఎన్నాళ్లు వూరుకుంటాం. చెప్పు? మొన్నటికి మొన్న ఆ హోటలు మెతుకులు సరిపడక వారం రోజులు పడక

రంగన్న దిండు చేత్తో పట్టుకుని అడి గాడు.

"అది కూడా వేసి. పరుపు వెయ్యి. రంగన్నా!...." మెల్లగా పిల్చాడు.

"ఏంటి బాబూ!" ఎంతో చనువుగా అడిగాడు రంగన్న. రంగన్న ఆ యింట్లో ముప్పైయ్యేళ్ళ బట్టీ నౌకరీ చేస్తున్నాడు. గోపీకి అతనంటే చాలా యిష్టం.

"రంగన్నా! 'పుష్పవతి' అవటం అంటే ఏమిటి?"

---

మూడు ముళ్లు - వైవాహిక జీవితానికి పవిత్ర సూచన!

వయస్సులో తేడావున్నా, అయిష్టతకు దారితీసినా వారిరువురూ భార్యా భర్తలే!!

---

పెట్టానని వుత్తరం రాశావా?" అలా ఏదేదో చెప్పుకు పోతోంది శాంతమ్మ.

'పుష్పవతి అయింది' అంటే.... ఈ పదానికి అర్థం తెలియక అలా అని, దాని కర్థం ఏమిటని తల్లిని అడగలేక వూరు కుండి పోయాడు.

శాంతమ్మని ఎవరో పిలవటంతో వెళ్ళి పోయింది. గోపీ అలా ఆలోచిస్తూ పడు కునే వున్నాడు.

"బాబుగారూ! దిండు ఒకటేనా? ఇది కూడా ఎయ్యమంటారా?" నౌకరు

రంగన్న మొదట తెల్లబోయాడు ఎంతో పెద్ద చదువులు చదువుతున్న చిన్న దొర ఓ చిన్న మాటకి అర్థం తెలియక ఓనమాలు రాని తనని నిజంగా తెలియకే అడుగుతున్నాడా....? గోపీ ముఖంలోకి పరీక్షగా చూసి—నిజమే! అర్థం చేసుకో లేక పోయాడనే నమ్మకం కల్గి "చిన బాబూ! 'పుష్పవతి' అంటే ఆడపిల్ల... అదే- ఈడొచ్చిన పిల్ల.... పెద్దపిల్ల అయి పోవాలి గందా! అప్పుడూ....అంటే పెద్ద మడిసి అవటం అన్న మాట....అంటే - అంతే....మరేమో మీరేమో పూర్వంలాగా

పదేళ్ళ పిల్లకి 'సూత్రం' ముడేశారు గంటా! ఆ పిల్ల ఆ తర్వాత అయిందయ్యే! అప్పుడేంటో 'నచ్ఛత్రం' మంచిది కాదంట. అందుకనీ మీరు బాపనయ్య మంత్రాలు చెప్తా వుంటే ఆ పిల్ల పక్కన-కూకుని....ఏందో శాంతి...."

గోపీకి యిప్పటికి పూర్తిగా అర్థమై పోయి ముఖం సిగ్గుతో క్షణం కంది పోయింది. చి-ఛీ....అనుకుని వెంటనే పైకి అనేశాడు.

"సరే....సరే....నువ్వు క్రిందకి వెళ్ళి పో!"

రంగన్న అదేం విన్పించుకోకుండా ఇంకా యేదేదో చెప్పేస్తున్నాడు

"ముందు నిన్నిక్కడ నించి వెళ్ళ మని చెప్పానా!"

యజమాని గొంతులోని కరుకు ధనం గ్రహించిన రంగన్న 'బాబోయ్' అను కుంటూ క్రిందకు పరుగు తీశాడు.

గోపీ మంచం మీద వాలి తల క్రింద చేతులుంచుకొని ఆకాశంలోకి తదేకంగా చూస్తూ ఆలోచిస్తూన్నాడు చందమామ [illegible] తునకల మాటున దోబోచు లాడు [illegible]డు.

[illegible] కొన్ని [illegible] త్రభాషలోని పదా లకే అర్థము [illegible] నేను ఎంత విజ్ఞా [illegible] [illegible]మన్న 'మెస్ [illegible]' అయింది అంటే వెంటనే అర్థమైపోయి వుండేది.

ఓహో.... యేమిటీ చిన్న విషయానికింత న్యూసెన్సు. విసుగు వచ్చేసింది అతనికి. తన వివాహ జ్ఞాపకాలు గుర్తుకొస్తే చాలు చేదుతిన్నట్లయిపోతుంది మనస్సు. అందుకే ఆ జ్ఞాపకాలని వీలైనంతవరకూ మర్చి పోవటానికి ప్రయత్నిస్తాడు. కాని అది సాధ్యంకాదు. అప్పుడప్పుడు ఈ జ్ఞాప కాలు అతన్ని బాధ పెడుతూ వుంటాయి.

వివాహం ప్రతి వ్యక్తికీ ఓ మధుర స్మృతి. కాని నాకు....నాకు.... నిజంగా నేనెంత దురదృష్టవంతుడిని. అందం వుంది. ఆస్తివుంది. చదువుంది. స్వచ్ఛ మైన మనస్సుంది. లేనిదల్లా అదృష్టం. దురదృష్టవంతుడిని కాకుంటే అలా హటా త్తుగా నాన్నగారెవరో మిత్రుడికి మాట ఇచ్చేశారని దానికి నా జీవితం బలిచేసి ఓ పదేళ్ళ పిల్ల మెడలో మంగళ సూత్రం కట్టిస్తారా?

ఇలా ఆలోచిస్తున్న గోపీకృష్ణకి తన వివాహం ఆ తర్వాత జరిగిన సంఘట నలూ వరసగా గుర్తుకొస్తున్నాయి.

బి. యస్ సి ఫస్టు క్లాసులో పాసై న్నట్లు రిజల్సు రావటం తనతో సంప్ర దించకుండానే తండ్రి పెళ్ళికి లగ్నం పెట్టటం ఒకేసారి జరిగింది.

ఎక్కడో అరణ్యంలో రైల్వేలో పుద్యోగం చేస్తూన్న ప్రసాదరావూ తన తండ్రీ ప్రాణ స్నేహితులట ఇద్దరూ వియ్యమందాలని దేవుడి ముందట ప్రమా




ణం చేసుకున్నారట. అది ఈ నాడు యదార్థం కావాలి అంటారు కామేశ్వర్రావు గారు.

"నేను పెళ్ళికాగానే కొడుకుని కన్నాను. కానీ ప్రసాదరావు కరికాస్త ఆలస్యంగా ఆడపిల్లని కన్నాడు, ఏం చేస్తాం అందుకే యిద్దరికీ పన్నెండేళ్ళ వ్యత్యాసం వుంది. ఇదంతా భగవంతుడి అభీష్టమే తప్ప నాదేం లేదు. ఈ పెళ్ళి జరిగి తీరాలి" అంటాడు కామేశ్వరరావు. కాంతమ్మ యిటు భర్తకి గానీ, అటు కొడుక్కి గానీ చెప్పలేక సతమతమై పోతోంది

"నేనీ పెళ్ళి చస్తే చేసుకోను. చేసుకోనంతే చేసుకోను..." మొండిపట్టు పట్టాడు గోపీ. కాంతమ్మ అమ్మవారిని కన్నీళ్ళతో ప్రార్థించింది.

"ఈ వ్యవహారం ఎలాగోలా పరిష్కరించరా తమ్ముడూ!" అని.

బావగారి మొండిపట్టుదల చూస్తే ఈ పెళ్ళి జరక్కపోతే ఖచ్చితంగా చస్తా

దట ఆయన. ఆయన అన్నంత పని చెయ్యగల సమర్థుడు. ఇంక యెటొచ్చీ గోపీనే బుజ్జగించి ఈ పెళ్ళి జరిగేలా చెయ్యాలి" అని ఎంతకీ గది తలుపులు తీయకున్నా గోపీని బ్రతిమిలాడి తలుపులు తెరిపించి తనూ గదిలోకి వచ్చి ఘడియ బిగించేసి మేనల్లుడిని మెల్లగా వొప్పించటానికి ప్రయత్నించసాగాడు.

"పిల్లకి కాస్త వయస్సు తక్కువేగాని లక్షణంగా వుంటుంది. నాయనా నీతండ్రి మాటని గౌరవించు నేపెద్ద వాడిని. మీ అమ్మకి కూడా దుఃఖం కల్గించకు. ఈ పెళ్ళి నీకేం బాధకల్గించదురా విను నాయనా మీ నాన్న పరమ మూర్ఖుడు. ఈ పెళ్ళి జరక్కపోతే ఆయన అన్నంత పనీ చేసి తీరతాడు. అప్పుడు మీ అమ్మ బ్రతుక్క గలదా [illegible] సమయం మించిపోయిం తర్వాత ఏమంత బాధపడీ ప్రయోజనం లేదు గోపీ నా మాట వింటావుగా." ఇలా యెన్నో చెప్పి గోపీ నోరు నొక్కేసి లగ్నం ఖాయం చేసేశాడు.

జ్యోతి తండ్రి ప్రసాదరావు పనిచేసే స్టేషను అరణ్యం మధ్యన. అందుకే గోపీ కృష్ణ ఇంటి దగ్గరే పెళ్ళి చేసే యేర్పాట్లు ఘనంగా జరిగాయి.

కోపం మింగేస్తూ "నీ స్నేహితులకి శుభ లేఖలు పంపుకో." అని యిచ్చినవి విస్పిరికొట్టాడు. ఎవ్వరికీ తెలియ జెయ్య లేదు గోపీ.

పెళ్ళి జరుగుతోంది. మంగళ సూత్రం కట్టేప్పుడు ఓ క్షణం చూశాడు జ్యోతిని. సరిగ్గా ఆ సమయానికే పదేళ్ళ జ్యోతి తన పెద్దపెద్ద కళ్ళని యెత్తి పెళ్ళి కొడుకు వైపు చూసింది.

ఏదో మహా అపరాధం జరిగి పోతూ నట్లు ఓ పెద్ద ముత్తైదువ జ్యోతి నెత్తిన ఒక్కటిచ్చుకుంది. అంతే మళ్ళీ జ్యోతి తలయెత్తలేదు.

జ్యోతి మెడలో మంగళ సూత్రం మూడు ముళ్ళూ బిగించేసి కూర్చు న్నాడు గోపీ. ఒ[illegible] బొట్టూ [illegible] విడిచాడు. బంధుజనం వధూవరుల మీద అక్షింతల వర్షం కురిపించేస్తున్నారు.

## మేనేజర్

* అర్థము

(తన్ను [illegible] మేనేజ్ చేసుకుంటూ తను చెప్పే విషయాన్ని నిజంగా నిరూపించేందుకు మేనేజ్ (ప్రొప్రయిటర్ వినని స్థితిలో) చేస్తూ "ఎస్ సార్....నో సర్....ఐయామ్ కరెక్ట్ సర్....అది కాదంటారా సర్....మీదే రైట్ సర్...." వంటి పదాలను కంఠస్థం పెట్టిన గౌరవ కూలీ (ప్రొప్రయిటర్ అడుగుజాడల్లో అతిజాగ్రత్తగా అడుగులు ఎత్తివేసే అనుచరుడు)

గోపీ చుట్టూ చూశాడోసారి. కాస్త దూరంలో ప్రసాదరావూ, కామేశ్వరరావూ గాఢాలింగనంలో తన్మయులై పోతున్నారు. వారి చిన్ననాటి కోరిక ఈనాడు యదార్థమైందనే సంతోషం పట్టలేకపోతూ ఒకరిమీద ఒకరు పన్నీటి వర్షం కురిపించుకుంటున్నారు. కామేశ్వరరావు జరీ అంచు వుత్తరీయం మడతలు సరి చేసుకుంటూ దగ్గరకొచ్చి కొడుకు, కోడలి మీద అక్షింతలు చల్లారు.

కామేశ్వరరావు తన వాగ్దానాన్ని సమయము వచ్చేవరకూ కనీసం శాంతమ్మకి కూడా తెలియనీయక మనస్సులోనే దాచుకున్నా కొడుకు పెరిగి పెద్దవాడౌతున్నాడనే సంతోషం వున్నా ఓ వైపు దిగులు పడేవాడు. తన మాటని మన్నిస్తాడో లేదో అని....

ఈ వివాహ విషయం ఎత్తగానే మొదట నిరాకరించి హంగామా చేసినా, తర్వాత తండ్రి వాగ్దానం కోసం తల వంచిన కొడుకు సంస్కారానికి గర్వంగా వెన్ను విరుచుకుంటూ తృప్తిగా గర్వంగా నవ్వారు.

గోపీ మనస్సు 'ఛగ్'మంది.

"తలంబ్రాలు పొయ్యి బాబూ! దోసిలి పట్టు. ఇవి ఆ పిల్ల నెత్తిన పొయ్యాలి." బ్రాహ్మడు వివరంగా చెప్తున్నాడు.

"నాన్సెన్స్.... ఈ అలవాట్లన్నీ తీసి అవతల పారెయ్యండి. నేను పొయ్యను." విసుక్కుంటూ నీలుక్కు కూర్చున్నాడు. పెద్దలు ఎందరు చెప్పినా వినిపించుకోలేదు.

"పోనీ నువ్వైనా పొయ్యవే జ్యోతీ!" అని ఎవరో ముత్తయిదువ అనడం తడవుగా జ్యోతి గబగబా పసి దోసిళ్ళు ఎత్తి పోసేసింది. గోపీకృష్ణ నెత్తిమీద నుంచి తలంబ్రాల వర్షంలా క్రిందకి జారుతూంటే తీక్షణంగా చూశాడు. చుట్టూ వున్నవాళ్ళు జ్యోతిని ఎంకరేజ్ చేస్తున్నారు. జ్యోతి తలంబ్రాలు పోస్తూనే వుంది.

గోపీ ముఖంలో కత్తివాటుకి నెత్తురు

ప్రొప్రయిటర్

- కాదు

(అవునంటే కాదనిలే.... కాదంటే అవుననిలే.... మేనేజరు మాటలకు అర్థాలె వేరులే.... మందహాసంతో కొత్త్యాలను పదాల డ్యూయెట్ (సారీ సోలో) పల్లించే 'రైట్' కల వారు (అప్పుడప్పుడు మేనేజర్ని ఈయన దేమేజర్ అని ముద్దుగా పిలుచుకోవటం కద్దు)

చుక్క లేదు అనలే గుండెలో మండే అగ్నికి ఆజ్యం పోసినట్లైంది. కోపాన్ని దిగమింగేసుకుంటూ పెదవులు బిగించి మధుపర్కం కొంగుతో ముఖాన్ని గట్టిగా తుడుచుకుంటూ అనుకున్నాడు.

ఈ పెళ్ళి నిజంగా నాకే జరుగుతోందా? ఇది కల కాదా?? ఇది కలే అయితే ఎంత బాగుండు కాదు-ఇది నిజం! పచ్చి నిజం!! బొమ్మలాంటి పిల్ల ఈ క్షణం నించీ నా ధర్మపత్ని. భగవాన్.....!

జరుగుతూన్నది యదార్థమే అయినా గోపీ మనస్సు 'నిజమే' అని అంగీకరించలేక సతమతమై పోతోంది. పెళ్ళి అంటే నూరేళ్ళ పంట. ప్రతి మనిషికీ ఈ పెళ్ళిని గురించి ఎన్నెన్నో కలలు వుంటాయి. అలాగే గోపీకృష్ణకీ వున్నాయి. ఎందరు పెళ్ళికూతుళ్ళని చూడాలో ఎవరెవరు ఎలా వుంటారో!! ఏ పిల్ల నచ్చుతుందో!! అనుకుని వూహించుకుంటూ ఎన్నెన్నో కలలు కనే తనని ఒక్కసారి విసిరి పాతాళంలోకి గిరాటు కొట్టినట్లు పదేళ్ళ పిల్లతో వివాహం జరుగుతోంది. పన్నెండేళ్ళ వ్యత్యాసం యిద్దరికీ! ఇలా ఆలోచనల్లో తేలి పోతూనే వున్నాడు— గోపీకృష్ణ.

"లేవండి! పెద్దలకి నమస్కరించాలి." పురోహితుడు అక్షింతలు తీసుకుని పెద్దలకి యిస్తూ ఆశీర్వచనం చెప్తూన్నాడు. జ్యోతి తల్లికీ, తండ్రికీ నమస్కరిస్తూన్న గోపీకృష్ణని ప్రసాదరావు ఆత్మీయంగా గట్టిగా కౌగలించుకున్నాడు. ఆ కౌగిలిలో ఏదో తెలియని మాధుర్యం వున్నా విడిలించుకుని ముందుకు నడిచాడు. జ్యోతి పమిట కొంగుకి తన వుత్తరీయం ముడి పడి వున్నది. జ్యోతి అది లాక్కుంటూ లోపలికి వెళ్ళిపోతోంది. గోపీకృష్ణకి వళ్ళు మండి పై మీది వుత్తరీయం వదిలేశాడు. తన వెనక భర్త వుత్తరీయం క్రింద జీరాడుతూ వెంట వస్తూన్న సంగతి ఆ పిల్లకి తెలియనే లేదు. పిల్లలు నవ్వుతూంచే తెల్లబోయి చూస్తోంది.

"అయ్యో-అయ్యో....ఇదేమిటిరా. గోపీ! అలా వదిలేశావ్?" కూకలేస్తూన్నారెవరో. గోపి అదేం పట్టించుకోలేదు.

ఇంక భోజనాలు ప్రారంభమైనాయి. పెళ్ళికూతుర్ని పెళ్ళికొడుక్ని దగ్గర దగ్గరగా వడ్డించారు. వడ్డన పూర్తి కాకుండానే వెండి పళ్ళెంలో వడ్డించిన ఓ లడ్డుండ తీసుకు తినేస్తోంది జ్యోతి.

పంక్తిలో కూర్చున్న పెళ్ళికాని ఆడపిల్లలు కిసుక్కుమన్నారు.

అర్థంకాని గోపి ఇటూ అటూ చూసి తర్వాత జ్యోతివైపు చూశాడు.

జ్యోతి చేతిలోని సగం లడ్డూ అతన్ని పరిహసిస్తూ నవ్వినట్లైంది.

అవమానం, కోపం....దిగమింగేస్తూ తల తిప్పేశాడు. పెళ్ళికూతురి తరఫున ఆమె వచ్చి జ్యోతితో మెల్లగా అంది.

"తప్పమ్మా! ఎవ్వరూ తినకముందే నువ్వలా తినకూడదు"

"నాకాకలేస్తోంది...." సగం తిన్న లడ్డూని అలా పట్టుకునే అమాయకంగా అంది

"ఒక్క క్షణం వుండమ్మా!" బ్రతిమిలాడుకోంది ఆమె

"నాకివాళ చద్దన్నం కూడా పెట్టలా!" అంది ఏడుపు గొంతుతో

పాతికేళ్ళవ్వొచ్చీ యింకా పెళ్ళిళ్ళు కాని అమ్మాయిలు మళ్ళీ 'కిసుక్కు' మన్నారు.

అవమానంతో వుడికిపోతూ అక్కడ నుంచి లేచి పోవాలన్పిస్తోంది గోపీకి. అది మరీ అన్యాయం! చచ్చినట్లు భరించాల్సిందే! ఈ వెధవ న్యూసెన్సని. గ్లాసుడు నీళ్ళతో బాటు కోపాన్ని కూడా మింగేశాడు— సంస్కారవంతుడైన గోపీకృష్ణ.

ఆమె జ్యోతికి మరీమరీ చెప్పి లోపలికి వెళ్ళిపోయింది. జ్యోతి క్షణం చుట్టూ చూసి మళ్ళీ అందుకుంది ఓ లడ్డూని.... ఇంక భరించలేక జ్యోతి చేతిమీద ఒక్కటేశాడు గోపీ. జ్యోతి అదిరిపోయింది. కళ్ళ నిండా నీళ్ళు నిండుకున్నాయి.

"వాంతి వస్తోంది!" అంటూ అక్కడ నించి లేచి వెళ్ళిపోయింది.

"స్టోర్ రూంలో ఒక్కర్తీ కూర్చుని అన్నం తింటోంది పెళ్ళికూతురు...." అంటూ వార్త చేరేసింది గోపీ పినతల్లి కూతురు శాంతి.

* * *

సాయంత్రం మేజువాణీకి అంతా రెడీ చేశారు. గోపీకృష్ణ 'నాకిష్టం లేదిలాంటి వన్నీ' అని ఎంత చెప్పినా విన్పించుకోక తల్లి బలవంతపెట్టి తీసుకొచ్చి ఆడవాళ్ళ మధ్యన కూర్చోపెట్టింది.

మరో అర్ధగంట గడిచినా పెళ్ళికూతురు రాలేదు. రానంటోంది అంటూ గుసగుసలు పోతూన్నారు అమ్మలక్కలు.

"మంకు పిల్ల యెలా వేగుతాడో గోపీ" అంటున్నారెవరో.

గోపీ తల్లి శాంతమ్మా జ్యోతి తల్లి సుందరమ్మా జ్యోతిని బొమ్మలా అలంకరించి తీసుకొచ్చారు. వుబికి వచ్చే కోపాన్ని మింగేస్తూ ఒక్కసారి పెళ్ళికూతురు వైపు చూశాడు. జెడ నిండుగా మల్లెమొగ్గలు కుట్టి వంటి నిండా నగలు పెట్టి ఓ జరీ ముద్దలాంటి పట్టుచీరె కట్టి వున్న జ్యోతి విగ్రహంలాకాదు అచ్చంగా కన్యకా పరమేశ్వరీ అమ్మవారిలా వుంది. అలవాటులేని ఏమిట మాటిమాటికీ పైకి యెగదీసుకోలేక నతమతమై పోతూంది. అంత అవస్థలోనూ ముఖం మటమట లాడిస్తూ తననే చూస్తూన్న పెళ్ళికొడుకు వైపు భయంగా ఓ సారి చూసి కళ్ళు తిప్పేసుకుంది.

ఆ పెద్దకళ్ళల్లో అమాయకత్వం నిండుకున్న భయం కన్పిస్తోంది.

"తప్పు, అలా చూడకు అతని వైపు సిగ్గులేని పెళ్ళికూతురంటారు" అంటోంది ఒకావిడ జ్యోతి ప్రక్కన చేరి.

"నేనేం చూడటల్లా! ఆ అబ్బాయే చూస్తున్నాడు. నా వంక." కోపంతో ముఖం తిప్పేసుకుంది క్రిందికి. మరి తలెత్తితే ఒట్టు.

అక్కడ చేరిన వాళ్ళందరితో బాటు ఈ సారి గోపీకి నవ్వు రాబోయి గభాలున ఆగిపోయింది పాపం. ఇంత అందమైన పెళ్ళికూతురివనీ, కసిగా పెదవి కొరుక్కున్నాడు. చేతిలోని పూలబంతి జ్యోతి వైపుకి విసరకుండా అలాగే కూర్చున్నాడు.

"పెళ్ళికొడుకు ఎంత మొండి ఘటమో!" అన్నారందరూ. పోనీయండి తలో పాటా పాడేయండి అంది శాంతమ్మ. కొడుకుని మరేమీ అనే ధైర్యంలేక.

"ఒకరి తర్వాత ఒకరు పోటీ పడ్డట్లు పాడుతున్నారు. అర్ధగంట అయినా జ్యోతి ఇటూ అటూ కదలలేదు. అబ్బ ఇంత బిగ పట్టుకుని యెలా కూర్చో గలిగిందబ్బా" అని గోపీకి జాలి ముంచు కొచ్చింది.

ఒకామె పెళ్ళి కూతుర్ని పరిహాసిస్తూ పాటమొదలెట్టేసరికి అందరూ నవ్వులతో గగ్గోలు చేస్తున్నారు. అయినా జ్యోతి తలెత్తలేదు. గోపీ పరీక్షగా చూశాడు. జ్యోతి నిద్రలో తూగుతోంది. అంత క్రితంవున్న జాలిపోయి కోపం ఛర్‌న లేచింది. మళ్ళీ ఎంత అవమానం భరించాలో అని చివాలున లేచి బైటకి వెళ్ళిపోయాడు.

మరొకావిడ పెళ్ళికొడుకు మీద పాట మొదలెట్టింది.

"పెళ్ళి కూతురు నిద్రలో తూగుతోంది, పెళ్ళి కొడుక్కి కోపం వచ్చి లేచిపోయాడు, ఇంకనీపాట యెవరు వినా లమ్మా" అంటూ సాగదీసి అన్నది ఒకామె. పాపం పాడే ఆమె తెల్ల ముఖం వేసి పాట ఆపేసింది.

మరోసారి నవ్వులు తెరలు తెరలుగా

విన్పిస్తూంటే గోపీ గదిలోకి వచ్చి తలుపు ధాంమ్మని వేసేసుకున్నాడు.

ఈ పెళ్ళి చేసి క్షణంక్షణం నన్నెందు కిలా అవమానాలు పాలు చేస్తున్నావు భగవంతుడా! ఈ పరీక్షికి నేనే దొరికానా నే భరించలేను.... నేభరించలేను అవమానాన్ని మింగేశక్తి లేక తలపట్టుకు అలాగే కూలబడ్డాడు గోపీకృష్ణ.

యెవరెవరో వచ్చి తలుపు తియ్యమని పిలుస్తున్నారు ఐనా తియ్యలేదు. అందరి వంతూ అయి చివరికి మేనమావ వచ్చి తలుపు తెరిచే వరకు వదలలేదు. గోపీ ఇంక వదలేటట్లు లేదని ఘడియతీశాడు.

''ఎందుకురా అంత బాధ పడతావూ! పెళ్ళి కూతురు చిన్నదనేగా ఇదేమంత పెద్ద విషయమంరా గోపీ. ఆడపిల్ల తోటకూరకాడలా యెంత సేపట్లో యెదుగుతుంది. క్షణాల్లో ఎదిగిపోతుందేయ్ నీ యెమ్మెస్సీ పూర్తి చేసి క్లాసు తెచ్చుకొని లెక్చరర్ వుద్యోగం కుదిరేసరికి జ్యోతి యెలా యెంతగా యెదిగిపోతుందోచూడు. అప్పుడు నువ్వు గుర్తు కూడా పట్టలేవు. "ఎవరీ అందాలబొమ్మ'' అనాలి. నామాట గుర్తించుకో. అయినా నువ్వు పెళ్ళిచేసుకున్నావు. ఇప్పుడు ఆపిల్లని అసహ్యించుకుంటే యెలా? నువ్వు చేసేది తప్పురా. ఆ పిల్ల నీ ధర్మపత్ని. నీ అర్ధ శరీరం. ఆ పిల్ల గౌరవాగౌరవాలు నీవె ఈరోజు మంచీ, ఆమె అవమానం నీదె....ఒరే గోపీ ఈవిషయం నువ్వు బాగా గుర్తించుకోరా.''

గోపీ కళ్ళల్లో నీళ్లు సుళ్లు తిరిగాయి.

"మామయ్యా వివాహం అంటే నేనెన్ని కలలు కన్నానో మీకు తెలియదు. ప్రేమించాలనీ పెళ్ళాడాలనీ ఇంకా యెవేవో...." గోపి గొంతు పూడుకుపోయింది.

## అన్ విజిబుల్ థింగ్స్

● "బాబూ! గుడ్డాడ్ని....ధర్మం చెయ్యండి బాబూ!"

"నువ్వు నిజంగా గుడ్డాడివని ఎలా నమ్మడం?"

"ఆ మేడ ప్రక్కన చింతచెట్టు కనిపిస్తుంది. చూశారా?"

"అవును. చూశాను. ఎం?"

"ఆ చెట్టు నాకు కనబడ్డం లేదు."

—కోనే నాగవెంకట అంజనేయులు, ఏలూరు.

ఇప్పుడు మాత్రం పోయిందేంవుంది. పెళ్ళాన్నే ప్రేమించేసెయ్యి. ఆ పిల్ల కాపరానికి రావటానికి బోలెడంత టైముంది. ఈ లోపల పీకలలన్నీ ఈపిల్లనే హీరోయిన్‌గా వూహించుకుని వ్యవహారం—

"వామయ్యో" చివ్వున లేచాడు.

"ఓరీ పిచ్చిసన్నాసీ నేచెప్పేది కాస్త వింటావా! ఇష్టా వింటావా అంటా."

గోపీ జవాబేం చెప్పకుండా కిటికీ దగ్గరికి వెళ్ళినిల్చున్నాడు. అందటికీ ఈరోజెంత ఆనందమైన రోజు. కానీ నాకు....నాకు. బాధతో మూలిగింది అతని హృదయం.

"గోపీ" మేనమామ దగ్గరగా వచ్చి భుజం మీద చెయ్యివేశాడు.

"గోపీ ఈ రోజుల్లో వయస్సు ముదిరిన పెళ్ళి కూతుళ్ళు కన్పిస్తున్నారు కానీ మా చిన్నప్పుడు పెళ్ళిళ్ళంటే అచ్చంగా నీ పెళ్ళిలాగ వుండేవిరా. వధూవరులకి పదినుంచి ఇరవై సంవత్సరాలవరకు వ్యత్యాసం వుండేది. అలాంటి పెళ్ళి చేసుకున్న మేమందరం సంసారాలు చెయ్యలేదూ. పిల్లలని కనలేదూ. పోనీ నీమాటకే వస్తా! ప్రేమకి అర్థం మాకు తెలియదా. మేం భార్యాభర్తలం ప్రేమించుకోలేదా. అసలు నన్నడిగితే 'ప్రేమ' అనే పదానికి అర్థం మా తరానికి తెల్సినట్లు మీ ఇప్పటి తరానికి తెలియదురా. తెలియదంటే తెలియదు. ఇప్పటి ప్రేమలు టెరిలిన్, నైలాన్ సూట్లు చూసీ క్రాపులు చూసీ ఆడపిల్లలు ప్రేమించేశాంఅంటారు. ఇంక మగపిల్లలు బెల్‌బాటండ్రెస్స్‌ని చూసీ పమిటలి అవుసరంలేని లుంగీలని చూసీ; అదీ కాకుండా మగా ఆడో తెలియకుండా హిప్పీలా జుట్టు విరబోసుకోటం చూసీ ప్రేమించేస్తున్నారు. 'దమ్మరొదం' అని పాడగలిగిన పిల్లలు కావాలి ఈ తరం కుర్రాళ్ళకి. రెండురోజులు ఇలాంటి యద్దరిని ఓ యింట్లో పారేస్తే మాకు ప్రేమ వద్దు. పెళ్ళి వద్దు అంటూ పత్తా లేకుండా పారిపోతారు. వీళ్ళకి అన్నం తినటం బోర్ బట్టలు యెప్పుడూ ఒకేరకం ఫాషన్‌నివేసుకోవటం బోర్. తల్లీతండ్రీ బోర్. అన్నా చెల్లెలూ బోర్ చివరికి యెప్పుడూ మార్చటానికి వీల్లేని మొగుడు బోర్ . అసలు ఈ నాటి యువతీయువకుల మనస్తత్వాలు బోర్‌తో నిండిపోయాయి. ఎప్పుడూ వీళ్ళకి కొత్త కొత్త కొత్తదనం కావాలి. ఆ కొత్త దనం బాగున్నా లేకపోయినా వాళ్ళకక్కరలేదు.".

మేనమామ యిలా మాట్లాడుతూంటే తన పరిస్థితి మర్చి అలా వింటూ విలబడిపోయాడు గోపీకృష్ణ. ఆయన మళ్ళీ మొదలు పెట్టాడు.

"మా తరంలో పెళ్ళి ముందు ప్రేమ తర్వాత. ఆ వివరాల జోలికి పోనులే! ఈసారెప్పుడన్నా తీరుబడిగా చెప్తాలే గానీ అసలు విషయం దగ్గరకి వస్తా. ఒరే గోపీ! ఓ రహస్యం చెప్పనా?




"ఆడపిల్లకి ఆలశ్యం పెళ్ళికంటే ఈ లాంటి బాల్య వివాహాలే నయంరా! ఎందుకంటే తన కాబోయే భర్త ఏ రాజకుమారుడో అవుతాడని కలలు కనటం వుండదు. యదార్థంగా ఆలోచిస్తూ భర్త మనస్సునీ అలవాట్లనీ అర్థం చేసుకుని భర్త చుట్టూనే ఆశలు అల్లుకుంటుంది. గనుక జీవితంలో పెద్దగా 'దగా' పడటం జరగదు. అందువల్ల మనస్పర్థలూ ఉండవు. పైగా ఈ లాంటి ఆడపిల్లలు భర్తని ఎంతగా ఆరాధిస్తారో నీవే అనుభవం మీద తెల్సుకుందువు గాని! ఇంక భార్యా భర్తలయితే 'లవ్' కి అవకాశం వుండదనుకుంటావేమో! అది తప్పు.... చిన్నప్పుడే పెళ్ళి అయితే సంవత్సరం లోపల అత్తారింటికి వెళ్ళాలా? పండగలకి, పబ్బాలకి వెళ్ళటం అవసరం పడుతుందా? అప్పుడు బావమరుదులు, వదినగార్లు, మరదళ్ళు కన్పించీ కన్పించకుండా భార్యామణీ తళుక్కుమటూ యిలా మెరిసి అలా మాయమై మనస్సులు మెరిపిస్తుంది.... అప్పుడు ఆనందంతో గుండె ఆనంద నృత్యం చేస్తుంది. చెప్పవోయీ అల్లుడా! ఇదంతా 'లవ్' కాదా? దీంట్లో ఎంత మాధుర్యముందో అర్థం అవుతోంది అంట నీకు? ఇప్పుడు చెప్పు."

గోపీ మౌనంగా విన్నాడే కానీ జవాబు చెప్పలేదు.

"మూడు నిద్రలకి వాళ్ళ వూరు వెళ్ళ నంటూన్నావట. ఇది నీకు భావ్యం కాదురా! అంతగా యిష్టం లేకుంటే వాళ్ళతో వెళ్ళి ఒక్క రోజే వుండి వచ్చేసెయ్యి. అసలు పెళ్ళే వాళ్ళ వూళ్లో చేయవల్సిన రివాజు. సౌకర్యం తక్కువ అని యిక్కడ కానిచ్చా రనుకో! వాళ్ళకీ ఒక్కర్తే ఆడపిల్ల గదా! అచ్చటా ముచ్చటా వుండదూ?"

గోపీ ఎడంచేతి వేళ్ళని పరీక్షిస్తూ వింటూన్నాడు. ఉదయం మామగారు లగ్నం సమయంలో పెట్టిన ఆకుపచ్చ రాయి వుంగరం తన వ్రేలిని అంటి పెట్టుకుని వుంది. ఆ వుంగరాన్ని ఇటూ అటూ తిప్పుతూ పరీక్షిస్తూన్నాడు. ఆ రాయిలో తల వంచుకున్న పెళ్ళికూతురు జ్యోతి కన్పించింది.

ఏమిటిది....! మరోసారి చూశాడు. అక్కడ జ్యోతి ఎలా వుంటుంది? అంతా తన భ్రమ! ఇంత చిన్నపిల్ల అయినా నాకీ కలవర పాటేమిటి? తనని తను సంబాళించుకుని మేనమామకి గట్టిగా చెప్పే శాడు.

"నాకు వీల్లేదు. కాలేజీలు తెరిచేశారు. వెళ్ళిపోవాలి అంతే! మీరేం చెప్పదు. నేను వినను.... వినను.... వినను ..." అంతే! వెళ్ళిపోయాడు గోపీకృష్ణ తన చదువు కోసం.

యం. యస్. సి. లో జాయినై పోయాడు. పెళ్ళి జ్ఞాపకాలని మర్చిపోవ టానికి ప్రయత్నం చేస్తూ చదువులో మన స్సుని 'లగ్నం' చేస్తూన్నాడు. కానీ మధ్య మధ్య బట్టల పెట్టె అడుగున తన పెళ్ళి నాటి ఫొటో తీసి అప్పుడప్పుడూ చూడ కుండా వుండలేదు. ఆ ఫొటోలో కూడా జ్యోతి తల వంచేసుకునే వుంది. ఫొటో గ్రాఫర్ ఎన్నిసార్లు తల ఎత్తమని హెచ్చ రించినా సమయానికి సరీగా తల వంచే సింది. ముఖం కాస్త కూడా కన్పించటం లేదు. సన్నగా వున్న చేతులూ, వాటికి వదులుగా వున్న గాజులూ, చీరె కుచ్చెళ్ళ క్రింద పల్చటి పాదాలకి అంటి పెట్టుకున్న గజ్జెలపాంజేబులూ యివే కన్పిస్తాయి

ఈ ఫొటో ఎవరన్నా చూస్తారనే భయంతో పెట్టె అడుగున దాచేశాడు. అసలు గోపీకి పెళ్ళి అయిపోయిందనే సంగతి స్నేహితులెవ్వరికీ తెలియనే తెలియదు. ఆ ఫొటో కోపం వచ్చి మధ్యకి చించెయ్యాలని ఎన్నో సార్లు ప్రయత్నించీ చించలేక మళ్ళీ దాచేసుకున్నాడు గోపీ. ఇలా దాదాపు సంవత్సరం పూర్తి కావస్తోంది.

* * *

సంవత్సరం లోపల తప్పక రావాలని మామగారి దగ్గర నుంచి ప్రాధేయపూర్వకమైన ఉత్తరం వచ్చింది. ఇంక తండ్రి కూడా మరో ఉత్తరం రాశాడు.

"వాళ్ళ మనస్సులని నువ్వు చాలా గాయపరుస్తూన్నావు. ఈసారైనా అత్తగారింటికి తప్పకుండా వెళ్ళి రెండు రోజులైనా వుండిరా! ఇలా వెళ్ళటం మన ఆచారం. నా మాట మన్నిస్తావనే ఆశిస్తున్నాను. నువ్వు ఒంటరిగా వెళ్ళటానికిష్టం లేకపోతే పిన్నికూతురు సునందని తీసుకు వెళుదువు గాని యింటికి రా!" యిది తండ్రి ఆజ్ఞ.

కట్టుకున్న తర్వాత తప్పేదేం వుంది? అని విసుగ్గానే బయలుదేరి మామగారికి వస్తూన్నట్లు టెలిగ్రాం యిచ్చాడు.

మామగారు చాటంత ముఖంతో స్టేషను లోనే స్వాగతం చెప్పాడు అత్తవారింటికి వస్తూన్నాననే ఆనందం కంటే రైలు ప్రయాణంలోని ప్రకృతి శోభ గోపీని ముగ్ధుడిని చేస్తోంది. దట్టమైన అరణ్యం! ఏవో తెలియని రకరకాల చెట్లూ-తీగలూ, పువ్వులూ, వాటి వాసనలూ, అదో వింత అనుభూతి కల్గిస్తోంది. స్టేషను నుంచి రెండెడ్ల బండిలో ప్రయాణం. ఇల్లు ఓ మైలు దూరం కూడా లేకపోయినా కొత్త అల్లుడిని నడిపించి ఎలా తీసుకు వెళతాడు ప్రసాదరావు... బండిలో కూర్చునే బాట కిరువైపులా వున్న చెట్లని కుతూహలంగా చూస్తూన్నాడు....ఆ చెట్ల గుబురులలో అక్కడక్కడా ఓ నాలుగు గుడిసెలు కన్పిస్తూన్నాయి. వాటికి కాస్త దూరంగా ఓ చిన్న పల్లెటూరూ, ఓ నాలుగు రైల్వే క్వార్టర్సూ, కొన్ని కూలికి వెళ్ళే పేద ప్రజలు చుట్టూ గుడిసెలూ వున్నాయి.... పట్నవాసానికి దూరంగా ప్రకృతి తల్లి వడిలో వున్నట్లు ఎంత బాగుందిక్కడ, అనిపిస్తోంది గోపీకి. (సశేషం)

డబ్బింగ్ ————————————

● అంతే....అంతే....అంతే....

# సానెట్

సౌందర్యరాశివి సౌమ్యవారాశివి
అందాల నిను చైత్రదివముతో పోల్చనా?
కాసంత ఆయువు క్షణజీవి వేసవి
మధుమాస మృదుకళికఁ రొదగాలిరాల్చునే!
తీక్ష్ణముగ గగనాక్షి మిడిసిపడునపుడపుడు
పసిడిఛాయలు తరచు మగ్గిపోవును వాడి
సొగసులో సొబగులూ వాలి దిగజారిపడు
విధి వశాన, నిరంకుశ చంచల కాలగతివడి
వాసంత లాస్యాల చిరంజీవివి నీవు
లావణ్య నిధి నీదు చేజారిపోదు
కల్పాంతకవనాల కాలపోషితవీవు
అల్పాయుఛాయవనిమిత్తియికవదరదు
కనులవెలుగుండి నరులు శ్వాసించుదాక
మనునిది, మనెదవీవు - యిది నీకు ఉసురుగనుక

యం. రామకోటి
(మూలం: షేక్స్పియర్)



# రామచిలక

వల్లూరి విజయకుమార్

రోడ్డు ప్రక్కన చెట్టు నీడలో అతను కూర్చున్నాడు. ముందు చిన్న గుడ్డ పరచివుంది. దాని ప్రక్కనే వెదురుతో అల్లిన పంజరం. గుడ్డ మీద యేవో అట్టముక్కలు పేర్చివున్నాయి.

పంజరంలో చిలక గాభరాగా అటూ యిటూ తిరుగుతున్నాది. సగం కత్తిరించిన రెక్కలు టపటపా కొట్టుకుంటూ యెక్కడికో యెగిరిపోవాలని ప్రయిత్నిస్తున్నది. ఎక్కడికి యెగరలేనని తెలిసినా, చిలక తన ప్రయత్నం మానటంలేదు.

ఎండ మండి పోతున్నా చెట్టు క్రింద చల్లగావుంది. పంజరం ముందుకూర్చున్న వ్యక్తి దృష్టి చిలకమీద లేనేలేదు, ఎటో చూస్తూ, సగం పండిన మీసాలు వేలితో రాసుకుంటున్నాడు అప్పుడప్పుడు. 'చిలక చేత జోస్యం చెప్పించుకుందుకు యెవరయినా రాకపోతారా' అని ఆలోచిస్తున్నాడు.

ఎవరికీ అర్థంకాని బ్రహ్మరాతని చిలక చెప్పేస్తుంది. అదీ కేవలం పదిపైసలకే! చెప్పించుకునే వాడికి దక్కేది తృప్తీ! చెప్పినందుకు దానికో బియ్యపు గింజా!

పక్కనేవరో కదిలినట్టయి. వులిక్కి పడ్డాడతను. పక్కకి తిరిగి చూశాడు.

భుజానికి వ్రేలాడే పుస్తకాల సంచీని నేలమీద పెడుతూ పక్కనే కూర్చున్నాడు బాబు.

"బడికి వేళకాలేదా?" ముడతలుపడిన నుదిటిని చేత్తోరాసుకుంటూ అడిగాడతను.

"ఊహూఁ" యింకా బోల్డుటైవుంది. ఇవాళ చిలక్కి సెనగలు తెచ్చాను తాతయ్యా." జేబులో దాచివున్న సెనగలు బయటికి తీస్తున్నాడు బాబు.

"ఇదుగో చిలకా, యిందా" బాబు ఓ గింజను సున్నితంగా పట్టుకొని వేళ్ళని పంజరంలో పెట్టాడు.

చిలక బాబువైపూ, వేళ్ళ మధ్య వున్న గింజ వైపూ చూసింది. ఒకసారి పైకీ కిందకీ తలాడించి వొయ్యారంగా నడుస్తూ దూరంగా వెళ్ళిపోయింది.

"అది నువ్వు పెడితే తినదు బాబూ, యిలాతే. నేపెడతా"

బాబు తాత చేతిలో నాల్గయిదు గింజ లుంచాడు 'నేను పెడితే యెందుకు తినదో' అనుకున్నాడు మనసులో.

తాత గింజమీద తోలువొలుస్తున్నాడు. బాబు కళ్ళార్పకుండా చిలకనే చూస్తున్నాడు.

"అబ్బ, దాని ముక్కు ఎర్రగా ఎంత బావుందో! రామంవాళ్ళ చిలకకన్నా యిదే యెంతో బావుంటుంది. రామం వాళ్ళ చిలక్కి అసలేంరాదు. అదొట్టి మొద్దు చిలక. కానీ, యీ చిలక యెన్ని గమ్మత్తులు చేస్తుందో!"

తాతయ్య వేలుపట్టుకొని తమాషాగా పట్టీలు కొడుతుంది. ఎలాంటి వాళ్ళకయినా గమ్మత్తుగా యిట్టే జోస్యం చెప్పేస్తుంది ఎప్పుడయిన తాతయ్య "రాముడు" అని పిలిస్తే 'ఓ' అంటుంది కూడా!

బాబు ద్యాసంతా పంజరంలోని చిలక మీదే. కానీ దాని ద్యాసంతా పంజరం లోంచి కనపడే ఆకాశంవైపే! చిలక్కి కావల్సింది సెనగగింజలూ బియ్యపు గింజలేకాదు, స్వేచ్ఛకావాలి!

బాబు చూస్తుండగానే అక్కడికో కళ్ళజోడబ్బాయి వచ్చాడు. పంజరం ఎదురుగా మోకాళ్ళమీద కూర్చుని తాతకి పది పైసలిచ్చాడు.

జరగబోయేది తల్చుకుంటే బాబుకి చాలా ఆనందంగావుంది, తాతయ్య పంజరం తలుపు తీస్తాడు చిలక ఠీవిగా అతని వేలిమీద కూర్చుంటుంది. అతను దాన్ని ముద్దుపెట్టుకున్నాక పట్టీకొట్టి, "ఓ" అని అరుస్తూ గుడ్డమీద పేర్చిన అట్టముక్కల దగ్గరకు వెళ్తుంది....ఆ తర్వాత....

ఆలోచించినంతసేపూ పట్టలేదు. తాత పంజరం తలుపు తీశాడు. చిలక వేలెక్కి తమాషాగా కళ్లు కదిలించింది. తాతయ్య ముద్దెట్టుకోగానే పల్టీకొట్టి కిందకి దిగిపోయింది.

"రాముడూ" తాత ముడతలు పడ్డ చేతిని ముందుకి చూచాడు. అరచేతిలో తొక్కతీసిన సెనగగింజవుంది. గబగబా దగ్గరికొచ్చి ఆ గింజను తినేసి అట్ట ముక్కల దగ్గరికి వెళ్ళిపోయింది చిలక.

"నేను తెచ్చిన గింజ తిన్నాది. ఎవరు

అతనలా మాట్లాడ తూనే వున్నాడు.

చిలక అట్టముక్కల చుట్టూ హుందాగా నడుస్తున్నాది

అప్పుడప్పుడు ఆగి ఒకోక్క ముక్క నీ ముక్కుతో తీసి దూరంగా పడేస్తున్నాది. బాబు కళ్ళింతలు చేసుకుని చిలకనే చూస్తున్నాడు

తాత ఓ క్షణం మాటలు ఆపేసాడు. చిలక అట్టముక్క పుచ్చుకుని తాత దగ్గరికొచ్చింది.

---

శనగగింజ నోటికందినంతమాత్రాన నీతితప్పదు రామచిలక!

పది పైసలకయినా, పది రూపాయిలకయినా ఫలితాన్ని పదిలంగా చెప్పే తీరుతుంది.

---

పెడితే యేం" బాబుకి చాలా ఆనందంగా వుంది

"రాముడూ" తాత మళ్ళీ పిల్చాడు.

చిలక 'ఓ' అంది.

దొరబాబు గురించి చెప్పు....వినాయకుడిని తల్చుకో....ఏడు కొండల వాడిని తల్చుకో! దొరబాబు కేమవుద్దో చెప్పు.... మంచి జరుగుద్దా....సీమకెళ్తారా....పెద్దవుతారా....పోలేరమ్మ ఆనగా నిజం చెప్పు....

'భలే. ఎదురింటి జోస్యులవారు కూడా యింత బాగా చెప్పలేరు." బాబు మనసు ఎగిరెగిరి పడుతున్నది.

చిలక బాబువైపు చూడను కూడా లేదు. ఏదో పెద్ద పనున్నట్టు పంజరంలోకి వెళ్ళిపోయింది.

తాత అట్టమీద రాసున్నది చదివాడు. 'వినాయకుడి సాక్షిగా చెప్పేది సత్యం. సరస్వతి దయ నీ మీదనే వుంది అనుకున్న అమ్మాయినే పెళ్ళాడతావు. జీవి

తంలో ఎమరు దెబ్బలు ఎక్కువగా లేవు. గ్రహబలం బావుంటుంది. రోగాలుండవు. గొప్ప భవిష్యత్తు వుంది.'

కళ్ళజోడబ్బాయి అంతా అర్థం అయి పోయినట్టు తలాడిస్తూ వెళ్ళిపోయాడు. పని పైసల బిళ్ళని పంజరం మట్టూ తిప్పి కొంటిని దోపుకున్నాడు తాత.

"బ్రహ్మదేవుడు ఎవరికీ తెలీకుండా నుదుటు మీద రాస్తాడట కదా" బాబు అనుమానం తీర్చుకుంటున్నాడు. అవు నన్నట్టు తాత తలూపాడు.

"మరి, నీ చిలక [illegible] తా ఎలా చెప్పేస్తున్నాది?"

"అదంతే. దానికి అన్నీ తెలుసు."

'అంటే యిది సి ఐ డి. చిలకన్న మాట. ఎలాగయినా దీన్ని కొనెయ్యాలి. మరయితే, నేను బాగా చదువుకుంటానో లేదో అడిగెయ్యనా? ఊహూం. వద్దులే' అనుకున్నాడు బాబు.

'ఏం తాతా, దీన్ని నాకు అమ్ముతావా?' బాబు అనుమానం తీరక ప్రశ్నించాడు.

ముసలితాత మీసాల్లోంచి చిరునవ్వు తళుక్కుమంది. 'అలాగేలే' అన్నాడు.

బాబు మరేదో అడిగేలోగా బడిగంటలు వినిపించాయి. సంచి భుజానికి తగిలించుకుని పంజరం ముందుకు వంగి, 'సాయంత్రము మళ్ళీ వస్తాన్లే రాముడూ' అని అరిచి పరుగు తీశాడు బాబు.

అతని అరుపు రాముడికి అర్థం కాలేదు. భయపడి పోయింది రామచిలక.

* * *

మొదటిసారి బాబుకి చెట్టు కింది తాతయ్యతో పరిచయం కలగటానికి కారణం ఆ రామచిలకే.

రాముం వాళ్ళ యింట్లోని రామచిలకని చూసినప్పటినుండీ బాబు తనూ ఓ చిలకని పెంచాలని సరదా పడసాగాడు. కానీ చిలకని పెంచటం అంటే మాటలా? దానికో పంజరం కావాలి. దానికి తినడానికిన్నో పెట్టాలి.... యింకా, చాలా మాటలు నేర్పాలి. అబ్బో! అదేమంత సులువు కాదే!

బాబుకి తాత దగ్గరున్న చిలకలో తను వూహించిన అన్ని లక్షణాలూ కనబడ్డాయి. మెల్లిగా ఒక రోజు అడిగాడు 'తాతా, చిలక అమ్ముతావా?'

తాత ఏ కళ నున్నాడో కానీ, వెంటనే సరే అన్నాడు.

ఆ సరే మాట వినగానే బాబుకి చిలక తనదై పోయినట్టనిపించింది.

అమ్మ దగ్గర కొంత మారాం చేస్తే సరి. తనే ఒక రూపాయిస్తుంది. అప్పుడింక దర్జాగా తను చిలకని పెంచుకుంటాడు. చిలకని బేరం చేసి కొనేవాడిలా "ఎంతకమ్ముతావ్?" అన్నాడు.

తాత పది రూపాయలనేసరికి బాబు




వుత్సాహం నీరుగారి పోయింది తాత చాలా దీర్ఘంగా ఆలోచిస్తున్నట్టనిపించింది బాబుకి.

"ఏం తాతా, అలా వున్నావ్?" బాబు వుండబట్టలేక అడిగాడు.

"నా మనవరాలికి వారం రోజులుగా జ్వరం. రోజు రోజుకీ ఎక్కువవుతున్నాదే కానీ తగ్గటం లేదు." తాత చెబుతూంటే బాబుకి 'పాపం' అనిపించింది

"డాక్టరు దగ్గరకి తీసుకెళ్ళకూడదూ, మందిస్తాడుగా!" అన్నాడు.

"డబ్బియ్యందే ఎవరు చూస్తారు బాబూ!" తాత గొంతులో నిరాశ స్పష్టంగా తెలుస్తున్నాది.

"పిల్లదానికి జ్వరం తగ్గుతుందా లేదా అనే బెంగగా వుంది. దానికీ నీ వయస్సే!" బాబుకి తాత మాటలు వినాలని లేదు. వింటూంటే ఏదోగా వుంది.

"చిలకని జోస్యం అడగలేకపోయావా? నిముషంలో చెప్పేస్తుంది." బాబు అమాయకంగా సలహా యిచ్చాడు. అతని దృష్టిలో చిలక చెయ్యలేనిదేదీ లేదు. అమ్మమ్మ అప్పుడప్పుడనే బ్రహ్మ రాతనే చిలక చెప్పెయ్యగలుగుతూంటే, యీ

జ్వరం గురించి చెప్పటం దానికో లెఖ్కా' అనుకున్నాడు. ఇంత మంచి చిలకని వుంచుకుపీ యీ తాత ఎందుకిలా బెంబేలు పడుతున్నాడో అర్థం కావటం లేదు.

తాతకి అంత విచారంలోనూ బాబు మాటలు వింటే నవ్వొచ్చింది కానీ ఎలాంటి నవ్వునయినా అతని మీసాలు దాచెయ్యగలవు కాబట్టీ తాత నవ్వుతున్నాడని గ్రహించలేక పోయాడు బాబు

"ఈ చిలకని అమ్మినా సరే, పిల్లని డాక్టరుకి చూపించాలి. జ్వరం ముదిరి పోతూంది." తాత గొణుక్కున్నాడు బాబు వెళ్ళిపోతూంటే। ఈ మాటలు బాబు వినాలని అన్నవి కావు స్వగతంగా అనుకుంటూ పైకి గొణిగాడంతే।

ఆ తమాటలకి బాబు గుండెల్లో రైళ్లు పరిగెత్తాయి. చూడనైతే చూశాడు కానీ ఎప్పుడూ ముట్టుకో లేదేమో కూడా।

ఆ రోజే, బాబు యింటికెళ్ళాక రేకు హుండీలో దాచుకున్న డబ్బు లెక్క పెట్టాడు అర్ధరూపాయి మీద రెండు పైసలుంది.

'అమ్మా ' రామచిలకని కొందామా?' అడిగాడు.

'చూద్దాంలే'అనే మాటకి అర్థం బాబుకి తెలుసు. అందువల్ల చిలకని గురించి అమ్మనడగటంలో లాభం లేదను కున్నాడు. వీలయినంతవరకు డబ్బులు పోగుచేసి చిలకని కొనెయ్యాలని నిశ్చయించాడు.

రోజూ బడికెళ్ళే దోవలో తాతయ్యని చిలకని కలుసుకోవడం రివాజయిపోయింది బాబుకి. తాత యెక్కడ మనసు మార్చేసుకుంటాడో అనే భయం వల్ల కాబోలు అప్పుడప్పుడు 'చిలకని అమ్మతావు కదూ' అంటూ జ్ఞాపకం చేస్తూంటాడు బాబు।

బాబు అలా అడిగినప్పుడల్లా తాత వూకొట్టేవాడు నిజంగానే అతను చిలకని అమ్ముతాడా? దాన్నమ్మితే యింకోటి కొనాలి. దానికి మళ్ళీ అంతా కొత్తగా నేర్పాలి యిదంతా యెంత చికాకు।

• • •

"ఒరే, యిందరోయ్, యేమయినా కొనుక్కో" అంటూ మామయ్య రూపాయి నోటు బాబు చేతిలో పెట్టాడు, రైలెక్కుతూ. బాబు మొహం చేటంత యింది.

'దీంతో నా దగ్గర నాలుగు రూపాయలున్నాయనమాట' అనుకున్నాడు. కానీ యింకా ఆరు రూపాయలు కావాలే, ఎలా మరి? అమ్మనడిగితే యెప్పుడో కానీ డబ్బివ్వదు. నాన్న మాత్రం యే ఐదుపైసలో యిస్తూంటాండు.

మామయ్య గడిగడికీ యీ వూరొస్తే బాగుండును, ప్రతిసారి రూపా

యిస్తాడు. కానీ మావయ్య ఎప్పుడుబడితే అప్పుడు రాడుగా!

* * *

రోజూలాగే ఆ రోజు కూడా బాబు చెట్టు క్రింద తాతని కలుసుకున్నాడు. బడి కింకా చాలా టైం వుండటంవల్ల తీరిగ్గా పంజరం పక్కనే కూర్చున్నాడు.

'చిలకని అమ్మేస్తాడా? మరి నా దగ్గర అంత డబ్బు లేదే! ఐతే మరెవరో రామ చిలకను కొనేస్తారన్న మాట! మరి నాకు రామచిలక వుండదు. ఎలా యిప్పుడు?' ఇదొక అర్థం కాని సమస్య అయిపోయింది బాబుకి.

చిలకని కొనాలని నాన్నని కానీ, అమ్మని కానీ డబ్బులడిగితే, శుద్ధ దండుగ అంటారని బాబుకి తెలుసు. వాళ్ళకి తెలీకుండా కొనేసి ఎవరో యిచ్చారని అబద్ధం ఆడెయ్యొచ్చనుకున్నాడు బాబు. కానీ యిప్పుడా ధైర్యం కూడా లేకపోతూందే మరి.

'ఏమయినా సరే, రాముడ్ని నేనే కొనేస్తాను!' బాగా ఆలోచించి నిశ్చయానికి వచ్చాడు బాబు.

'ఆ మనవరాలికి జ్వరం యిప్పుడే రావాలీ! అయినా వెంటనే తగ్గిపోకూడదూ. వెధవ జ్వరం' అనుకున్నాడు కసిగా.

సాయంత్రం దోవలో బాబుకి చెట్టు కింది తాత. రామచిలక కనిపించలేదు. దాదాపు ఏడుపు ముఖంతో యిల్లు చేరాడు బాబు.

* * *

''జయా, డబ్బు పెట్టిలో పెడుతున్నాను. రెండు వందలున్నాయి జాగ్రత్త.'' వీధిలో కూర్చున్న బాబుకి నాన్నగారి మాటలు వినిపించాయి. మరో పావుగంటలో ఆయన బజారుకి వెళ్ళిపోయాడు. అమ్మ కూడా పక్కింటికి వెళ్ళిపోయింది. బామ్మ గుడి కెళ్ళింది. ఇప్పుడప్పుడే రాదు. బాబు ఆలోచిస్తున్నాడు.

మెల్లిగా వెళ్ళి నాన్న పెట్టిలో దాచిన

## చమక్కు మీల్

● భర్త: ఈ నెల బొత్తిగా పచ్చడి మెతుకులు పెడుతున్నావేం?

భార్య: 'అంతా మన మంచికే' చీర కోసం.

—వుంగరాల వీరవెంకటసుబ్బారావు చెల్లూరు.

డబ్బులో కొంత తీసేస్కుంటే అనిపించింది బాబుకి. 'బాబోయ్. దొంగతనం చెయ్యడమే!' భయంగా వుంది. 'ఫరవా లేదు. ఎవ్వరూ లేరు. చూసే వాళ్ళెవరు?' అతని చిన్ని హృదయానికదే ధైర్యం.

పరిస్థితి ప్రభావం బాబు మీద చక్కగా పన్చేసింది. పెట్టిలోంచి కొంత డబ్బయితే తీసుకున్నాడు కానీ మనసు బిక్కు-బిక్కుమంటున్నది. ఆ రాత్రంతా అమ్మనీ, నాన్ననీ సూటిగా చూడలేక పోయాడు. బామ్మ 'దొంగతనం మహా పాపం' అని కథ చెబుతూంటే బాబు కాళ్లు వణికాయి. పోనీ ఆ డబ్బుని మళ్ళీ అక్కడే పెట్టేస్తేనో అనిపించింది. కానీ బాబు కళ్ళ ముందు పంజరంలోని చిలక వయ్యారంగా నడుస్తూ పూరిస్తున్నది.

రాత్రి కలలో పంచరంగుల రామచిలక బోలెడు గమ్మత్తులు చేసి చూపించింది.

* * *

పొద్దున్నే. నాన్న పెట్టె తెరిచేసరికి బాబుకి ముచ్చెమటలు పోసేశాయి. కానీ ఆయన పాంటూ చొక్కా తీసుకుని వెళ్ళి పోయారు. 'హమ్మయ్య' అనుకున్నాడు బాబు.

త్వరగా చద్దన్నం తినేసి. పుస్తకాలు గబగబా సర్దుకుని రోజూ కన్న వేగంగా బడికి బయల్దేరాడు బాబు

బాబు జేబు బరువుగా వుంది అతని గుండెలాగ. ఎక్కడా ఆగకుండా గబగబా నడుస్తూ మర్రిచెట్టుని సమీపించాడు. కానీ అతనికి చెట్టు నీడలో తాత కనిపించ లేదు.

బాబు ఆశగా దూరంగా వున్న రోడ్డు వైపు చూస్తున్నాడు. రోడ్డు మీద కార్లు భలే జోరుగా తిరుగుతున్నాయి. బాబుకి భయంగా వుంది. చూస్తూండగానే. దూరంగా పంజరంతో తాతయ్య కనిపించాడు. అంతవరకు వున్న భయం పోయింది బాబుకి. 'అమ్మయ్య. యింకా చిలకని అమ్మెయ్య లేదు' అనుకున్నాడు. తాత చేతిలోని పంజరం చూడగానే ఏదో తెలీని వుత్సాహం ప్రవేశించింది బాబులో.

భుజానికి వేలాడుతున్న సంచిని గట్టిగా పట్టుకుని లాగుని ఎగలాక్కున్నాడు.

తాత ఓ చేత్తో పంజరం పట్టుకుని రోడ్డు దాటే ప్రయత్నం చేస్తున్నాడు. ఇటూ-అటూ అతడిని లెక్క చెయ్యకుండా బళ్లు రయ్-రయ్ మంటూ దూసుకు పోతున్నాయి. కానీ అప్పటికే అతను రోడ్డు మధ్య వున్నాడు.

పక్క సందులోంచి లారీ వేగంగా రోడ్డు మీదకొచ్చింది. ఎదురుగా అదే వస్తున్న కారు. దాన్ని తప్పించుకోవాలని పక్కకి తిరిగింది.

అంతే. ఆ తర్వాత గావుకేక విన పడింది.

బాబు వులిక్కి పడ్డాడు.... కారా.

# పార్లే గ్లూకో- బిస్కట్లు ఎక్కువ రుచిగలవి- ఎక్కువ శక్తితో నిండినవి

ఎల్లప్పుడు వీటని
కలిగి వుంటాయి:
విటమిన్లు ఎ-డి-బి$_1$-బి$_2$-
కాల్షియమ్-ప్రోటీన్, పాలు,
గోధుమ, పంచదార,
గ్లూకోజ్






everest/306h/PP Tel

## పిల్లలు పార్లే బిస్కట్లు తినాలి
## పెరిగి ఆనందంతో వుండాలి

భారతదేశంలో అత్యధికమైన అమ్మకం కలిగిన బిస్కట్లు పార్లే గ్లూకో

పోయింది. జనం పరిగెడుతున్నారు. బాబు కూడా మరో క్షణంలో అటు పరుగు తీశాడు. చుట్టూ వున్న గుంపుని తప్పించుకుని కారు దగ్గరి కెళ్ళాడు అతనికి తెలీకుండానే కళ్ళు వర్షిస్తున్నాయి బాబుకి గొంతు పెగల్లేదు.

పాపం ముసలతను అదృష్టవంతుడు. దెబ్బేలేం తగల్లేదు, యెవరో అంటున్నారు గుంపులోంచి.

'హమ్మయ్య' కారు డ్రయివర్ ఊపిరి పీల్చుకున్నాడు. బాబు కళ్ళు కారు దగ్గర వెతుకుతున్నాయి. అక్కడ పంజరంలేదు. ఏమయి పోయుంటుంది? గుంపులోంచి బయట పడ్డాడు బాబు.

ఎదురుగా అంత దూరంలో పంజరం కనిపించింది. బాబు అటు వైపు పరుగు తీశాడు, చిలక గాభరాగా రెక్కలు కొట్టుకుంటూ అరుస్తున్నది. బాబు పంజరం అందుకున్నాడు.

'చిలకకి దెబ్బ తగల్లేదు' అంతేచాలనుకున్నాడు తాతని జనం చెట్టుక్రింద కూర్చోపెట్టారు తాతకి నీరసంగా వుంది. ఎవరో సోడా కొనిచ్చారు. తాగాడు. కాస్సేపట్లో అంతా మామూలయి పోయింది. ఎవరి గొడవల్లో వాళ్ళు పడ్డారు.

బాబు తాతపక్కకి చేరాడు. తాత కళ్ళు మూసుకొని మూలుగుతున్నాడు.

"తాతా" బాబు పిలిచాడు. యేం అన్నట్లు చూశాడు తాత.

"డబ్బు తెచ్చాను" తాతకి అర్థము కాలేదు.

"ఇదిగో పదిరూపాయలు. చిలక నిస్తావా?" బాబు గొడవ బాబుది. తాత కేలావుందో బాబు కవసరంలేదు.

"పట్టుకుపో, పంజరంతో సహాపట్టుకుపో" తాత విసుగ్గా అన్నాడు.

మరో పది నిముషాల్లో బాబు పంజరంతో సహా బడివైపు పరుగుతీశాడు.

తీరా బడి చేరాక బాబుకి, పంజరం ఓ సమస్యయింది. ఆఖరికి బాబు పంజరంతో సహా రంగడి దుకాణం చేరుకున్నాడు.

"ఒరే రంగా, దీన్ని నీ దగ్గరదాచరా, బడి వదలగానే తీసుకుంటా" అన్నాడు బాబు.

"ఏటండోయ్, చిలకా పంజరవూ తెచ్చారు? చిలకెగిరి పోద్ది" రంగడు హాస్యం చేశాడు.

"ఎక్కడికీయెగరదులేవోయ్" అంటూ బాబు బళ్ళోకి పరుగెత్తాడు. కనిపించిన ప్రతివాడినీ పిల్చి మరి చెప్పాడు చిలకని గురించి. అందరూ బాబు మాటలు ఆశ్చర్యంగా విన్నారు. క్లాసులో కూడా బాబు నోరు వూరుకోలేదు.

ఆఖరికి మాస్టరు బెంచెక్కించాడు బాబుని.

'పోన్లే చిలక్కోసం బెంచెక్కితే ఫరవాలేదు' అనుకున్నాడు బాబు.




సాయంత్రం రంగడి దుకాణంలో వున్న రామచిలకని చూసాక అందరూ రాషం చిలకకన్నా ఆదే బావుందంటూంటే బాబు పొంగి పోయాడు.

* * *

బాబు తమ్ముళ్ళూ, చెల్లెళ్ళూ అంతా చిలకని చూసి తెగ మురిసి పోయారు ... పంజరం పిల్లి కందకూడదని ఎత్తుగా వేళ్ళాడదీశాడు.

"ఎక్కడిదిరా నీకీ చిలక?" అడిగింది బామ్మ.

"ఎవరో యిచ్చార్లేవే.... బామ్మోయ్. యిదెలాంటి చిలకో తెల్సా? సి. ఐ. డి. అబద్ధాలాడదు. ఎప్పుడూ నిజమే చెప్తేస్తుంది. మరేం, నీకూ, అమ్మకీ, యింకా ఎవరికీ తెలీని ఎన్నో సంగతులు దీనికి తెలుసు. ఏమనుకున్నావో, హుం!" బాబు బామ్మ దగ్గర చిలకని గురించి ఒకే పొగిడేశాడు.

* * *

భోంచేస్తున్న బాబుకి నాన్న మాటలు వినిపించాయి. నాన్న కేకలు వేస్తున్నాడు గట్టిగా. అమ్మేదో ఘర్షణ పడుతున్నాది.

"ఒరేయ్ బాబూ. యిలా రా!" నాన్న కేకతో బాబు నీళ్లుకారి పోయాడు. బితుకు-బితుకు మంటూ నాన్న ముందు నిల్చున్నాడు

"పెట్టిలోంచి డబ్బు తీశావా?"

"ఉహూ...." బాబు తలాడించాడు.

"అమ్మ తియ్యలేదు.... నువ్వు తియ్యలేదు.... బుజ్జి తియ్యలేదు.... పెట్టిన డబ్బు మాత్రం లేదు. రూపాయలకి కాళ్ళొచ్చాయా?"

"ఇలా ఐతే లాభం లేదు. ఆ బెత్తం యిలా తే...." నాన్న బెత్తం అందుకున్నాడు.

"నాకు నిజంగా తెలీదు నాన్నా!" బాబు దీనంగా అన్నాడు.

"ఒరేయ్. ఆ చిలకనడగరా. అది చెప్పేస్తుంది." బామ్మ ముసి-ముసిగా నవ్వుకుంది.

నాన్న బాబు వైపొకసారీ, బామ్మ వైపొకసారీ చూశాడు.

"ఏరా. యీ చిలక నిజం చెబుతుం కదూ?"

"అవును" బాబుకి భయంగా వుంది.

"అయితే దీన్నడుగుదాం! జయా. కాగితం. పెన్నూ తే."

బాబుకి నాన్న చెయ్యబోయేది అర్థం కాలేదు. 'ఏం చేస్తాడీయన?....' అనుకున్నాడు.

పంజరంలోని చిలకవైపు చూశాడు బాబు. అది దానికేం పట్టనట్టు ఇటూ-అటూ తిరుగుతున్నది.

బాబుకి చమటలుపోస్తున్నాయి గొంతు తడారిపోయింది. 'నేను డబ్బు తియ్యడం యిది చూళ్ళేదుగా. దాని మొహం. ఎలా చెబుతుందీ?' అనుకున్నాడు బాబు బింకంగా. కానీ అతని మనసులో పీకుతూనే వుంది.

అందరికళ్ళు చిలకమీదే వున్నాయి. కొంపదీసి యీ చిలక నా పేరు తియ్యదు గదా! అనుకుంటున్నారు యెవరికి వాళ్ళే.

స మ్ థిం గ్

● పాత పద్ధతి

(యిల్లాలి కోరిక తీరనప్పుడు కారపుమెతుకులకు గురయ్యే ఉద్యోగిగారు అర్థంకాని గజిబిజి సంతకానికి ముందు చూపులసంజ్ఞతో (ఎక్స్చేంజ్ పద్ధతి) కస్టమర్ దగ్గర యిచ్చి పుచ్చుకోవడం. (కాకుంటే అన్నానికి బదులు మొత్తం కారమే వుంటుంది పళ్లెంలో)

చిలక తన పేరున్న చీటీ తీస్తే యేం చెయ్యటమో నాన్నకి బోధపడటంలేదు.

బాబు ఆవేశంగా చిలకనే చూస్తున్నాడు. బాబు కిప్పుడా చిలకని చూడ్డానికే భయంగా వుంది. చిలక కాయితం ముక్కల చుట్టూ తిరగటం మానేసి చటుక్కున ఓ కాయితాన్ని ముక్కుతో పట్టుకుంది. నాన్న దాన్నందుకుని మడత విప్పాడు.

అందరి కళ్లూ దాని మీదే వున్నాయి. దాని మీద బాబు పేరు రాసుంది!

"చిలక నిన్నే దొంగంటున్నది. నిజమేనా? చిలక అబద్ధం ఆడదుకదా?" నాన్న బాబు కళ్ళల్లోకి సూటిగా చూశాడు.

తన చిలకే తనని పట్టిచ్చింది. దానికీ తెలుసు 'దొంగతనం మహా పాపం అని. అందుకే అది అబద్ధం ఆడలేదు.

బాబు కళ్ళలో నీరు తళుక్కుమంది.

"నన్ను పట్టిచ్చిన యీ చిలక కోసమే నేను దొంగతనం చేసాను. మరెప్పుడూ అబద్ధం ఆడను నన్ను కొట్టకు...." బాబు భయంగా కళ్లు మూసుకున్నాడు.

బాబు అనుకున్నట్టేం జరగలేదు.... ఆశ్చర్యంగా కళ్ళు తెరిచాడు.

నాన్న నవ్వుతూ బెత్తం దూరంగా విసిరేసి బాబుని దగ్గర తీసుకున్నాడు.

"చూశావా. చిలకలు కూడా అబద్ధమాడవు. దొంగతనం చెయ్యొచ్చు.... మరెప్పుడూ చెయ్యకేం. ఫో!" నాన్న నవ్వుతున్నాడు.

బాబుకి అంతా విచిత్రంగా వుంది.... తనని నాన్నెందుకు కొట్టలేదో అర్థం కాలేదు. ఈ చిలక నిజంగా సి. ఐ. డి. చిలకే సుమా! ఎలా చెప్పేసిందో. నేనే తీశానని. బాబు దాని తెలివి తేటలకి విస్తుపోయాడు.

నాన్న వ్రేలి మీద చిలక నాట్యం చేస్తూంది.

"రాముడూ! .." అన్నాడు నాన్న.

"ఓ!" అంది రామచిలక. ●

న్యూ థింగ్

## ● క్రొత్త పద్ధతి

(ఆత్మా రాముడు బీర్ జిన్ అంటూ గోలచేస్తుంటే తప్పించుకోలేక యిల్లాలిచేతి కారపు మెతుకులకయినా సిద్ధపడి సంతకాలు విరివిగా గీచి పారేసే బార్టర్ సిస్టమ్ (లేకుంటే వాచ్ మొదలు బెర్లిన్‌పాంటుదాకా సేట్ చమన్‌లాల్ అంగడి చూడాల్సిందే!)

# హనీమూన్

యర్రంశెట్టి శాయి

నేనూ, సారధీ డార్జిలింగ్ వెళ్లాలనుకున్నాం. అందుక్కారణం లేకపోలేదు. ఈ కరువు రోజుల్లో కారణం లేకుండా సర్దాగా డార్జిలింగ్ వెళ్ళాలనుకోడానికి మేమేం లక్షాధికారులం కాదు. మా ఇద్దరికీ ఓ సంవత్సరం తేడాలో పెళ్ళిళ్ళయినాయి. మన దేశంలో ఓ సగటు మొగాడు పెళ్ళాన్ని వరాలు కోరుకోమని అడిగేది ఒక్క పెళ్ళినాటి రాత్రే.

ఆ తరువాత వరాలు కోరాలనే కోరిక ఆవిడకూ, కోరుకోమని అడిగే ధైర్యం మొగాడికీ గ్యారంటీగా ఉండవు. మేమిద్దరం బుద్ధిగడ్డి తిని మా పెళ్ళినాటి రాత్రి భార్యతో డార్జిలింగ్‌కు హనీమూన్ వెడదామని ప్రామిస్ చేశాము అలా చేసేప్పుడు ఈ భార్యామణులు అలాగే గుర్తుంచుకొని యిన్నైనాళ్ళగ్గంటలూ దాన్ని గురించే గొణుగుతుంటారనుకో లేదు.... అలా పెళ్ళాలకి వరాలిచ్చేయడం ఎంత తప్పో. కమిట్ అయిపోయాగ్గాని మాకు తెలిసొచ్చిందిలేదు. ఇక చేసేది లేక మాకున్న సంపదలనన్నిటినీ సమీకరించి డార్జిలింగ్ వెళ్ళడానికి నిర్ణయించుకొన్నాం. ఇద్దరివీ ప్రక్క-ప్రక్క యిళ్ళే కాబట్టి ఆదివారం నాడు చర్చలకు మా యింటి వసారాలో సమావేశమయ్యాం.

"ఈ విషయమంతా చూడ్డానికి ఓ కమిటీ వేయండి! గోంగూర ఫలానా సంవత్సరం ఎందుకు ఎక్కువ పండలేదు అన్న విషయానికి కూడా కమిటీ వేస్తున్నారు కదా!" అంది మా ఆవిడ లోపల్నుంచి.

---

పెద్ద కథ

---

వాళ్ళన్నయ్య రెండుసార్లు మునిసిపల్ కౌన్సిలరుగా పోటీ చేసి ఓడిపోయాడు. అంచేత రాజకీయాలు తనకు బాగా తెలుసని దాని నమ్మకం. సుమారుగా మేము పెళ్లాలతో డార్జిలింగ్ వెళ్ళి రావడానికి ఎంత



ఖర్చవుతుందో లెఖలు వేయసాగాం నలుగురికీ రైలు ఛార్జీలు అన్నాడు సారథి. 'ఎంత' అనడిగాను.

"ఒకరి కెంతవుద్దో - దాన్ని నాలుగు పెట్టి హెచ్చ వేస్తే సరి!" అన్నాడు వాడు. నిజమేననిపించింది గానీ తీరా కాగితంమీద వ్రాయబోయేసరికి అసలు ఒకరికే ఛార్జి ఎంతవుతుందో తెలీలేదు.

'రైల్వే ఎంక్వయిరీస్'కి ఫోన్ చేసి కనుక్కొందామన్నాడు వాడు. ఫోను మా ఇద్దరి యిళ్ళల్లోనూ లేదు. ఎదుటి ప్లీడర్ గారింట్లో ఉంది. ఇద్దరం ఆయనింటి కెళ్ళాం. ప్లీడర్‌గారు వసారాలో కూర్చొని పేపర్ చదువుకొంటున్నారు.

"రండి-రండి!" అన్నాడు మమ్మల్ని చూస్తూ.

నాకు భయం వేసింది. బ్రహ్మ ఓ

జలగని సృష్టిస్తూ, ఆఖరి క్షణంలో మనసు మార్చేసుకొని మనిషిగా సృష్టించాడనీ. ఆ మనిషే ప్లీడరుగారనీ మా ఊళ్ళో అందరికీ నమ్మకం. ఏ రోజు కారోజు దేశంలోని తాజా విషయాలన్నీ కనబడ్డ ప్రతి వాడికీ చదివి వినిపించి. విమర్శిస్తే గాని ఆయనకు ఆకలి తీరినట్లుండదు.

ఆ రోజు ఆయన ఆకలికి మేము ఫలహారమవక తప్పలేదు. అరగంట తర్వాత "ఫోను చేయాలండీ!...." అంటూ నసిగాను.

"ఓ యస్! చేసుకోండి!"

ఆయన ప్రక్కనే ఉన్న ఫోన్ ఎత్తి రైల్వే ఎంక్వయిరీస్‌కి డయల్ చేశాను.

"హలో!" అంది ఓ అందమయిన అమ్మాయి గొంతు.

'హలో!' నేనూ అనేశాను. రైల్వే ఎంక్వయిరీస్‌లో ఎప్పుడూ ఓ కర్ణ కఠోరమయిన మగ గొంతు మాట్లాడుతూండేది. ఈసారి అమ్మాయి మాట్లాడేసరికి ఖంగు తిన్నాను.

"న....న....న...." అంటూ తడబడ్డాను.

"ఓ! సరనా కావాలా? ఆమె మీ ఫోన్ కోసమే ఎదురు చూస్తోంది....ఏయ్ సరనా! ఫోన్!" అంటూ అరచిందా పిల్ల.

నేను గాభరా పడిపోయి 'హలో.... హలో...' అంటూ అరచానుగాని ఫోన్ క్రింద పెట్టి ఆమె వెళ్ళిపోయింది. మరు క్షణంలో 'సరనా' అనుకొంటాను! ఫోన్ తీసుకొంది

"హలో!' అంది-యింకా తియ్యగా ఉందీ గొంతు.

"సారీ! నేను మీరు ఎదురు చూస్తూన్న మనిషిని కాదు .."

"జోక్ చెయ్యకు రాజ్! త్వరగా రా! ఎనిమిదింటికి ఫోన్ చేస్తానన్న వాడివి...."

"నేను చెప్పేది వినండి! ప్లీజ్! నాకు రైల్వే ఎంక్వయిరీస్ కావాలి! మీరు మాట్లాడేది అక్కడి నుంచేనా?"

"ఇది వర్కింగ్ ఉమెన్ హాస్టల్...." కొద్ది క్షణాల తర్వాత అందామె.

"రాంగ్ నంబర్!" అంటూ ఫోన్ దించేశాను.

ఈసారి డైరక్టరీ తీసుకొని ఆ నంబరు ముందుంచుకొని జాగ్రత్తగా డయల్ చేశాను.

"గుడ్‌మార్నింగ్! రైల్వే ఎంక్వయిరీస్!' అన్నాడొకతను

"మన దేశానికీ బంగ్లాదేశ్ రెఫ్యూజీల బెడద ఎలా తప్పుతుందీ?" ప్లీడరుగారు పేపరు వంక చూస్తూ గట్టిగా అరచారు.

"ఏమిటీ?" అన్నాడు ఎంక్వయిరీస్ క్లర్క్ కోపంగా.

"అబ్బే. మిమ్మల్ని కాదండీ! మా




రుగారేదో అంటూం...చూ....మీ ఫోనులో వినిపించింది। సారీ।"

"ఓ। అదా। ఫరవాలేదు లెండి। ఇటువంటి పొరపాట్లెవరికయినా జరుగుతూనే ఉంటాయి ..."

"థాంక్యూ వెరీమచ్।" అన్నాను మర్యాద కోసం.

"దట్సాల్ రైట్।" అంటూ అలవాటు చొప్పున ఫోను దించేశాడతను.

ఫోను క్రింద పెట్టాగ్గానీ నాకు గుర్తు రాలేదు. నేనడగాల్సింది అడగనే లేదని.

మళ్ళీ ప్లీడరుగారి ఫోను వాడటం ఏమంత బాగుండేటట్లు కనిపించలేదు....

అందుకని ఆయనకో 'థాంక్స్' చెప్పేసి బయటికొచ్చాను. వెనుకే సారధి కూడా వచ్చేశాడు.

"ఆ ప్లీడర్ గొడవ మూలాన అడగటం పడనే లేదన్నాను.

"ఏడ్చినట్లుంది।" అన్నాడు విసుగ్గా.

"మరే।" అన్నాను.

"ఇరానీ హోటల్నుంచి చేద్దాం పద. ఈ సారి నేనే మాట్లాడతానుండు।" అన్నాడు వాడు.

ఇద్దరం ప్రక్క సందులోని ఇరానీ హోటల్‌కు వెళ్ళాం.

సర్వర్ వేడి సమోసా తెచ్చి అప్పుడే గ్లాస్ షెల్ఫ్‌లో ఉంచుతున్నాడు

నాకు నోరూరింది.

"సరే! నువ్ ఫోన్ చేసిరావా! నే నా టేబుల్ దగ్గర సమోసాలు తింటూం టాను!" అన్నాను.

అందుకు సారధి ససేమిరా వప్పుకో లేదు. సమోసాలు ఇద్దరం తిన్న తరువాతే ఫోన్ చేయ్యవచ్చు. ఇప్పుడేం మునిగి పోలేదన్నాడు ఇద్దరం చెరో నాలుగు సమోసాలూ తినేశాం. సర్వర్ వన్ బై టూ టీ కూడా తెచ్చి మా ముందుంచాడు.

"వీడికెలా తెలుసు మనం ఒన్ బై టూ త్రాగుతామని!" అన్నాడు సారధి అనుమానంగా.

"ఈ హోటల్‌కొచ్చే వాళ్ళందరూ అలాగే త్రాగుతారండీ!" అన్నాడు సర్వరు ఆ మాట వినేసి.

"ఓవేళ ఒక్కడే వస్తే!"

"మరో ఒంటరి కస్టమర్ వచ్చేవరకూ 'టీ' త్రాగరండీ!"

టీ త్రాగింతర్వాత నేనే ఫోన్ చేశాను.

కాషియర్ దగ్గర రికార్డులు చాలా గొడవగా మ్రోగుతున్నాయి,

"రైల్వే ఎంక్వయిరీస్?"

"హల్లో! చేతిలో చెయ్యేసి చెప్పు బావా-ఇక్కడి నుంచి డార్జిలింగ్‌కి - ఉల్లి పాయ ఆమ్లెట్ ఒకటీ...."

"ఏమిటయ్యా గొడవా? ..."

"కోప్పడకండి! నేను హోటల్లో నుంచుని మాట్లాడుతున్నాను. అందుకని డిస్టర్బెన్స్‌గా ఉంది. బోర్నవిటా ఒకటీ- ఇక్కడి నుంచి డార్జిలింగ్‌కి ఛార్జి ఎంత- ఎందుకో మరి తెలియాదాయె - రేయి మాత్రం గడచిపోయే ..."

"సుమారు యాభై రూపాయలు...."

"ధాంక్యూ! ఇరవై పైసలూ-"

"షెన్సన్‌నాట్!"

బిల్లు ఇచ్చేసి ఇద్దరం బయటికొచ్చాం

మళ్ళీ మా వసారాలో చేరుకొని లెక్కలు ప్రారంభించాం.

ఛార్జిలు నలుగురికీ ప్లస్ సారధి వాళ్ళ బాబిగాడికీ కలిపి అయిదొందలు. మిగతా ఖర్చులకు అయిదొందలు.

ఎందుకేనా మంచిది దగ్గరో వెయ్యి రూపాయిలుంటే మంచిదన్నాడు సారధి.

"మన దగ్గర అసలు ఎంత ఉందో ముందు చూద్దాం! దాన్నిబట్టి ఇంకెంత కావాలో అంచనా వేయవచ్చు. తర్వాత అది సంపాదించే మార్గాలు వెదుకుదాం!" అన్నాను.

సరేనన్నాడు. ఇద్దరం బాంక్ సేవింగ్స్ పుస్తకాలు తీసుకొచ్చి చూశాం.

నా పుస్తకంలో అయిదు రూపాయలు బాలెన్స్ మాత్రం ఉంది. ఎకౌంట్ మూసివేయకుండా ఉంచటానికి అది అవసరం. సారధి పుస్తకంలో పదకొండు రూపాయల చిల్లర ఉంది.

''మన పత్నీ రత్నాలు ఏమయినా దాచారేమో అడుగుదాం!'' అన్నాను. ఓసారి మా ఆఫీసులో పనిచేసే నరసింహారావుకి వాళ్ళావిడ తను దాచుకొన్న డబ్బు రెండువేల రూపాయలు అప్పుగా ఇచ్చిందట.

''అడిగితే లాభంలేదు. వాళ్ళకు తెలీకుండా వాళ్ళ పెట్టెలు సోదా చేద్దాం!'' అన్నాడు వాడు.

మా ఆవిడ వంటింట్లో ఉండగా గది తలుపు గడపెట్టి ఇద్దరం దాని పెట్టంతా వెతికాం. సెంటు వాసన ఘుమఘుమలాడుతోంది గాని దమ్మిడీ దొరంలేదు. నబ్బు పెట్టె వెతుకుతోంటే ఓతేలు పిల్ల మెల్లగా నావేపు నొక్కేసింది.

''అమ్మో!'' అంటూ ఎగిరిపడ్డాను. సారధి ఖంగారుగా బయటకు పరిగెత్తి "ఏమిట్రా?" అంటూ అక్కడే నుంచొని అరచాడు. (సశేషం)

# స్ట్రైక్

(ఇది కేవలం ఊహాగానం మాత్రమే. కాని ఈ భూగోళంపై అడుగడుగున సమ్మెలు చేస్తున్న ఈ కాలంలో ఈ క్రింది విధంగా కూడా స్ట్రైక్‌లు చేస్తే ఎలా వుంటుందో ఆలోచించండి....)

- అందమైన నర్సులున్న ఆస్పత్రిలోనే ఉద్యోగం కావాలని కుర్రడాక్టర్ల స్ట్రైక్.
- అందమైన మగ పేషంటులు ఆస్పత్రిలో అడ్మిట్ కావాలని నర్సుల స్ట్రైక్.
- పెరిగే ధరలతో ప్రజలు సహకరించాలని వ్యాపారస్థుల స్ట్రైక్.
- కట్టుకొన్న క్రొత్త పెళ్ళాం ఫేషన్స్ కోసం వచ్చే జీతం చాలడం లేదని. జీతం పెంచాలని ఎన్. జి. ఓ ల స్ట్రైక్.
- మునిసిపాలిటీ కుళాయిల్లో నీళ్ళకు బదులు బ్రాందీ రావాలని త్రాగుబోతుల స్ట్రైక్.
- మామూలు రేట్లకే కాఫీలు కప్పులతో కాకుండా కూజాలతో సప్లై చెయ్యాలని కాఫీ ప్రియుల స్ట్రైక్.
- సిగరెట్ల పొడవు పెంచాలని. రేట్లు తగ్గించాలని స్మోకర్ల స్ట్రైక్.
- పత్రిక్కి పంపించిన రచనలన్నీ ప్రచురించాలని రచయిత(త్రు)ల స్ట్రైక్.
- జైళ్ళలో గదులు ఎయిర్ కండీషన్డ్ చేయించాలని. గళ్ళ చొక్కాలకు బదులు యింపోర్టెడ్ టెర్లిన్ చొక్కాలు సప్లై చెయ్యాలని ఖైదీల స్ట్రైక్.
- 'హిప్పీ' స్టైల్ నశించాలని బార్బర్ షాపుల స్ట్రైక్.
- ఇంటింటికి తిరగడానికి ప్రభుత్వం స్కూటర్ సప్లై చెయ్యాలని బిచ్చగాళ్ళ స్ట్రైక్.
- లంచాలు అధికంగా యివ్వాలని అధికార్ల స్ట్రైక్.
- వీధుల్లో విద్యుద్దీపాలు వుండరాదని. యిళ్ళకు గట్టి తాళాలు వెయ్యకూడదని దొంగల స్ట్రైక్.
- జేబుల్లో చేతులుంచుకొని నడవకూడదని పిక్‌పాకెటర్స్ స్ట్రైక్.
- టైట్ షర్టులు, నారో పాంట్స్ కుట్టించుకోరాదని క్లాత్ మర్చంట్స్ స్ట్రైక్.
- పరీక్షల్లో 'కాపీ' కొట్టడం అనుమతించాలని విద్యార్థుల స్ట్రైక్.
- అమెరికన్ డైవర్స్ పద్ధతి ఇండియాలో రావాలని ఆడవాళ్ళ స్ట్రైక్.
- ప్రజలు అనారోగ్యవంతులు కావాలని ప్రయివేటు డాక్టర్ల స్ట్రైక్.

—టి. రామారావ్





గణేష్ పాత్రో

(గత సంచిక తరువాయి)

## 4

శ్యామల రావుకి తండ్రి మీద గౌరవం లేదు. తండ్రి డబ్బుమీద గురికూడా లేదు. గానీ రంగారావు బహద్దూర్ వారి మీసాలు మెలితిరిగుంటాయేమో— ఎంతటి ఉద్దండులైనా భయపడిపోతారు. ఆ ఒక్క భయం నుండి శ్యామలరావు కూడా తప్పించుకోలేక పోయాడు. భక్తి లేని భయం.

రంగారావుకి కొడుకు మీద గొప్ప ఆపేక్ష. ప్రతీ తండ్రికి వుండే మామూలు ఆపేక్షకాదు. ప్రాణప్రాయంగా చూసుకునే వెర్రి ఆపేక్ష. అతనికి తెలుసును, కొడుక్కి తనమీద ప్రేమలేదని. తల్లి చావు కారణంగా తన మీద కక్ష పెంచుకున్నాడని కూడా తెలుసు. గానీ అభిమానిస్తాడు కొడుకుని.

ఇద్దరు భార్యలు గతించిన తరువాత. తల్లి హయాంలో ఇల్లు గడించింది కొన్నాళ్ళు. ఆ తల్లి కూడా మరెంతో కాలం బతకలేదు. రంగారావుగారి చెల్లెలు విధవరాలై పుట్టిల్లు చేరుకుంది. పెళ్ళయిన చెల్లాళ్ళతే జరిగిన యీ ఘోరం చూసి, గుండె బాదుకుంది తల్లి. తాను తన కోడలికి చేసిన అన్యాయమే ఇలా తూతుర్ని

సీరియల్

కొట్టిందని కుమిలిపోతూ కన్నుమూసింది. మొగుడు పోతేనేం. రంగారావు చెల్లెలు తిరపతమ్మ.— ఇప్పుడు సర్వాధికారిణి. అన్న ఆస్తిని. వ్యవహారాలన్నిటినీ చక్క-జూస్తూ రాణీ గిరీలో వుంది.

రంగారావు ఎప్పుడూ పవిదొంగే' పొద్దస్తమానం అడవిలో పడి పుల్లు. చిర తలు కొడతాడు. ఏ అర్ధరాత్రికో జీపు నిండా కళేబరాలు వేసుకుని ఇల్లు చెరి తాడు. దుప్పి మాంసం వండించుకొని సుష్టుగా భోంచేసి—మళ్ళీ తెల్లారలోగా నే వేటకి తయారు.

శ్యామలరావుకి ఈ ఇంట్లో స్నేహి తులు లేరు. చిన్నప్పుడు కలిపి చదువు కున్న స్నేహితుల్లో మిగిలినకొద్దిమందిలో ఒకడు 'సాహూ' సాహూ వాళ్ళ కుటుంబం ఎప్పుడో ఒరిస్సానుంచి వలసొచ్చి ఇక్కడ స్థిరపడిపోయారు. మిఠాయి సామాను తయారుచేసి విందులకి. వినోదాలకి పట్నంలో సప్లయి చేస్తుంటాడు సాహూ తండ్రి. వారానికి నాలుగు మార్లు బండి మీద పట్టుకెళ్ళి అమ్ముకొస్తుంటాడు. అదే అతని వృత్తి. అందులో సిద్ధహస్తుడు కూడా.

"రాసా— మలయ్ తింటావా అడి గాడు సాహూ.

"అదేంపిటిది? కొంచెం తెలుగులో ఏడవరా!" రసగుల్లాలో రసం జుర్రుతూ శ్యామలరావు అడిగాడు.

"రాసా మలయ్ అంటే పానకంలో నానవేసిన మీగడ. తియ్యతియ్యగా చాలా బావుంటుంది. పట్టుకురానా?" ఊరికే అడుగుతాడు గానీ జవాబుతో ప్రమేయం లేకుండా పట్టుకొచ్చేస్తాడు. సాహూని చూస్తే శ్యామలరావుకి సరదా వేస్తుం టుంది. 'వెఱ్ఱిగానీ. దిగుతూ జారిపడక" హెచ్చరించాడు సాహూ మిఠాయి దుకా ణంలో చిన్న అటకలాంటి మిద్దె వుంది. దానికి కర్రిమెట్లు. పైన చీకటి. చిన్న కిటికీ గుండా కాస్త వెలుగొస్తుంటుంది. ఆ మిద్దె మీద. పాత కుర్చీలు రెండు ఒక పక్క. మరో పక్క సాహూ పడుకునే పక్క వుంటాయి. ఆ మిద్దెని సాహూ తండ్రి అనుమతిచే తనకోసం ప్రత్యేకించు కున్నాడు. కురుచుగా సీలింగు డిమ్‌వెంటి లేషన్ చూసి ఎప్పుడైనా శ్యామలరావు చిరాకుపడితే. ఇది "వెస్టర్న్ ఎట్‌మాస్ఫి యర్' అంటాడు సాహూ.

"రాసా మలయ్' నాలుగు బిళ్ళలు. ప్లేటునిండా తియ్యటి పెరుగుపోసి పట్టు కొచ్చి స్నేహితుడి చేతికి అందించాడు.

"సాహూ! ఇవన్నీ తింటే బతుకు తానా నేను?"

"తినకపోతే చస్తావు. చంపేస్తాను." బెదిరించాడు సాహూ.

'ఐతే కాస్త సాయం పట్టు' ప్రతి మాటాడు

''అలాగన్నావు బాగుంది.'' అంటూ కూర్చున్నాడు సాహూ.

ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ తింటూండగా సాహూ తండ్రి 'జాదిష్మిరోసాహూ' మిద్దె మీది కొచ్చాడు. శ్యామలరావుని చూస్తూనే నమస్కారం చేశాడు.

''శ్యామలరావుగారూ! భోగున్నారా?'' అంటూ చిరునవ్వు నవ్వాడు.

అతను మామూలుగానే మాటాడుతాడు గానీ శ్యామలరావుకి అనిపిస్తుంటుంది ఒరియా వాళ్ళు ప్రతి మాటకీ ఒత్తులు పెడతారని.... స్నేహితుడు తనతో చిర కాలం నుంచీ కలిసిపోయాడు గనుక ఏమీ అనిపించదుగానీ, ఈ (జాదిష్మిరో) సాహూను మాత్రం లెక్క మీద కలవ దంతటపడ్తుంటుంది. అందువల్ల మరింత విపరీతంగా వినిపిస్తాయి అతని మాటలు.

''భొరేయ్, గొణేశో....'' సాహూని పక్కకి పిలిచాడు. అంటూన్నవాడు లేచి తండ్రిని సమీపించాడు సాహూ.

శ్యామలరావుకి చిన్నప్పటి విషయ మొకటి జ్ఞాపకమొచ్చింది. తను హైస్కూల్లో చదువుతున్న రోజుల్లో 'ఒడంగా' అని ఇంగ్లీషు టీచరు ఉండేవాడు. సన్నగా, పొడగ్గా, ఛామనఛాయగా ఉండేవాడతను. ఇంగ్లీషు సబ్జెక్టుని ఇంగ్లీషు మాష్టార్ని ఆ రోజుల్లో పిల్లలందరికీ హడలే.... ఒక రోజు కిటికీ సందుల్లోంచి అమ్మాయిల అందాల్ని తిలకిస్తూ వరండాలో పచారు

# జరిగిన కథ

శ్యామలరావు కృష్ణమోహన్ స్నేహితులు; లాస్టూడెంట్లు. శ్యామలరావు ఆశయంగొప్పది కారణం తనతల్లి మూగది. ఆమె అనేక బాధలకులోనై చనిపోయింది. మానసికంగా బాధపడే అమ్మాయినే పెళ్ళి చేసుకోవాలనే తన నిర్ణయాన్ని తెలుపుతాడు స్నేహితుడు మోహన్‌కు సెలవులకు వెళ్ళిపోతున్న రోజున. మోహన్ తల్లి కామాక్షమ్మ కొడుకు విషయంలో అమిత ప్రేమ చూపుతుంది. కానీ మోహన్ సరోజ వివాహ విషయంలో మాత్రం విముఖత కనబరిచింది. కారణం సరోజకు ఫిట్స్ జబ్బు.

చేస్తున్న ఒక కుర్రాడ్ని గమనించి. ఒడంగా మాష్టారు ఒక చిరస్మరణీయమైన కేక వేశారు. ''భొరేయ్, భొంకట్రావ్! భాయ్ ఆర్యూ భోండరింగ్ అన్ ది భొరండాస్ అండ్ భాట్ భండర్స్ యూ భైంట్ త్రూ భిండోస్!'' విండోలలోంచి వెంకట్రావుకి ఏం వండరు కనిపించిందో మాకెవరికీ తెలీదుగానీ, ఒడంగాగారి ఇంగ్లీషులో మాత్రం కాలేజీ పిల్లలంతా వండరు పడ గట్టుకుని చస్తున్నారు. దాంతో వాడి భీఖ్ భిరాకం మోత మోగిపోయింది.

ఒరియా వాళ్ళ తెలుగు వింటూన్నప్పుడంతా ఒడంగా మాష్టారు తప్పనిసరిగా గుర్తుకొస్తారు శ్యామలరావుకి.

అదేదో పని పురమాయించినట్టున్నాడు కొడుక్కి. సాహూ గబగబా మెట్లు దిగి కిందికి వెళ్ళాడు, 'ఇప్పుడే వస్తా' నంటూ. జుధిష్ఠిరో తన పక్కనున్న కుర్చీలో కూర్చున్నాడు.

కూచున్నంతసేపూ ఒకటే వ్యాపారం సోది. పాలు దొరకడం లేదట. నెయ్యి సరే, ఎలాగా కల్తీ నెయ్యే! పంచదారకి బదులు కంద సార వాడుతున్నాడుట. అడపాదడపా సేకరిన్ కలుపుతున్నాడట. అలాంటప్పుడు మంచి రుచిగల వస్తువు ఎలా తయారవుతుందని ప్రశ్నించాడు. అసలు తాము తాతల నాటినుండీ రాజ దర్బారుల్లో పని చేసిన మిఠాయి వంట వాళ్ళట జుధిష్ఠిరో సాహూ తాతగారికి, జయపురం మహారాజా ప్రాణ స్నేహితుడట. ఆ తాతగారు ఒక్క తీపి సామానే కాక, వంటలన్నీ చేసేవాడట. ఒకమారు పెద్ద వంజరం పట్టుకొచ్చి వండించమని కోరితే ఆ చేపని ముక్కలు చెయ్యకుండానే నడుము దగ్గిర్నుండి అటు సగం పులుసు, ఇటు సగం ఇగురు చేసి రాజావారికి వడ్డించాడట.

''ఆఁ....!'' ఆశ్చర్యపోయాడు శ్యామలరావు.

''ఆఁ....'' రెట్టించాడు జుధిష్ఠిరో.

ఆ కబుర్లు అలాగ నడిచి, పరుగెత్తి, అలిసిపోయి 'గొణేశొ' దగ్గరకి రాగానే ఆగిపోయాయి. ''మా గొణేశొగాడికి చిన్న ఉద్యోగం వేయించండి బాబూ! తమరు నాన్నగారితో చెప్తే చాలు. వారే చూసుకుంటారు. తాంబూలం పుచ్చుకుంటా యంటే, నాకు చెప్తే తప్పకుండా దాఖలు చేసుకుంటాను.' లేకపోతే తమకి విశాఖ పట్నం బాగా తెలుసును గదా! ఎక్కడైనా పడేయించండి. వాడ్ని ఎరిగెరిగి వ్యాపారంతో దించడం నాకిష్టం లేదు. ఇది నా తోటే సరి బాబూ! వాడు నాకేం పంపించక్కర్లేదు. వాడి కడుపు కోసం నా దుక్కు చూడకుండా వుంటే చాలును'' అన్నాడు అమాయకంగా. తాను ఉద్యోగం వేయించగలిగినంత గొప్పవాడిగా భావింపబడడం శ్యామలరావుకి కొత్తగా వుంది. నవ్వుకున్నాడు. ''విశాఖపట్నంలలో ఉద్యోగాలు సులువుగా దొరకవు దద్ద బాబూ!'' అని చెప్పాడు

''ఎందుకు దొరకవు బాబూ? తమరు శ్రమ తీసుకోవాల-అంతే! తమరెలాగా అక్కడే వుంటారు కదా. మీ చిన్నప్పటి నేస్తం కోసం, ఈ పాటి సాయం చెయ్యండి. తమ గెడ్డం పుచ్చుకుంటాను.'' పుచ్చేసుకున్నాడు కూడా చెయ్యి తియ్యటి వాసన వేసింది శ్యామలరావుకి. జిడ్డుగా కూడా తగిలింది గెడ్డానికి.

''నేను విశాఖ పట్నంలో కాదండీ ఉండేదీ! హైదరాబాదులో ప్రాక్టీసు పెట్టా లనుకుంటున్నాను' అన్నాను అతని చేతిని సున్నితంగా తొలగిస్తూ.



''అయ్యో. హైదరాబాదా? మరేం.... రాజులు పాలించిన దేశం. ఉద్యోగాలు అక్కడ తప్పకా దొరుకుతాయి. మనవాడు తక్కువ చదివాడా....? స్కూలు ఫైనలు పేసయ్యాడు గదా!''

శ్యామలరావుకి ఒక ఆలోచనొచ్చింది.

నెమ్మదిగా సాహూకి తర్ఫీదు చేసి తన గుమస్తాగా వుంచుకుంటేనో? ఉభయత్రా బావుంటుంది. నిజానికి ముందుగా బాగా జిత్తులు తెలిసిన గుమస్తానే వేసుకోవడం వ్యాపార లక్షణం గానీ తాను ప్రాక్టీసు పెట్టేది, వ్యాపారం కాదు గదా? హాబీ! సాహూకి గుమస్తా గిరీ హాబీ! అంత మాత్రాన తమ మధ్య స్నేహం దెబ్బ తింటుందన్న భయం లేదు. ఇద్దరూ సరి పెట్టుకునే స్వభావం గలవాళ్ళే! సాహూ తనతోనే వుంటాడు. 'రాసొమల్లై' లు చేయించుకు తినొచ్చును కూడా. శ్యామల రావుకి నవ్వొచ్చింది.

ఇంతలో సాహూ మెట్లెక్కి రావడం కనిపించింది.

తండ్రీ కొడుకు లిద్దరూ ఒరియాలో కాసేపు మాటాడుకున్నారు.

"భొల్లో, భొల్లో" అంటూ జూధిష్ఠిరో కుర్చీలోంచి లేచాడు.

"సాహూ! ప్లీడరు గుమస్తా చేస్తావా నా దగ్గర?" నవ్వుతూ అడిగాడు శ్యామల రావు.

"క్రిషి..." [illegible] అంటూ [illegible] "ఏం బాబూ! తమ దగ్గరా?" అని [illegible] వృద్ధుడు.

"ఏం, సాహూ, మాటాడవేం?..." రెట్టించాడు.

"నాకేం తెలీదుగా, ఆ పేపీలు-వ్యవహారాలు." ఊహించని వ్యవహారాన్ని తట్టుకోలేక నఱుగుతూన్న సాహూని మధ్యలోనే ఆపాడు శ్యామలరావు. "అవన్నీ నేను నేర్పిస్తాన్లే!" అంటూ.

"నేర్పిస్తారు. నీకెందుకురా? బాబుగారు చెప్పిన పని చెయ్యి-అంతే. కదుబాబూ!" అడిగాడు జూధిష్ఠిరో సంబర పడిపోతూ.

"ఆగండాగండి, అప్పుడే అంతా అయిపోయినట్టు సంబర పడిపోవద్దు.... నే నింకా పట్టా పుచ్చుకోవాలి....చాలా వుంది." అన్నాడు నవ్వుతూ. "అసలు సాహూ అభిప్రాయమేవిటో అని అడిగాను."

"అది మొహం. అభిప్రాయమేంటి? అలాగేను బాబూ! తప్పకుండా! తమ రెప్పుడు రమ్మని పిలుస్తే అప్పుడు వాడు రెడీగా వుంటాడు" సాహూ తరపున హామీ యిచ్చేశాడు తండ్రి. మరేమీ అడ్డం చెప్పొద్దని కొడుకుమీద కేకలు వేసి. కిందికి దిగిపోయాడు.

రసమల్లైలు ఇద్దరూ పూర్తిచేసేసి మరో గడియసేపు పిచ్చాపాటీ మాటాడుకున్నాక శ్యామలరావు, సాహూ దగ్గర్నుండి బైటి కొచ్చేశాడు. పగలు పదకొండు గంటల యింది అంటే నిజానికి భోజనం వేళే. కానీ పొట్టనిండా లడ్డూలు, రసగుల్లాలూ నిండిపోయాక... భోజనం మీద మనసు లేదు, అలా నడుచుకుంటూ ఊరి బయటి దాకా వెళ్ళాడు ఏం తోచక.




ఒరిస్సాకీ, ఆంధ్రాకీ బోర్డర్లో వున్న చిన్న పంచాయితీ పల్లెటూరు తమది. అందంగా వుంటుంది. ఎలక్ట్రిసిటీ డిపార్టుమెంటు వాళ్లు నాలుగు స్తంభాలు నాటేసి ఆగ్రామాన్ని చెరిచారు గానీ. అవి మినహా చూస్తే మరే నాగరపు పోకిరీ పోకడలూ లేవి అమాయకమైన నవరపిల్లలాంటి పల్లెటూరు అది.

బట్టవిప్పుకు నిలబడ్డ ప్రకృతిని చూస్తే శ్యామలరావుకి సరదాగా, గిలిగింతగా వుంటుంది. అంత అమాయకంగా పట్టుబడిపోయే సౌందర్యం, ఒక్క పల్లె పట్టుల్లోనే దొరుకుతుంది కూడా. చిన్న ఈల పాట పాడుతూ దొంగ గడ్డ' వైపు నడిచాడు. అదొకచిన్న కొండ కాలువ. సందు గొందులు తిరిగి ప్రవహిస్తూ ఆప్రాంతాల పల్లెలన్నింటికీ మంచి తీర్థాన్ని ప్రసాదించే కాలువ. ఆ కాలవ మలుపులో కొండకి కొంచెం పక్కగా పూర్వం ఎప్పుడో దొంగలు కాపు కాసేవారట. ప్రయాణికుల్ని దోచుకునే వాళ్ళట అందుకని ఆ కాలవకి 'దొంగ గెడ్డ' అని నామకరణం చేశారు.

స్నానం చేసుకోవాలనిపించింది చల్లగా!

ఆలోచన రావడం తడవు ఒడ్డు మీద నుండి నీళ్ళల్లోకి ఒకచే కుప్పిగంతువేసి, మొలబంటి నీళ్ళలో దిగబడ్డాడు.

స్నానం చేస్తుంటే హాయిగావుంది. చిన్నప్పుడు ఈ కాలవలో ఎన్నిమార్లు జలగండాలు తప్పించుకున్నాడు తను!

ఆ రోజుల్లో మరింత రాళ్ళమయంగా వుండేది. ఈ ప్రాంతం నీళ్ళల్లో మునిగి పోయి ఈతకొట్టటం తనకి సరదా. అలా ఈదడంలో ఎన్నిమార్లు రాళ్ళకి తలగుద్దు కునేవాడతను.

సుఖంగా ఆ రోజుల్ని నెమరు వేసు కుంటూ నీళ్ళల్లో మునిగిఈదుతూ స్నానం లోని ఆనందాన్ని పొందుతున్నాడు శామల రావు. ఊపిరిబిగబట్టి మునిగిపోయి. శక్తి కొద్దీ ముందుకి ఈదుతూ. అలిసిపోయి తలెత్తి ఊపిరి గుండెలనిండా పీల్చుకొని మళ్ళీ ఈద సాగాడు.

కెవ్వుమని కేక వినిపించింది.

తలమెత్తగా దేవికో తగిలినట్టు తోంచిది. గభాల్ని లేచి నిల్చున్నాడు శ్యామలరావు.

చౌదరాణీ!

ఒంటిమీద ఒక్కబట్టలేకుండా స్నానం చేసుకుంటూంది.

మునిగిపోయి ఈదుకొస్తూ మలుపు తిరగడంలో ఈ అమ్మాయిని శ్యామ లావు గమనించలేదు. వెనుకనుంచి శ్యామలరావు తల తనని తాకగానే తుళ్లి పడింది చౌదరాణి.

ఎదురుగా శ్యామలావు నిలబడగానే కంగారుగా నీళ్ళల్లో మునిగిపోయింది మెడదాకా శరీరాన్ని దాచుకుంటూ. గానీ స్వచ్ఛమైన నీళ్లల్లోంచి ఆమె శరీరం అల్లి బిల్లిగా కనిపిస్తూనేవుంది. భయపడుతూన్న ఆకళ్ళనూ, కోపగిస్తున్న పెదాలనూ, చలితో వణుకుతూన్న ఆ శరీరాన్ని ఎంత ప్రయ త్నించినా చూడకుండా ఉండలేక పోయాడు. ఆ పరిస్థితిలో చౌదరాణీని చూస్తే ఎందుకో నవ్వొచ్చింది కూడా.

"ఏం బాబూ చూసుకోరూ" రంగా రావు బహద్దరు వారి ఏకైక పుత్రుడి మీద కస్సుమనే ధైర్యం చాలకపోయిన బేల తనం వినిపించింది కంఠంలో.

"నిజంగానే చూడలేదు చౌదరాణీ! ఏం అనుకోక..." అన్నాడు. చూడక

వెటర్నరీ డాక్టర్

● పశుదేవుడు.

ఈయనలో పశు(శ)త్వం వుందో లేదో తెలియదుగానీ అనారోగ్యంగా వున్న పశువులన్నీ 'అంబా' అంటూ ఈయన్ని అప్యాయంగా పలుక రిస్తాయి. వాడి పరీక్షకు యివి తోకలు, వెనుక కాళ్లూ (అవసరమైతే తంతాయి కూడా) అందిస్తాయి. (వాటికాళ్ళ తాపుడికి ఎన్నిమార్లు క్రింద పడితే అంత అప్యాయత ఈయన మీద పశుపేషంట్లకి.)

పోయినందుకు రెండు విధాలా విచారిస్తు న్నాడు. విచారిస్తూ, చూస్తూ అలా నిల్చు న్నాడు. ఆ మాట అని, ఇక అక్కడుండ కుండా అతను వెళ్ళిపోతాడని ఆశించింది. కానీ అదే పనిగా తనని చూస్తాడనుకో లేదు. గొంతులోని కోపం చన్నీళ్ళకి తడిసిపోయి సిగ్గుగా మారి మొహంలో జిగేలుమంది. ఆ వసంతంలో అనుకో కుండానే పెదాలు చిరునవ్వు పువ్వులు దొడిగాయి

ఆమె సిగ్గు పడడం చూసేంత వరకూ శ్యామలరావుకి జ్ఞాపకమే రాలేదు సిగ్గు.... అక్కడుండడం అభావ్యం అనిపించి గిరుక్కున వెనక్కి తిరిగాడు. నీళ్ళలో ఈదుకుంటూ వెళ్ళి మలుపు తిరుగుతూ న్నప్పుడు మనసు పట్టలేక మరో మారు వెనక్కి చూశాడు కడుపు దాకా శరీరాన్ని నీళ్ళలోంచి పైకి తీసి, తనవైపే చూస్తున్న ఛౌదరాణి-అలా తను వెనక్కి చూడగానే మళ్ళా చాపలాగా దాచుకుంది శరీరాన్ని.

నవ్వుకుని, తాను బయల్దేరిన రేవుకి తిరిగొచ్చాడు శ్యామలరావు. తాను తప్పు చేశాడా అనిపించింది. కాని తనేం చూసి దీ కొట్టలేదు కదా? అందునా, ఈ మిట్ట మధ్యాహ్నం వేళ ఒక ఐవింటి ఆడపడుచు, ఇలా నగ్నంగా కాలవలో స్నానం చేస్తుం దని తనేం కల గన్నాడా? ఛౌదరాణీకి ఈ బుద్దెందుకు పుట్టింది?....ఇలా స్నానం చెయ్యవలసిన అవసరమేం కలిగింది?.... ఏమో! కానీ చాలా అందంగా వుంది, సభ్యత తలపైనా లేకుండా తనని మంత్రం వేసి నిలపెట్టేసినంత మరో అందం ఆమెలో వుంది. ఎందుకూ కొరగాని అందం.

సాహూ పినతల్లి కూతురు, ఛౌదరాణి.

మొగుడు పిచ్చెత్తిపోయి ఎటు పోయాడో యిప్పటికీ తెలీదు....ఏడాది కొడుకుతో పుట్టిల్లు చేరుకుంది. పంచాయతీ ఎన్నికల్లో ఎవరో యిళ్ళకి నిప్పు పెట్టి నప్పుడు - ఏమీ ఎరగని ఛౌదరాణి తల్లీ, కొడుకు మంటల్లో కలిసి పోయారు.... అప్పటి నుండీ పెద్దమ్మగారి యింట్లోనే. ఇంత కథగల ఈ పిల్ల వయసు పద్దెనిమి దేళ్ళకి మించదు. మొగుడున్న వితం తువు....

డాక్టర్ ———

 దేవదూత,

(నాడి పరీక్షించి వ్యాధి చెప్పువారు.పాపులేషన్ కొరత తీరేందుకు భగ వంతుడు నియమించిన దూత. మానవత్వం వున్న మహామనిషి అని ప్రతీతి గల వ్యక్తి (బిల్లు ఎంత ఎక్కువేస్తే అంత గొప్ప పేరు)

ఒడ్డెక్కి ఇంటివైపు నడుస్తూన్న శ్యామలరావుకి, తడిబట్టలతో ఒళ్ళంతా బరువుగా వుంది. 'ఛౌదవీ కా చాంద్' లాగావుంది ఛౌదరాణి.

తలపుల్లో తనని ఛౌదరాణి అందం వెన్నంటుతోంది. తనకి కూడా అందమైన భార్య దొరుకుతుందా? అందం కూడా వుంటే బావుంటుంది. అదేం విచిత్రమో ప్రతి వాడికీ అందం మీదనే మనసుంటుంది. తానెంత వికారంగా ఉన్నదీ తనకు తెలీదు. తెలుసుకోడు. గాని తనకి కావలసింది మాత్రం మనోహరంగా వుండి తీరాలి.

శ్యామలరావుకి ఉండి తీరక్కర్లేదు.

ఉంటే మంచిదే కాదనడు.

గానీ ఉండి తీరవలసింది మాత్రం ఒకటుంది.

ఓటుతనం

రోగం

నిరాశ!!

## 5

ఆ రోజు సినిమానుండి తిరిగొస్తూండగా సరోజనికి హిస్టీరియాతో ఫిట్స్ వచ్చాయి రిక్షాలోనే మొదలయ్యాయి. మోహన్ జీవితంలో మొదటిసారి ఫిట్స్ చూశాడు. సరోజనికి ఫిట్స్ రావడం మొదటిసారి చూశాడు.

మాటాడుతూ మాటాడుతూనే హఠాత్తుగా మౌనం దాల్చింది. సినిమా కాస్త విషాదంగా వుంది, అందుకని సరోజని మూడీగా వుంది అనుకున్నాడతను. ఉన్నట్టుండి అతని చెయ్యి గట్టిగా పట్టుకుంది. ఆ పట్టుకోవడం అసహజంగా, రాక్షసంగా తోచడంతో సరోజనిని జాగ్రత్తగా పరిశీలించబోయాడు. ఇంతలోనే మెలికలు తిరిగిపోతూ పడిపోతోంది సరోజని దవడలు గట్టిగా బిగపట్టి, ఎడమచేతి పిడికిలి బిగించి, వెనక్కి విరుచుకపోసాగింది. అదేఁవిటో, ఎందుకిలా అయిపోతోందో కనీసం తెలియనైనా తెలీదు మోహన్‌కి. బుజ్జిగాడు అరిచాడు. "ఫిట్స్. అమ్మ బాబోయ్ రిక్షా .. త్వరగా తొక్కు....." అని వెర్రికేక వేశాడు.

ఇల్లు చేరుకునే లోపున, సరోజనిని పట్టలేక నిజంగానే మోహన్ అలసిపోయాడు. అంత బలం సరోజని కెక్కడిదో ఆశ్చర్యం వేసింది. రిక్షా ఆగగానే బుజ్జి లోపలికి పరిగెత్తాడు. గింజుకుంటూన్న సరోజని కష్టంగా చేతుల్లోకి తీసుకొని లోపలికెళ్ళాడు మోహన్.... ఇంతలోనే కాంతమ్మ, సీతాపతి ఎదురుగా వచ్చారు.

కూతురు ఫిట్సుతో విరుచుకు పడిపోవడం చూసి శోకాలు మొదలు పెట్టబోయింది కాంతమ్మ. సీతాపతిగారి గదమాయింపుతో పాపం నోరు నొక్కుకుని, మోహన్‌కి సాయం పట్టింది. ఇద్దరూ

లోపలికి తీసుకెళ్ళి మంచం మీద పడుకో పెట్టారు.

"సినిమాలకి వెళ్ళొద్దని చెప్పాడు గదా డాక్టరు? మెంటల్‌గా ఏపాటి శ్రమ కలిగినా ఈ దరిద్రగొట్టు రోగం వొస్తూనే వుంది. తెలిసి-తెలిసి పంపావు. మళ్ళీ ఏడు పెందుకు-నోరు మూసుకు పడు" అంటూ సీతాపతి, సరోజనికి గాలి తగిలేట్టుగా ఫేను పెట్టాడు. బుజ్జి గబగబా లోపలికెళ్ళి గ్లాసుతో చన్నీళ్ళు తీసుకొచ్చాడు. కాంతమ్మ ఆ నీళ్ళు అందుకొని సరోజని మొహం మీద కొంచెం జల్లి, కళ్ళు తడితో తుడిచింది. సరోజని అపస్మారకంగా మంచం మీద కొట్టుకుంటూంది ఎంత ప్రయత్నించి పట్టుకున్నా కాళ్లు-చేతులు వెనక్కి విరుచుకుంటుంది. మోహన్‌కి చాలా కంగారు వేసింది. ఇదేం జబ్బు? ఇంత హైరాన ఏఁవిటి? ఇలా ఎంతసేపు గింజుకోవాలి రోగి?

కానీ యిదంతా చాలా మామూలుగా తీసుకుని, ఇంతకు ముందు ఎన్నో మార్లు యిలా కావడం అనుభవమైనట్టే ప్రవర్తిస్తున్న కాంతమ్మని, సీతాపతి చూస్తే మరింత ఆశ్చర్యం వేసింది మోహన్‌కి.

మంచం మీదనుండి తుళ్ళి పోతున్న సరోజనిని అదుపులో పెట్టడానికి సీతాపతి,

మోహనూ శాయశక్తులా తంటాలు పడు తూనే వున్నారు, కాంతమ్మ మొహం మీద నీళ్ళు జల్లుతూనే వుంది. కానీ రాను రాను మరింత ఉదృతం తాసాగింది.... నోట్లోంచి చొంగలు కూడా వొస్తున్నాయి. సీతాపతి కాంతమ్మనీ ఆపలేక పోయాడు. ఆవిడ వెక్కి వెక్కి ఏడవసాగింది. గంట దాటిపోయింది. కాపీ స్పృహ రాలేదు సరోజనికి.

కంగారుగా అక్కడనుండి లేచి ఒచ్చేసాడు సీతాపతి.

"ఏఁవిటిది? ఇంతసేపు ఎప్పుడూ లేదే!" అంటూన్న అతని స్వరంలో నీరసం. భయం ధ్వనించడంతో మోహన్‌కి మరీ గాభరా లావైపోయింది.

"ఏఁవిటి మాఁవయ్యా?... ఏఁవిటిది?" అమాయకంగా అడిగాడు

మోహన్‌ని సీతాపతి చూశాడు. గుండె కలుక్కుమంది.

"నాయనా, మోహన్! అర్జంటుగా పోయి ఎవరైనా డాక్టర్ని తీసుకురావూ?" అని ప్రాధేయ పడ్డాడు.

"అదేఁవిటి?....తప్పకుండా తీసుకొస్తాను. నిముషంలో వొస్తాను." మాట పూర్తి కానీయకుండానే రోడ్డుమీద వాలాడు. తోవలో వెయ్యి దేవుళ్ళకి మొక్కుకున్నాడు. తన సరోజనికేమీ కాకూడదని.

ఒక డాక్టరు యింట్లో లేడు.

మరో డాక్టరు నిద్ర పోతున్నాడు, లేవడు

ఇంకో డాక్టరు మాత్రం మోహన్ పడుతూన్న కంగారు చూసి జాలిపడి బయల్దేరాడు. "అయినా ఫిటుక్సి, హిస్టీరియాకీ ఆవాల్సిదేఁవుందండీ? రోగిని అల్లకల్లోలం చేస్తుంది తప్పిస్తే. ఏదో ప్రమాదం మాత్రం ముంచుకు రాదు.... ఊరికే కంగారు పడుతున్నారు మీరు .." అంటూ రిక్షా క్కాడు.

ఈ సరికి యిరుగు పొరుగువాళ్ళు కూడా సరోజని మంచం చుట్టూ నిల్చున్నారు. డాక్టరుని చూపి తోవిచ్చారు. ఇంకా అలాగే చుట్టుకుంటూంది సరోజని. ఈ మారు మూలుగుతోంది కూడా.

డాక్టరు చాలా త్వర త్వరగా ఏదో ఇంజెక్షనిచ్చాడు

"డిస్టర్బ్ చెయ్యకండి-నిద్ర పోతుంది. మరేం కంగారు లేదు" అంటూ రెండు మాత్రలు మోహన్ చేతికిచ్చాడు. స్పృహ వచ్చాక ఆ మాత్రలు వెయ్యమని చెప్పి వెళ్ళిపోయాడు.

"మహ మాయదారి రోగం!" పక్కింటావిడ బాధ పడింది.

"మా పెద్దక్క కూతురు లేదూ.... వసంత! దానికీ హిస్టీరియావే! పాపం, చచ్చిపోయింది బాధ పడలేక." మరో యిల్లాలు కథ చెప్పింది

"పాపం, బతుకంతా బాధే గదా! ఏం

పాపం చేసుకుందో.... ఇంకా పెళ్ళి పెటా కులు కావలసిన పిల్ల... ''

''ఔను. పాపం మరే! అల్లా సైలరు మరదలు 'నసీం'కి ఈ జబ్బు వల్లనే పెళ్ళి కాలేదట అప్పట్నుండీ ఆ కొంప ఇలా రోగం కొంప అయిపోయింది.''

''మీరిక యిళ్ళ కెళ్ళండమ్మా! పిల్ల నిద్ర పోతోంది.'' బోలెడంత ప్రయత్నం చేసి మర్యాదగా చెప్పాడు సీతాపతి. ఆడం గులు మరి మాటాడకుండా అక్కడ్నుండి కదిలారు. కాంతమ్మకి కన్నీరాగలేదు.... ఆ పరామర్శలు వింటుంటే, మోహన్‌కి మంట నెత్తికెక్కింది వాళ్ళని చూస్తుంటే ఒక్క సీతాపతే ఉదాసీనంగా ఉన్నాడు. ఎందుకంటే, మరి పాపం వాళ్ళన్నది నిజమే గదా! అసందర్భంగా లేదుగా!

చంపక, ఉంచక నానాయాతన పెట్టే రోగంతో జీవితాంతం బాధ పడవలసిన కూతుర్నిచ్చాడు భగవంతుడు. నిజమే, ఎవరు చేసుకుంటారు సరోజినిని? ఎవరికి ఈ బరువు కట్టబెట్టి ఎవరి ఉసురు పోసుకో గలడు తను?

మరి కొద్దిసేపట్లో యింజక్షను పని చెయ్యడం ప్రారంభించింది. పిడికిళ్ళు కొంచెం-కొంచెం వొదులు కాసాగాయి. మరో పావు గంటలో శరీరం పూర్తిగా సరోజిని స్వాధీనంలో కొచ్చింది విరుచు కోవడం తగ్గి నిదానంగా నిద్ర పోతు న్నట్టు కనిపించింది సరోజిని

''సరోజినీ!'' పిల్చాడు మోహన్.

''అమ్మా! సరోజినీ....'' కంగారుగా ముందుకు వంగింది కాంతమ్మ కానీ ఉలుకూ-పలుకూ లేకుండా పడుకుంది సరోజిని.

(సశేషం)

## క్లబ్ టాక్

భార్య: మా ఆడవాళ్ళ క్లబ్బులో వున్నంత సేపూ భర్తల్ని గురించి తర్కించుకుంటాం!

భర్త: మామగవాళ్ళ క్లబ్బులో వున్నంతసేపూ భార్యల్ని మరచి పోతాం.

—టి. వి. సుబ్బారావు & కోటి, కాకినాడ-3.

# జపాను యాత్ర

ఈ మధ్య ప్రతి రోజు టెలిఫోన్‌లో మాట్లాడే ఒక స్నేహితురాలు "ఇండో-నిప్పన్ కల్చరల్ ఎక్స్చేంజి సొసైటీ వారు జపాన్ యాత్ర ఏర్పాటు చేస్తున్నారు. నేను వెళ్తున్నాను. మీరూవస్తే బాగుంటుంది" అంటూ నన్ను ప్రోత్సహించారు. ఆ విషయం విన్న మా వారు వారికి ఆఫీసు పనులవల్ల రావడానికి వీలు పడనందున "నీ ముఖ్యమైన స్నేహితులు వెళ్తున్నారు కనుక నీకు మంచి కంపెనీ వుంటుంది. తప్పక వెళ్ళు"మని మరింత ప్రోత్సహించారు. అలా ఈ యిద్దరి ప్రోత్సాహంతో ఆ సొసైటీలో మెంబర్‌గా చేరాను. ఆ తరువాత నాకు బాగా పరిచయస్తులు మరో యిద్దరు చేరారు.

వెళ్ళేది దూరదేశాలు.... మొదటిసారి. ఎంత కొత్త ప్రదేశాలయినా చదువు-సంస్కారమున్న పరిచయస్తులు, స్నేహితులు వున్నారు ఒకళ్ళ కొకళ్ళం సహాయంగా వుండి బాగా ఎంజాయ్ చెయ్యొచ్చని సరదా పడి నేనూ బయల్దేరాను. మా గ్రూపు మొత్తం పదహేను మంది. అందులో ఏడుగురు ఆడవాళ్ళం.

## కౌలాలంపూర్

ఒక సుముహూర్తాన మద్రాసులో ఉదయం ఎనిమిది గంటలకు విమానం ఎక్కాం. మా యాత్రలో మొదటి హాల్ట్ కౌలాలంపూర్. మధ్యాహ్నం సుమారు పన్నెండున్నర గంటలకు కౌలాలంపూర్‌లో విమానం దిగాము. ఏర్‌పోర్ట్‌నుండి తిన్నగా ట్రేడ్వింగ్స్‌వారు ఏర్పాటుచేసిన టాక్సీలలో సైట్‌సీయింగ్‌కు బయలుదేరాము. సువిశాలమైన అతి శుభ్రంగావున్న రోడ్లకిరు ప్రక్కలా అందమైన భవనాలు బజారులు తప్ప, జనసమ్మర్దంలేదు. కార్లు వేల సంఖ్యలో వెళ్తున్నా హారన్‌ల మోతలు వినలేదు. అసలు అక్కడి కార్లకు హారన్ అనేది వుండదేమో అనిపించింది. పెద్ద పెద్ద మనోహరమైన వనాలు, పార్కులు, తీర్చిదిద్దినట్లున్న రబ్బరుతోటలు, అన్నీ వింతగా చూస్తూ తన్మయిత చెందాము. ప్రశాంత వాతావరణం లావుందా కౌలాలంపూర్ మద్రాసునుండి వెళ్ళిన మాకు. ఆలా సాయంత్రం వరకు సిటీలోను, చుట్టుప్రక్కలంతా చూపించి మాకు బస ఏర్పాటుచేసిన చక్కని పెద్ద హోటల్‌కు చేరుకుని, ఆ రాత్రికి అక్కడవుండి మర్నాడు ఉదయం విమానంలో బాంక్

కాక్ వెళ్ళాము. అక్కడ రెండు రోజు లున్నాము.

### బాంక్ కాక్

బాంక్ కాక్ లో ఫ్లోటింగ్ మార్కెట్ చూడదగినది. నదిలో బోటులో వెళ్ళాలి ఆ మార్కెట్ కు. ఆ బోటు ప్రయాణం ఆహ్లాదకరంగా వుంటుంది. నది మధ్య బోటులో వెళుతూంటె ఇరుప్రక్కల చెక్కలతో నీటిలో నిర్మించిన యిళ్ళు వింతైన దృశ్యం. అక్కడే చక్కని బోటలు భవనాలు ఎవరికి తగినట్లు వారు నిర్మించుకుని నివసిస్తున్నారు. బోటులో వెళ్లే మమ్మల్ని చూచి ఆ ఇరుప్రక్కల ఇళ్ళలోని థాయిలాండ్ ప్రజలు పిల్లలు పెద్దవారు కూడ చిరునవ్వులతో స్నేహ పూర్వకంగా చేతులూపుతూండే వారు. మేమూ పోటీపడ్డట్లు స్నేహపూర్వకంగా వారికి విష్ చేస్తూ పోతూండేవాళ్ళము. అదొక వింతైన అనుభవం మాకు. దాదాపు మూడు మైళ్ళదూరం అలానదిలో వెళ్ళాక బోటునుండి దిగి కొయ్యదుంగల మీదుగా దాటితే అక్కడే ఫ్లోటింగ్ మార్కెట్. అదొక పెద్ద షాపింగ్ సెంటర్ చూడటానికి చాల బాగుంది. ఆ మార్కెట్ కూడ నదిలో నీటిమీద నిర్మించినదే. ఆ ప్రాంతాలు తయారుచేసిన బొమ్మలు అనేక రకాల వస్తువులూ దొరుకుతాయి. కొంత సేపు ఆ మార్కెట్టంతా చూచి, తిరిగి బోటులో సిటీకి చేరాము. సిటీలో పురాతన బౌద్ధ దేవాలయాలు, పరిసర ప్రాంతాలు చూచాము. ఆ మరునాడు అక్కడ అగ్రికల్చరల్ డే, చాలా ఆఫీసులకు శలవు దినమట ఆరోజు. మన ఏరువాక పౌర్ణమి లాగన్నమాట. ఆదేశపు రాజుగారి పర్యవేక్షణలో పూజచేసి ఏరువాక సాగుతారు. విదేశీయులమైన మాకు దగ్గరకు వెళ్ళి ఆ వుత్సవం చూచే అవకాశం యిచ్చారు వారు.

### తైపే

ఇవన్ని చూచుకొని మూడవరోజు సాయంత్రం జపాను వెళ్ళడానికి ఏర్ పోర్ట్ కు చేరాము. మేము ఎక్కిన విమా

యస్. సుగుణాదేవి

నం ఆరోజు ఫ్లైట్ డిలే అవటంవల్ల తిన్నగా జపాన్ వెళ్ళలేదు. రాత్రి పన్నెండు గంటల తర్వాత విదేశాల నుండి వెళ్ళే విమానాలు జపాన్ లో దిగ కూడదనే నియమం వున్నదట. అందు వల్ల మేము ప్రయాణంచేసే విమానం తైపేలో ఆపారు. తైపే ఏర్ పోర్ట్ చూడ వలసిందే కాని చెప్పనలవి కానంత అద్భుతంగా వుంది. విమానంనుండి దిగి నడిచిగాని, బస్సులోగాని ఏర్ పోర్ట్ భవనంలోకి వెళ్ళనవసరంలేదు. విమానంలో కాలు తిన్నగా ఏర్ పోర్ట్ భవనంలో

పెట్టడమే అలాంటి ఆ ఏర్పాటు చాలా బాగుంది. ఆ భవనంలో నేలంతా చక్కని మెత్తని, పెద్ద పెద్ద కార్పెట్లతో నింపి వుంది. ఏర్‌లైన్స్‌వారు మాకా రాత్రి బస యిచ్చిన హోటల్ భవనంచూచి ఇది మహేంద్రలోకం కాదుగదా అని ఆశ్చర్య పోయాము అందమైన నగిషీ పనులతో ఆ బిల్డింగంతా భూతల స్వర్గంలావుంది. మాకు ఫ్లయిట్ డిలే అవడం కేవలం మాకా ప్రాంతాలు సందర్శించే ప్రాప్తి ముండుటవల్లనేనని సంతోషించ గలిగాము. ఆ ఆనందం నిండిన మనసులతో మర్నాడు వుదయం బయల్దేరిన విమానంలో పదిగంటలకు జపాన్‌లోని ఒసాకాకు చేరాము ఒసాకాలోని "ఇండోనిప్పన్ కల్చరల్ ఏక్స్ఛేంజి సొసైటీవారు ఇండియా నుండి కల్చరల్ డెలిగేట్సుగా వెళ్ళిన మమ్మల్ని ఏర్‌పోర్ట్‌నుండి క్లైవారి కార్లల్లో వారివేదాంత సొసైటీకి తీసుకువెళ్ళారు. అక్కడ మేము వారంరోజు లున్నాము. వారు మమ్మల్ని చాలా ఆదరాభిమానాలతో చూచి అతిధి మర్యాదలు చేశారు. ఆ రోజు సాయంత్రం మాకు వెల్‌కమ్ పార్టీ యిచ్చి ఫోటోలు తీసుకున్నారు. రుచి కరమైన వంటలతో మంచి డిన్నర్ యిచ్చారు. తర్వాత రోజుకో ప్రాంతానికి సైటీసీయింగ్‌కుతీసి కెళ్ళేవారు క్యోటో, నారా రోబే, ఎక్స్‌పో 70 ప్రదేశం, అలా చుట్టు పట్ల చూడదగిన ప్రదేశాలకు హిల్‌స్టేషన్‌లకు, బౌద్ధారామాలకు తీసుకెళ్ళారు. నారాలోని అమితబుద్ధదేవాలయం చాలా బాగున్నది. చలవరాతి కట్టడాలతో పెద్ద పెద్ద కారిడార్స్‌తో ప్రశాంతంగా వుంది ఆ దేవాలయ వాతావరణం ఆ బుద్ధ భగవానుని విగ్రహం చాలా ప్రశాంతంగా భక్తిభావాన్ని కలుగజేస్తూవుంది.

అలా సైట్ సీయింగ్‌కు వెళ్తున్నప్పుడు అక్కడి టూరిస్టు బస్సులు ఆకర్షణీయంగా వుండేవి. గైడ్సు ఎక్కువ మంది స్త్రీలు వారులౌడుస్పీకర్లతో ఆ ఎ. సి. బస్సులలో ఆ యా ప్రాంతాల జనాబాను పరిసర ప్రాంతాలను వివరిస్తూ వర్ణిస్తూ, కబుర్లతో జోక్సుతో చిరునగవుతో తలవూగిస్తూ సరదాగా చెప్పుకు పోతుండే వారు మధ్య మధ్య జపాను భాషలో జానపద గేయాలు తియ్యగాపాడు తుండే వారు. ముచ్చటైన డ్రస్సులో చిరునవ్వుతో తమాషాగా తలవూగిస్తూ వారు వివరిస్తుంటే వాళ్ళనలాగే చూస్తుండాలని పించేది. కోబే వెళ్ళేప్పుడు ఎత్తైన కొండలపై బస్సు వెళ్తుంటె చలి. పొగ పొగమంచు వున్నప్పటికి చుట్టూ మనోహరమైన ప్రకృతి దృశ్యాలు చక్కని నీటివాగులు, సుభ్రమైన రోడ్లుచూచి తీరాల్సిన దృశ్యాలు కోబేటవర్ ఎక్కితే. సిటీ అంతా చూడవచ్చు. చుట్టూ సముద్రం, హార్బర్ దగ్గరాలన్నీ కనిపిస్తాయి.

కొండల ప్రాంతాల టర్నింగ్స్ వద్ద, మిగతాచోట్ల రోడ్ల జంక్షన్స్‌లోను ఎత్తైన స్తంభాలకు పెద్ద గుండ్రని అద్దాలు అమ

ర్చి వుంటాయి. అద్దాలవల్ల వచ్చే పోయే కార్లు లారీలు, బస్సులు మొదలైనవి డ్రైవ్‌చేసే వారికి స్పష్టంగా కనిపిస్తాయి. అందువల్ల హారన్ వేసే అవుసరంగాని ఏక్సిడెంట్లు జరిగే అవకాశంగాని వుండదు. ఎంత ట్రాఫిక్ వున్నప్పటికి ప్రయాణాలు సునాయాసంగా సాగుతాయి. మన ఇండియాలో కూడా ఇలాటి మంచి ఏర్పాట్లుంటే డ్రైవర్లకు సౌకర్యంగావుండి ఏక్సిడెంట్లు తగ్గుతాయి. మా గ్రూపులో వచ్చిన తెలుగువారిలో శ్రీ కృష్ణంరాజు గారు, రఘురామయ్య గారు కూడా బస్సు లోని గైడ్సుతో పోటీగా సరదాగా పాటలు పాడుతుండే వారు.

ఒసాకాలోని టెలివిజన్ స్టేషన్‌కు వెళ్ళాం. ఒకరోజు టెలివిజన్ సెట్టును గురించి అక్కడ పనిచేసే ఆడపిల్లలు వివరించి చెపుతూంటే అంతచిన్న వయసులో ఎంత విజ్ఞానం సంపాదించేరు అని ఆశ్చర్యపోయాం. అప్పటి ప్రోగ్రాం ఒక కామెడీ డ్రామా, డాన్సులు చూచాము అక్కడ. జపానులోని గ్రాడ్యుయేట్సు క్కూడ ఇంగ్లీషు చదవడం వ్రాయడమే గాని మాట్లాడటం అంతగారాదు. మాట్లాడినా వారి ఉచ్ఛారణ మనకు బాగా అర్థం కాదు

ఆరోగ్య విషయాల్లో వారు తీసుకునే శ్రద్ధలో పాదరక్షల నియమం గమనించ తగినది. బయట తిరిగే పాదరక్షలు ఇంటి లోకి తేకుండా బయట గుమ్మం వద్దవదిలి వేరే పాదరక్షలతో ఇంట్లో ప్రవేశిస్తారు. ఇంట్లో తిరిగే పాదరక్షలను బాత్‌రూంకు వాడరు. అవివేరు. ఈ నియమం ప్రకారం వారు అతిథులకు కూడా వారే పాదరక్షలు ఏర్పాటుచేస్తారు. హోటళ్ళలో పాదరక్షలు నైట్ డ్రస్సులు ఎవరిగదుల్లో వారికి రెడిగా వుంటాయి

వేదాంత సొసైటీలోని వారు మన వంటలు నేర్చుకోవాలని ఉబలాటపడగా కొన్ని వంటలు చేసి చూపించాము. వారెక్కువ సముద్రంలో దొరికే జలచరాల మాంసం తింటారు. రైస్ బాగానే వాడుతారు మా గుంపులోని శాకాహారులకు

భోజనం ఆ సొసైటీలో తప్ప మిగతా ప్రదేశాలల్లో కొంచెం ఇబ్బందిగానే వుండేది పెరుగు. నెయ్యి లాటివి దొరకడం కష్టం. రైస్ అన్ని చోట్ల బాగానే దొరుకుతుంది.

జపానులో స్త్రీలు పురుషులు కూడా వంగి నమస్కరిస్తూ అతిమర్యాదగావుంటారు. అక్కడి ఇళ్ళెలా వుంటాయో చూడాలని మేము కోరగా మమ్మల్ని సొసైటీ వారు ఒకయింటికి తీసుకెళ్ళారు. అంతా చెక్కలతో నాజూకుగా నిర్మించిన ఆ యిల్లు అందంగావుంది. అన్ని గదులు, తోటలు చూపించారు ఆ యింటివారు. ప్రతిఇంట్లో బొమ్మలతో, పువ్వులతో డ్రాయింగు రూం. మిగతా గదులు కూడా చాలా అందంగా అలంకరించుకుంటారు. ప్రతి యింటి ముందు అందమైనతోట, శుభ్రంగా ఉట్టి పెట్టుకుంటారు. ఇవన్నీ మనదేశంలో మన యిళ్ళల్లో లేవి విషయాలనికాదు నేను చెప్పడం. మనతోట పెంపకం ఇంటి శుభ్రతలాటివి ఎక్కువ నౌకర్ల సహాయంతో చేస్తాం మనం. కాని వారు స్వయంగా కార్లు నడుపుకుంటూ ఉద్యోగాలు చేస్తూ ఇంట్లో వంట వగైరాలు చూస్తూ ఇన్ని పనుల మధ్య పనివాళ్ళ సహాయం లేకుండా ఇల్లు తోట అలా అందంగా నీటుగా మెయిన్‌టెయిన్ చేసుకోగలగడం అనేది అక్కడి స్త్రీల ప్రత్యేకత కదా మరి. అక్కడి స్త్రీలు అన్ని రంగాలలోను వుంటారు. నాగరికంగాను, అన్ని విధాల ఆదేశం అభివృద్ధికి కారణం అక్కడి ప్రజల పట్టుదల. తెలివి తేటలు. అన్ని పనులు అక్కడి స్త్రీలు చేయగలుగుతున్నారంటే అది వారిఓర్పును నేర్పును తెలియజేస్తున్నది. చాలా కష్టపడి పని చేస్తూ ఎప్పుడు బిజీగానే వుంటారువారు. తీరికగా కూర్చున్న స్త్రీలు లేరనేచెప్పాలి. అందువల్లనే మనదేశంలోని కొంతమంది స్త్రీల్లా చాడీలు చెప్పుకోవడం వానిని మూర్ఖంగా నమ్మి అహంకారంతో పిచ్చి పట్టుదలను పెంచుకోవడం, అసూయ. ద్వేషం అబద్ధాల దట్టంలాంటి అనాగరికమైన బుద్ధులకు అక్కడి వారికి తావులేదనిపించింది. నాగరికతనేది గ్రీ గీలవల్ల,డబ్బువల్ల వేషభాషలవల్లనేరాదు. జన్మంతః సంస్కారముండాలి. డిగ్రీలున్నంత మాత్రాన సంస్కార ముంటుందనుకోవడం కొంత మంది విషయంలో నేతిబీరకాయలోని నేయిలాటిదే పరస్పర సహకారం స్నేహ సౌజన్యాలు, సోమరితనం లేకపోవడం, వినయ విధేయతలు. మొదలైనవి జపాను స్త్రీలవద్దనుండి నేర్చుకోవలసిన సుగుణాలు.

మేము సైట్ సీయింగ్‌కు వెళ్ళినపుడు [illegible] స్కూలు పిల్లలు పిక్‌నిక్కు ఆ ప్రదేశాలకు వచ్చేవారు వారు [illegible] భాషలో బొద్దుగా ముద్దుగా [illegible] రంగులతో, [illegible] తో ముచ్చటగొల్పుతూండే వారు. మమ్మల్ని చుట్టుముట్టి ఫోటోలు, ఆటోగ్రాఫ్‌లు తీసు

కుని ధన్యవాదాలు తెల్పుతూ స్నేహపూర్వకంగా మాతో మాట్లాడాలని తాపత్రయ పడేవారు. కోపం, చికాకనేవి వారి ముఖాలలో కనిపించేది కాదు. ఆ దేశంగ అందరూకూడ చిన్న పిల్లలనుండి ముసలి వారి వరకు నవ్వు ముఖాలతో నవ్వుల పువ్వుల్లా కనిపించేవారు.

ఒసాకాలో వారంరోజులు అలా గడిచి పోయాయి. చివరి రోజు మాకు వేదాంత సొసైటీ వారు సెండాఫ్ పార్టీ యిచ్చారు. రుచికరమైన వంటలతో మంచి డిన్నర్ ఏర్పాటు చేశారు. ఆ పార్టీలో శ్రీ రఘురామయ్యగారు శ్రీకృష్ణ, సత్యభామ వేషాలతో మంచి పాటలతో అందర్నీ ఆనంద పరిచారు.

అటామీ

ప్రేమాభిమానాలతో కూడిన సొసైటీ వారి వీడ్కోలు పొంది ట్రయిన్‌లో బయల్దేరి అటామీ వెళ్ళాము. అక్కడి రైళ్ళు కూడ అతి పరిశుభ్రంగా రద్దీ లేకుండా వుంటాయి. అతివేగంగా పోయే ఆ ఏ. సి. రైళ్ళలో ఎంత దూరప్రయాణం చేసినా అలసటే తెలియదు. తలుపులు టైము ప్రకారం ఆటోమెటిగ్గా తెరుచుకోవడం మూసుకోవడం జరుగుతుంది. ట్రయిన్ లేటవటమనేది ఎరుగరు అక్కడి వారు. పంక్చ్యుయాలిటి అనే దానికి వారు చాలా ప్రాముఖ్యతనిస్తారు. టూరిస్టు బస్సుల్లోని గైడ్సు మేము సైట్ సీయింగ్‌కు వెళ్ళినపుడు బస్సులోని వారు ఎవరైన వారు చెప్పిన టైం ప్రకారం రాకుండా లేటు చేస్తే రానివారి కోసం వారు ఒకటి-రెండు నిమిషాల కంటె ఆగేవారు కాదు. అలా ఒకటి-రెండు చోట్ల గమనించాము.

చెప్పిన టైంకు రాకపోవడం వారి తప్పు. నా తప్పు కాదుగదా అనేది గైడు. అటామీ నుండి హకోనీ సుందర ప్రదేశాలన్నీ చూచాము. మరల ట్రయిన్‌లో టోకియో వెళ్ళాము.

టోక్యో

టోకియో మహా పట్టణంలో మేము

దిటర్నింగ్ పాయింట్

● ''మీకిష్టం లేని వస్తువులను వెంటనే వదిలేస్తే మీ మానసిక వ్యాధి నయమవుతుంది.'' అన్నది లేడీ డాక్టరు లేడీ రోగిని పరీక్షించి.

''విన్నారుగా - ఈ రోజు నుంచి వంట మీరు చేయండే ప్రయోజనం లేదు. లేకపోతే ఈ రోగం తగ్గదు....మీరు డబ్బు ఖర్చు తగ్గించు '' అంది భర్తతో లేడీ రోగి.

బస చేసిన 'టోకియో అకసాకా హోటల్' మన దేశంలోని చిన్న టౌనంత వుంది. పెద్ద-పెద్ద కారిడార్స్‌తో, స్విమ్మింగ్ పూల్స్‌తో అందమైన పెద్ద హోటల్ అది. రెండు రోజులు టోకియోలో వుండి చూడ తగిన ప్రదేశాలన్నీ చూచాము. ఒక్కొక్క డిపార్టుమెంట్ స్టోరుకూడ చిన్న టౌనంత వుందనిపించింది ఎస్కలేటర్స్ మీద వెళ్ళటం మొదట రెండు రోజులు భయమనిపించింది కాని. తరువాత అలవాటు పడ్డాం నాలాంటి వాళ్ళం. అక్కడ టూరిస్టు బస్సువారు డిపార్టుమెంట్ స్టోరు చూపించడానికి తీసికెళ్ళినపుడు అన్నీ ఫ్లోర్స్ చూపించి ఒకచోట మాకు అల్పాహార విందు యిచ్చి. దానితో పాటు గైషా కన్యలతో కిమోనా డ్రస్సు ప్రదర్శన చూపించారు అంత పెద్ద బరువైన ఆ డ్రస్సు. ముఖ్యంగా నడుముకు చుట్టుకునే అందమైన బట్ట చాలా పొడవుండటం వల్ల, ఆ బరువు అతి నాజూకైన ఆ స్త్రీలు ఎలా మోయగలుగుతారో అనిపించింది. మరో రోజు టీ ప్రదర్శనకు వెళ్ళాము టీ ఆకు బాగా ఎండక ముందే వారు గ్రీన్ టీ అని వాడతారు. పాలు, చక్కెర లేకుండా త్రాగుతారు వారు. పసరు వాసనతో చేదుగా వుంటుంది. మనం తాగలేము వారికి అలసట తెలియనీయదు వంటికి మంచిది అంటారు. బొమ్మలు తయారు చేసే ఫ్యాక్టరీ చూచాము. చేతితో తయారు చేసే అందమైన ఆ బొమ్మలు స్త్రీలే ఎక్కువ తయారు చేస్తారు.

## హాంకాంగ్

టోకియో నుండి హాంకాంగ్ విమానంలో వెళ్ళాము. విమానం క్రిందికి దిగుతున్న కొద్దీ హాంకాంగ్ పరిసరాలు, పాత గోడలు, కట్టడాలతో మిగతా చోట్లంత ఆకర్షణీయంగా లేదు. కాకపోతే ఐలెండ్ మాత్రం విమానం నుండి క్రిందకు చూస్తుంటే చాల అందంగా కనిపించాయి. నీలిరంగు సముద్రం చుట్టూ కనిపిస్తోంటే మధ్య-మధ్య చిన్న-చిన్న ద్వీపాలు చాలా కనిపిస్తాయి సముద్రానికి ఐలెండ్స్ నేలకు మధ్య యిసుక గట్లులు తీర్చి దిద్దిన బంగారు అంచుల్లా కనిపిస్తాయి. అవి మాత్రం చాలా ఆకర్షణీయమైన దృశ్యాలు. మేము బస చేసినది కొవలూన్ అనే చోట. హాంకాంగ్ అనేది ఒక ఐలెండ్.... హాంకాంగ్ కొవలూన్ రెండు ప్రదేశాలకు మధ్య సముద్రం వుంది. ఈ రెండు చోట్లకు కార్లు బస్సులు వగైరా బోటుమీద ఎక్కించి సముద్రం మీదుగా రాకపోకలు జరుగుతాయి. మేము కొవలూన్ అంతా చూచి హాంకాంగ్ వెళ్ళాము. సముద్రం దాటి హాంకాంగ్ సిటీ, బీచ్, టైగర్‌బామ్ కొండల్లోని అందమైన శిల్పాలు, పార్కులు చూచాము. అవన్నీ చూచి తీరాల్సిన దృశ్యాలు. హాంకాంగ్‌లోని ప్రజల ప్రవర్తన మాత్రం మన ఇండియాను గుర్తుతేకపోలేదు. ప్రజలలో నమ్రత తక్కువ. జపానువారి విధేయతతో పోల్చి చూస్తే ఏమీ పీరింక దురుసుగానున్నారు అను




తున్నాము. షాపుల్లో కూడా బేరం చేయడం మోసం వున్నది. జపాన్ షాపుల్లో అలాటి దెక్కడా కనిపించలేదు. హోటల్లో బోయ్‌ని టైమడిగితే కూడ కసరి కొట్టి నట్లుండేది వాడి జవాబు.

హాంకాంగ్‌లో రెండు రోజులు గడిపి సింగపూర్ చేరాము. మా యాత్రలో చివరి భాగమది.

## సింగపూర్

సింగపూర్ సిటీ చాలా అందంగా-అతి పరిశుభ్రంగా వుంది. ముఖ్యంగా రోడ్ల మీద మన దేశంలోలా ఏ చెత్త కాగితాలైనా యిష్టం వచ్చినట్లు నిర్లక్ష్యంగా పడేస్తే అక్కడి గవర్నమెంటు ఫైన్ వేస్తుందట. అందువల్ల అక్కడి ప్రజలు ఏమైనా పారవేసే వస్తువులు, చిన్న కాగితం ముక్కయినా సరే నిర్ణీత ప్రదేశంలో వేయడానికి అలవాటు పడ్డారు. మన గవర్నమెంటుకూడ అలాటి చర్యలు తీసుకోవడానికి, ప్రజలు పాటించడానికి అలవాటు పడితే ఎంత బాగుండును!!....

మేము విజిట్ చేసిన అన్ని ప్రదేశాల్లో కూడ ఏ విధమైన జంతువులను రోడ్డుమీద చూడలేదు.

సింగపూరులో యించుమించు అన్ని దేశాల వస్తువులు అనువైన ధరలకు దొరుకుతాయి. మంచి షాపింగ్ సెంటర్ సింగపూరు. అందువల్లనే ట్రేడ్వింగ్స్ వారు మా టూర్‌లో చివరి భాగం సింగపూర్ అన్నారనుకుంటాను. మొత్తం మీద వారు అన్నిచోట్ల మంచి ఏర్పాట్లు చేశారు. ఇండో-నిప్పన్ సొసైటీ వారు యిలా ఏర్పాటు చేసిన జపాన్ టూర్‌లో మొదటి గ్రూపు మేమేననుకుంటాను. కొన్ని చిన్న చిన్న చికాకులున్నా మొత్తంమీద అనుకోకుండా బయల్దేరిన నాయీ జపాను యాత్ర బాగానే జరిగింది. సింగపూర్‌లోని టైగర్ బామ్ కొండల్లోని రంగుల, శిల్పాలు, చిత్రాలు చూడతగిన దృశ్యాలు....మా గ్రూపంతా చాలా వరకు సింగపూరులోనే షాపింగ్ చేసుకుని మద్రాసు చేరుకున్నాము.



# సరాగమాల

## సినిమా పాటల పోటీ

### రూ 960-00 ల బహుమతులు

ప్రవేశ రుసుము లేదు. టిక్కట్ల ముక్కలు, కత్తిరించిన కూపన్లు పంపే యిక్కట్లు అసలే లేవు!

అతి సులభం! సినిమా సంగీతంపై మీ అమూల్యాభిప్రాయాలు నిర్మాతల దృష్టి లోనికి తీసుకు వస్తూ చక్కని బహుమతులు గెల్చుకొనటానికి మరో అవకాశం!

జయప్రద పిక్చర్స్ వారి

**"పండంటి కాపురం"** పది బహుమతులు

రూ 600-00 అదనంగా రూ 150-00 నగదు బహుమతులు

ఉషశ్రీ ప్రొడక్షన్స్ వారి

**"మానవుడు దానవుడు"** అయిదు బహుమతులు

రూ 360-00 అదనంగా రూ 150-00 నగదు బహుమతులు

## మా దే నిబంధనలు

1. పాటలను ప్రత్యేకంగా గమనిస్తూ పై చిత్రాలను చూచి సంగీత, సాహిత్య, సన్నివేశాల దృష్ట్యా వాటిపై మీ విమర్శ ఇన్‌లాండ్ కవరులో ఒక ప్రక్కనే వ్రాయండి.

2. ఒక కవరులో ఒక సినిమా సంగీతం గురించి మాత్రమే వ్రాయాలి కవరు పైన సినిమా పేరు, దిగువ విలాసం ఇంగ్లీషులో వ్రాసి గడువులోగా చేరేటట్టు పంపండి.

3. కవరు వెనుక మీ పూర్తి పేరు, విలాసం వ్రాయండి.

పై వాటిలో ఏ ఒక్క నిబంధనా అతిక్రమించగూడదు.

ముగింపు తేదీ సెప్టెంబరు అయిదు. సెప్టెంబరు 14వ తేదీకంతా నగదు మనియార్డరు ద్వారా తక్కిన బహుమతులు (42 రూపాయలు చేయు రికార్డులు, పుస్తకాలు) రిజిస్టర్ పోస్టు ద్వారా విజేతల కంద గలవు. అక్టోబరు సంచికలో విజేతల జాబితా చూడవచ్చు.

**V. A. K. RANGA RAO**

1, PYCROFTS GARDENS

**MADRAS-6**




శ్రీరామ్ ఫిలింస్

## నిజం నిరూపిస్తా

అన్యాయాలకు, అక్రమాలకు పెట్టింది పేరుగా దినదినాభివృద్ధి చెందుతున్న నేటి మానవ సమాజంలో నిజానికి తావు లేకుండా పోతూంది. నిజాన్ని గుర్తించ లేని ఈ కుళ్లు సమాజంలో దుర్మార్గుల కబంధహస్తాలలో ఎంతోమంది అమాయ కులు అమ్మ వారికి బలిపశువుల్లా బలై పోతున్నారు. అయినా సమాజం కళ్లు తెరవదు. తెరవాలని వున్నా తెరవలేదు. కారణం ఆ దుర్మార్గులు కూడా సమాజా నికి సంబంధించిన వారే!

అమాయకులెంతమందో మేము సమాజరక్షకులం అనే వారి కత్తులకు ఆహుతైపోతున్నారు. ఈ అన్యాయాన్ని సహించలేని వారు ఎదురు తిరిగితే వారు అసలు అటువంటి అకార్యమే చేయలేదని వారు చాలా నీతిమంతులనీ ప్రభుత్వం కూడా నిరూపిస్తుంది. ఇది ప్రభుత్వం తప్పుకాదు. ప్రభుత్వాన్ని, న్యాయాన్ని చేజిక్కించుకొని నాటకమాడే దుర్మార్గులది. ఇది నాటినుండి నేటివరకు అక్షరాలా జరుగుతున్న చరిత్ర!

ఒకానొక ప్రదేశంలో అబలలను చెర స్తారు. వారు ఎదురు తిరిగితే ప్రాణాలు తీసి, ఆత్మహత్య అంటూ సముద్రంలో పారేస్తారు. అది కేవలం ఆత్మహత్య అంటూ పవిత్ర న్యాయ స్థానంలో కూడా నిరూపిస్తారు. ఇందులో న్యాయం చెప్పే వారు, నిరూపిస్తున్నవారు. న్యాయం విన్నవారుకూడా అన్యాయాన్ని న్యాయంగా, అబద్ధాన్ని నిజంగా ప్రజలకు తెలియ జేస్తారు.

కాని ప్రజ మోసపోదు. న్యాయానికీ, నిజానికీ యింకా జీవంపోలేదు న్యాయాధి పతులు దగుల్బాజీతనం ఏదో ఒకానాడు బయట పడకపోదు. ఇది చరిత్ర చెప్పే సత్యం!

అడుగడుగునా భావ స్పందనతో భీకర పోరాటాలతో నేటినుంచి నాటి వరకు సంఘంలో జరుగుతున్న కుళ్లుతో చక్కగా చిత్రీకరించిన రంగుల చిత్రం శ్రీరామ్ ఫిలింస్, 'నిజం నిరూపిస్తా!'-విశాలాంధ్ర అంతటా అతిత్వరలో లక్ష్మి ఫిలింస్ ద్వారా విడుదలవుతున్న గొప్ప అపరాధ పరిశోధక చిత్రం!

కృష్ణ, విజయలలిత, జ్యోతిలక్ష్మి, హెలెన్, లక్ష్మీఛాయ, ప్రభాకరరెడ్డి,

సత్యనారాయణ, రాజబాబు, ఏడిద నాగేశ్వరరావు, పండరీబాయి, మొదలగు ప్రముఖ తారాగణంతో నిర్మించిన గొప్ప చిత్రం.

ఛాయాగ్రహణం, నిర్మాత, దర్శకత్వం: జానకీరామ్; సంగీతం: సత్యం.

సోల్ డిస్ట్రిబ్యూటర్స్ లక్ష్మీ కంబైన్స్.

## అభిమానవంతులు

జ్యోతిలో ధారావాహికంగా ప్రచురింపబడిన 'విజేత' నవల ఆధారంగా ఉన్న పూర్ణ ఆర్ట్‌పిక్చర్స్ వారు నిర్మిస్తున్న ప్రొడక్షన్ నం-2. రంగుల చిత్రానికి 'అభిమానవంతులు' అని నామకరణం చేశారు నిర్మాత శ్రీ దుక్కిపాటి మధుసూధనరావుగారు. ప్రేక్షకులే పేరు నిర్ణయించాలని వారు పత్రికల్లో ప్రచురించిన మీదట కొన్ని వేల ఉత్తరాలు వచ్చాయి. ఎన్నుకొనిన పేర్లనుండి ఓ పదిదాకా బాగున్నాయన్నారు. కానీ "అభిమాన వంతులు" అనేది చిత్రకథకు సరైన పేరు కావటం వలన 'అభిమానవంతులు' పేరు నిర్ణయించారు.

అక్కినేని నాగేశ్వరరావు, వాణిశ్రీ, యస్. వి. ఆర్, గుమ్మడి, లీలారాణి,



శ్రీరామ్ ఫిలింస్ వారి "నిజం నిరూపిస్తా" చిత్రంలో జ్యోతిలక్ష్మి.

---

సూర్యకాంతం, రాజ్‌బాబు, పద్మనాభం ముఖ్యభూమికలు ధరిస్తున్నారు.

దర్శకత్వం : ఆదుర్తి సుబ్బారావు; నిర్మాత: దుక్కిపాటి మధుసూదనరావు, విడుదల: అన్నపూర్ణ.



నాగభూషణ సమర్పించు శశి థియేటర్స్ ప్రైవేట్ లిమిటెడ్ వారి "ప్రజానాయకుడు"లో నాగభూషణం, గీతాంజలి.

---

## వింత దంపతులు

స్త్రీ జీవితం వింతయినది. తన వ్యక్తిత్వంతో, సహనంతో, ప్రేమానురాగలతో కుటుంబాన్ని తీర్చిదిద్దుతుంది. సమాజాన్ని ముందుకు నడిపిస్తుంది. ఆదర్శగృహిణిగా అనురాగ మూర్తిగా తనబిడ్డ భవిష్యత్తుకోసం ఎన్ని ఇక్కట్లయినా ఎదుర్కొంటుంది.

ఇలాంటి ఔన్నత్యం కలిగిన స్త్రీమూర్తి కుటుంబగాధను ప్రముఖ దర్శక, నిర్మాత శ్రీ కె. హేమాంబరధరావు సుభాషిణీ ఆర్ట్ పిక్చర్సు పతాకం క్రింద—"వింత దంపతులు" పేరిట ఒక క్రొత్త చిత్రాన్ని తయారు చేస్తున్నారు.

స్త్రీ దశలోని మూడు దశలు రసవత్తరంగా రూపొందించబడిన ఈ చిత్రంలో జమున కథానాయిక, కృష్ణంరాజు నాయకుడు. నాగభూషణం, అల్లురామలింగయ్య, చంద్రమోహన్, కృష్ణకుమారి, జయ, రావికొండలరావు, పెరుమాళ్లు, నాగయ్య, క్రొత్త నటుడు బాబూరావు యీ చిత్రంలోని యితర ప్రధాన తారలు.

'కథానాయకుడు'తర్వాత మళ్ళీఅంతటి పటుతరమైన సంభాషణలు ఈ చిత్రానికి ఓమిడిపాటి రాధాకృష్ణ రాశారు. ఈ చిత్ర

కథనుకూడా ఆయనే రూపొందించారు. కోదండపాణి సంగీతం, బి. యస్. కృష్ణ కళ, బి. గోపాలరావు కూర్పు నిర్వహిస్తున్న యీ చిత్రానికి కెమెరా: శేఖర్, సింగ్; నిర్వహణ: కె. మహేంద్ర, నిర్మాత, దర్శకుడు: కె. హేమాంబరధర రావు. ఆగస్టులో పూర్ణాపిక్చర్స్ వారి ద్వారా ఆంధ్రప్రదేశ్ అంతటా విడుదల కానున్న చిత్రమిది.



శ్రీ లక్ష్మి ప్రొడక్షన్స్ "పాపం పసివాడు" పూర్తి రంగుల చిత్రంలో మాస్టర్ రాము.

## జీవితం

ప్రముఖ రచయిత్రి శ్రీమతి పి. ఆనందరామం వ్రాసిన 'ప్రేమ సూత్రం' నవల ఆధారంగా నిర్మాతలు శ్రీయుతులు సూర్యచంద్రరావు. గిరిబాబులు శ్రీధర్ ప్రొడక్షన్స్ బ్యానర్‌లో బాక్సాఫీస్ డైరెక్టర్ శ్రీ కె. యస్. ప్రకాశరావు దర్శకత్వంలో నిర్మిస్తున్న 'జీవితం' చిత్రం శరవేగంలో తయారవుతూంది.

హృద్యమైన యితివృత్తం, ఉదాత్తమైన సంఘటనలు విశిష్టమైన పాత్రపోషణతో నిండిన యీచిత్రంలో శోభన్‌బాబు, శారద, జయంతి, కృష్ణంరాజు, నిర్మల, కె. వి. చలం, విజయభాను మొదలైన వారు ప్రధానభూమికలు నిర్వహిస్తున్నారు. కొత్తనటుడు వివేకానంద్, కొత్తనటి జయను ఈ చిత్రంలో పరిచయం చేయబడుతున్నారు.

శ్రీమతి పి. ఆనందరామం కథకు శ్రీ భమిడిపాటి రాధాకృష్ణ సంభాషణలు వ్రాశారు. పాటలు: డా॥ పి. నారాయణ రెడ్డి; సంగీతం: శ్రీ రమేష్‌నాయుడు. ఆర్టు: మోహన; ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్: జె. వి. కృష్ణారావు, అసోసియేట్ డైరెక్టర్: కె. రాఘవేంద్రరావు, నిర్మాతలు: సూర్యచంద్రరావు, గిరిబాబు, స్క్రీన్ ప్లే, దర్శకత్వం: కె. యస్. ప్రకాశరావు. విడుదల: లక్ష్మి ఫిలింస్.

## జీవన తరంగాలు

మనుష్యుల ప్రవర్తన బట్టి వారి ప్రవృత్తులు నిర్ణయించటం పొరపాటు. కొందరి ప్రవర్తన అనుమానస్పదంగా వున్నా



శ్రీధర్ ప్రొడక్షన్స్ 'జీవితం' ప్రారంభ సమయంలో జయంతి•
శోభన్‌బాబుక్లాప్ కొడుతున్న లక్ష్మీ కంబైన్స్ మేనేజింగ్ పార్టనర్
శ్రీ కె. జయదేవ్.

---

బుద్ధి. గుణం మేలిమి బంగారంలా ఉంటుంది. కొందరు పైకి ఎంతో పత్తిత్తులగా కనిపించినా చాటు మాటు వ్యవహారాల్లో ఆరితేరి వుంటారు. అలాగే ఒక వ్యక్తి పతనం అవటానికి కూడా పరిస్థితులే కారణభూతమవుతాయి. ఉన్నత వంశంలో జన్మించిన వారైనా కుసంస్కారంతో ఆధునిక నాగరికతకు లోబడి జీవితాన్ని వక్రమార్గంలో నడుపుకున్న వారెందరో వున్నారు. ఈ సత్యాలన్నింటినీ క్రోడీకరించి శ్రీమతి యద్దనపూడి సులోచనారాణి రచించిన 'జీవన తరంగాలు' నవల ఆధారంగా అదే పేరు మీద సురేష్ మూవీస్ అధినేత. ఉత్తమ చిత్ర నిర్మాత అయిన శ్రీ రామానాయుడు రచయిత్రి భావకల్పనకు రూపకల్పన చేసి, నవలకు అమరత్వాన్ని చేకూర్చటానికి గొప్పకృషి చేస్తున్నారు.

బాక్సాఫీస్ డైరెక్టర్ శ్రీ తాతినేని రామారావు దర్శకత్వంలో నిర్మింపబడుతున్న యీ చిత్రం తాలూకు రెండు షెడ్యూళ్ళు యింతవరకూ పూర్తయినాయి

ఎంతో ఖర్చుతో భారీయెత్తున నిర్మింపబడిన లాయరు విజయ్ యిల్లు శ్రీ రామా

నాయుడి ఉత్తమ అభిరుచికి ఒక నిదర్శనం.

శోభన్‌బాబు, కృష్ణంరాజు, చంద్రమోహన్, గుమ్మడి, పద్మనాభం, వాణిశ్రీ, లక్ష్మి, సూర్యకాంతం మొదలగు హేమాహేమీలు పాల్గొంటున్న ఈ చిత్రానికి మాటలు: పినిశెట్టి, కెమెరా: ఎస్. వెంకటరత్నం, సంగీతం: రాఘవులు, అసోసియేట్ డైరెక్టర్: చెరువు ఆంజనేయ శాస్త్రి.

దర్శకత్వం: తాతినేని రామారావు నిర్మాత: డి. రామానాయుడు. విడుదల: నవయుగ.

## భక్త తుకారాం

అంజలీ పిక్చర్స్ కంబైన్స్ 'భక్త తుకారాం' ఈస్ట్‌మన్ కలర్ చిత్రం హైదరాబాద్ సారధి స్టుడియోలో శరవేగంతో తయారవుతూంది. జూలై పది హేను నుండి యిరవై ఒకటి వరకు జరిగిన రెండవ షెడ్యూలులో చిత్రంలోని ముఖ్య తారాగణమంతా పాల్గొన్నారు

చిత్రానికి సంబంధించిన సెట్టింగులు, నటీనటుల వేషాలంకరణ, సంగీతపు బాణీలు వక్తు మహారాష్ట్ర పద్ధతులలో కొనసాగుతూంది.

నిర్మాతలు, సాంకేతిక నిపుణుల సహకారంతో తుకారాం చిత్రకథను పాతపక్కీకిగా కాకుండా అనేక గ్రంథాలను శోధించి, వాటి ఆధారాలతో కథను క్రొత్త పంథాలో మలచారు.



అన్నపూర్ణ ఆర్టు పిక్చర్స్ ''అభిమానవంతులు'లో'' అక్కినేని.

తారాగణం; నాగేశ్వరరావు, అంజలీదేవి, నాగభూషణం (గెస్ట్), సాక్షి రంగారావు, జూ. శ్రీరంజని, మాస్టర్ రాము, బేబి శ్రీదేవి, అతిధి నటుడు శివాజి గణేషన్ ప్రముఖ పాత్ర ఛత్రపతి శివాజీగా కనపిస్తారు. ప్రముఖ నటి కుమారి కాంచన ఒక ప్రముఖ పాత్ర నిర్వహించ బోతూంది.



"రామరాజ్యం" షూటింగ్ ప్రారంభోత్సవ సందర్భంలో లక్ష్మీ ఫిలింస్ మేనేజింగ్ పార్టనర్ శ్రీ బి శివరామకృష్ణయ్య కెమెరా స్విచ్ ఆన్ చేస్తుండగా డైరెక్టర్ బాబూరావు, నిర్మాత ప్రభాకర్, కెమెరామన్ యస్. యస్. లాల్ చూస్తున్నారు.

---

సాంకేతిక నిపుణులు : స. భాషణలు - వీటూరి; సంగీతం ఆదినారాయణరావు, దర్శకుడు వి. మధుసూదనరావు; లక్ష్మీ ఫిలింస్ విడుదల.

ఆజన్మ బ్రహ్మచారి

'ఇనుపకచ్చరాల్ కట్టుకొను! మునిముచ్చు
లెల్ల
తామరసనేత్రలిండ్ల బందాలుకారే!'

అవి అలనాడు అల్లసాని పెద్దన మను చరిత్రలో వరూధినిచేత ప్రవరుణ్ణి నానా చివాట్లు పెట్టించాడు. ఆరదానివంక కన్నెత్తి కూడా చూడం. మేం సాక్షాత్తూ అపర ఆంజనేయులం అని ప్రగల్భాలు పలికే వారందరూ ఆడగాలి సోకితేచాలు అయి సయిపోయి కొంగు పుచ్చుకు వెంటపడ తారు.

మారుతీరావు పరమనారీ ద్వేషి - స్త్రీ అన్నా, సంసారం అన్నా చెప్పరాని అసహ్యం. తన ఆఫీసులో కూడా ఎటు

వంటి ప్రేమకలాపాలూ జరగకూడదనే కట్టడిచేసిన ప్రేమ ద్వేషి, ఆ స్త్రీ ద్వేషిని మార్చటానికి అతనికి అయిన వాళ్ళందరూ పడ్డ శ్రమే రేఖా అండ్ మురళీ ఆర్ట్స్ వారి హాస్యరస ప్రధాన చిత్రం ''అజన్మ బ్రహ్మచారి''!

ఆడదాని గాలి కూడా సోకకూడదని నియమం పట్టిన ఋష్య శృంగుడు, విశ్వామిత్రుడు, పరస్త్రీ పరాన్ముఖులు అందరూ చివరకు కాంతాచరణచారణ చక్రవర్తులైనట్టే మారుతీరావు కూడా మారుతాడా?

తమిళభాషలో అపూర్వ ప్రేక్షక ఆదరణపొందిన నాటకం శ్రీ గుహనాదన్ రచన 'కాశీయాత్ర' ఆధారంగా ప్రముఖ హాస్య నటుడు నిర్మాత, దర్శకుడు శ్రీ పద్మనాభం నిర్మిస్తున్న ''అజన్మ బ్రహ్మచారి'' చిత్రానికి జూన్ ఏడున సశాస్త్రీయంగా పూజ జరిపి రికార్డ్ చేయబడ్డాయి, జూన్ పన్నెండు నుంచి యిరవై ఒకటి వరకు సాతనూర్ డామ్ దగ్గర మూడు పాటలు కొన్ని దృశ్యాలు చిత్రీకరణ జరిగింది.

ముఖ్య పాత్రలలో నాగభూషణం, పద్మనాభం, రాజబాబు రామకృష్ణ, గీతాంజలి, లీలారాణి మొదలైన ప్రముఖ తారాగణంతో నిర్మించబడుతున్న ఈ చిత్రానికి సంభాషణలు: పాలగుమ్మి పద్మరాజు, సంగీతం: ఎస్. పి. కోదండపాణి,



గణేశ్ పాత్రతో నాటిక ''కొడుకు పుట్టాల'' తిలకించి ముగ్ధులైన శ్రీగుమ్మడి వెంకటేశ్వరరావుతో పకీరు పాత్రధారి. ఉత్తమ నటుడు బహుమతి గ్రహీత శ్రీ పి. కృష్ణచైతన్య.

---

నిర్మాత: బి. పురుషోత్తం, దర్శకత్వం: బి పద్మనాభం.

ఆంధ్ర సీడెడ్: లక్ష్మి ఫిలింస్,

నైజాం: పద్మ పిక్చర్స్ విడుదల.

## రామరాజ్యం

రామవిజేతా ఫిలింస్ నిర్మిస్తున్న 'రామ రాజ్యం' పేరు పౌరాణికం [illegible] చిత్రం [illegible]. సుందరం, సత్య శ్యామలం [illegible] రామరాజ్యం [illegible] [illegible]. దాతృత్వానికి పెట్టింది పేరు



ఆర్. ఎస్. మూవీస్ వారి "మల్లమ్మ కథ" ప్రారంభోత్సవం సెట్‌లో శ్రీ భుజంగరావు, ఎల్. వి. రామయ్య, ఎ. ఆర్. కె. మూర్తి, దర్శకులు సంజీవి, నిర్మాత చెంచురామయ్య, కె. వి. రావులను కూడా చూడవచ్చును.

---

రామరాజ్యం. ఐకమత్యానికి ఆలవాలం రామరాజ్యం. సమ్మెలు, వివాదాలు లేనిది రామరాజ్యం. నల్ల బజారు, నల్ల డబ్బు తెలియనిది రామరాజ్యం. ఈర్ష్యలు, కుచ్చితాలు, కుతంత్రాలు చెవిన పడనిది రామరాజ్యం. రాజకీయ నాయకుల రభసలు, ఓటుకోసం కొట్లాటలు, కులమత తత్వాలు, భాషా, రాష్ట్ర సంకుచిత తత్వాలు అంటే ఏమిటో ఎరుగనిది రామరాజ్యం. ఒక్క మాటలో చెప్పాలంటే - న్యాయనిలయం. ధర్మదేవత నాలుగు పాదాల నడచిన రామరాజ్యం.

అటువంటి మహోన్నతమైన ఆధునిక రామరాజ్య సంస్థాపన కోసం తీవ్రంగా కృషి చేసి, ఎదురైన కష్టాలన్నింటినీ సహించి, స్వార్థపరుల బెదిరింపులకు ఎదురు తిరిగి, దేశాన్నంతా కాకపోయినా తను వున్న గ్రామం మేరకైనా 'రామ

రాజ్య' సంస్థాపన చేయటానికి కృషి చేసిన ప్రగతి శాలి చక్కని గాథే రామ విజేతా వారి 'రామ రాజ్యం'. హృద్యమైన కథా విధానం, ఉత్కృష్టమైన పాత్రలు, ఆద్యంతాలు రసవత్తరంగా నడిచే ఈ చిత్రం ఆంధ్ర పాఠకుల ఆదరాభిమానాలు పొందిన నవల 'దీపశిఖ' ఆధారంగా నిర్మించబడుతోంది.

జగ్గయ్య, యస్. వి. రంగారావు, గుమ్మడి, రాజబాబు, అల్లురామలింగయ్య లక్ష్మణ్, కొత్త నటుడు సత్యన్నారాయణ దీక్షిత్, సావిత్రి, చంద్రకళ, రోజా రమణి మొదలైన ప్రముఖ తారాగణంతో శరవేగంతో నిర్మించబడుతున్న ఈ చిత్రానికి సంభాషణలు: భమిడిపాటి, సంగీతం: ఘంటసాల కెమెరా: మాధవ బుల్ బులే, ఆర్ట్: ప్రభాకర్, అసోసియేట్ డైరెక్టర్: నాగేశ్వరరావు.

దర్శకత్వం: కె. బాబూరావు, నిర్మాత: కె. ఎ. ప్రభాకర్, లక్ష్మీ ఫిలింస్ విడుదల.



విశాలాంధ్ర అంతటా
విజయ విహారం చేస్తున్న
"కోడలు పిల్ల"లో
కె. ఆర్. విజయ.

## శ్రీకాంత్ అండ్ శ్రీకాంత్ ఎంటర్ ప్రైజెస్ ప్రొడక్షన్ 11

వ్యసనానికి బానిసై, స్వార్థానికి మనిషి దాసుడైనప్పుడు తప్పకుండా ఏదో నేరం చెయ్యటం సహజం అటువంటి వ్యక్తి హృదయంలో దయ, జాలి, సంస్కరణ

దీపం పెట్టి గాలించినా దొరకని నేరం చేసిన వ్యక్తికి న్యాయశాస్త్రరీత్యా చట్ట పూర్వకంగా శిక్షించటం సహజం ఐతే ఆ శిక్ష మనిషిలో శారీరకంగా మార్పు తెస్తుందిగాని, మానసిక పరావర్తన చెంది మంచి మార్గాన పెట్టదు చేసిన తప్పు తెలియచెప్పి పశ్చాత్తాపం అనే అగ్నిలో పవిత్రమైనవాడే మనిషిలో స్థిరమైన పరివర్తన కలగుతుంది.

కట్లు తెంచుకున్న ఆంబోతు లా



"కత్తుల రత్తయ్య"లో ఒక చక్కని సన్నివేశం.

సంఘం కట్టుబాటును తప్పివ్యవహరించిన వ్యక్తిహృదయాన్ని శిక్షతోగాక ప్రేమతో జయించటానికి జరిగిన ప్రయత్నమే సుందర్‌లాల్‌నహతా సమర్పించు శ్రీకాంత్ అండ్ శ్రీకాంత్ వారి మహోజ్వల చిత్రం ప్రొడక్షన్ నెం-11.

ఉన్నతాదర్శాలు, ఉత్తమ అభిరుచులు గల విఖ్యాత దర్శకులు శ్రీ కె. యస్ ప్రకాశరావు దర్శకత్వంలో తయారవుతున్న ఈ ప్రబోధాత్మక, ప్రయోజనాత్మక చిత్రంలో శోభన్‌బాబు, నాగయ్య, నాగభూషణం, రమణారెడ్డి, కాంచన, యస్. వరలక్ష్మి, జయ వీరితో పాటు కొత్తనటుడు వివేకానంద్ పరిచయం చెయ్యబడుతున్నారు.

రచన: సముద్రాల; సంగీతం: ఆది నారాయణరావు; కెమెరా: శ్రీకాంత్: నిర్వహణ: ఎన్. రామదొరై; ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్: మధుభాయ్ పటేల్. నిర్మాతలు: శ్రీకాంత్ నహతా, శ్రీకాంత్ పటేల్. దర్శకత్వం: కె. ఎస్. ప్రకాశరావు. విడుదల: రాజశ్రీ రిలీజ్.